


## సీరియల్స్

"ఈతరం యువతి" చాలా హృద్యంగమంగా ఉంది. రచయితకు ధన్యవాదాలు

—కుమారి రమణి, మణి, గోపి, న్యూఢిల్లీ

★ ★ ★

"ఈతరం యువతి" సీరియల్ ఆసక్తికరంగా సాగుతోంది. —కొసనా సాయిప్రసాద్, రాజమండ్రి

★ ★ ★

సరికొత్త పంథాలో నడుస్తున్న సీరియల్ 'మంజీర నాదం' ఊహాకందని మలుపులు తిరిగి ఉత్కంఠతను కలిగిస్తోంది.

—మంతెన విజయలక్ష్మి, విజయవాడ

★ ★ ★

"మంజీర నాదం", "డి యస్. పి. విజయ్" సీరియల్స్ బాగున్నవి కొత్త తరహా సీరియల్ ఈతరం యువతి" చాలా బాగున్నది

—సుస్మిత, దినకర్‌పాండే, బొంబాయి

★ ★ ★

ఆదుర్తి సావిత్రిగారి సీరియల్ 'డి. ఎస్. పి విజయ్" చదువుతున్నంత సేపు సమయం తెలియడం లేదు చాల ఆసక్తికరంగా సాగు తున్నది

—యర్రంశెట్టి వీరాస్వామి, నాగవేణి, హెచ్ సి ఎల్. టౌన్‌షిప్

## కథలు

శోభన ముఖచిత్రంతో వెలువడిన ఆం పత్రిక చాలా బాగుంది అందులో "టీ" కథ చాలా బాగుంది

—రావెళ్ళ ప్రసూన, బలిజేపల్లి

★ ★ ★

13–19 శోభన ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. "ఆవేశానికి అవతలి ఒడ్డు" కథ నేటి సమాజానికి దర్పణం పట్టింది. "తెగించు, దేవీ కోపమా, టీ, చెమ్మగిల్లు నయనమ్ము" కథలు కూడా చాలా బాగున్నాయి.

—శ్రీపాద నాగరాజా, ప్రియా అగ్రహారం

## వ్యాసాలు

13–19 నవంబర్ 87 వ సంచిక నందు ప్రచురించిన "అమెరికన్ తెలుగు యువత సృష్టీకరణ" చాలా బాగుంది దాని యందు గల అనంతనేని సునీతగారి భావాలు, హాబీలు నాకు నచ్చాయి —బి. పద్మావతి, కాకినాడ

## దిగ్భ్రాంతి

మహాకవి డా "దాశరథి"గారు మరణించారన్న విషయం తెలిసిన నేను దిగ్భ్రాంతి చెందాను. ఆయన సినీ కవియేకాక, విప్లవ కవి కూడ. ఆయన టి. టి దేవస్థాన కవిగా కూడా ఉన్నారు. అటువంటి కవి మనకు దూరమవడం మన దురదృష్టం.

—చావలిరామం, రాజమండ్రి

## శ్రీ హనుమదింద్రగంటి

ఆ కంటి సొగసులో అలరారును గదోయి
'పాటల మంజరి' నీటుగోటు
ఆ కన్నోమల తీవి అందగించుగదోయి
నవ్య 'ద్రాక్షాతోరణం'పు రేవ
ఆ కుల్కు పల్కులో అతిశయిల్లు గదోయి
విలసత్ కథా సుధాలలిత కాంతి
ఆ చిరు నవ్వులో అగుపించునుగదోయి
ప్రియముగా 'రంగవల్లిక' హొరంగు
ఆ విశాల ఫాల మందలౌకిక తేజ
'మారు ఋతువు' లౌచు సొరులొల్కు
రమ్య సౌమ్య దృష్టి రాజిల్లు ముక్కంటి
"హనుమదింద్రగంటి" అమరుడయ్యె!"

-డా. రామడుగు వెంకటేశ్వరశర్మ, భీమవరం □




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

11-17 డిసెంబర్, '87
శ్రీ ప్రభవ నామ సం. మార్గశిర బ. షష్ఠి
సంపుటము 80 : సంచిక 16

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2.75. |
| పోస్టులో 6నెలల చందా | రు | 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు | 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హిందీ నటి పూనమ్ ధిల్లాన్
(ఫొటో : కె. ఆర్. వి. భక్త)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



# రాజీవ్‌గాంధీని గద్దె దించేందుకే మధ్యంతర ఎన్నికలు!

రాజీవ్ గాంధీ దురదృష్ట వంతుడు ఆయన చేసిన ప్రతి పనీ ఆయనకు ఎదురు తిరుగుతూనే ఉంది. కొందరికి దివ్య శక్తులుంటాయి, వారికి పట్టిందల్లా బంగారం అవుతుంది. రాజీవ్ గాంధీకి కూడా అటువంటి దివ్య శక్తి ఉంది గాని అది వికృతమైనటువంటిది. ఆయన ముట్టుకున్న దల్లా ఒక గందరగోళంగా మారి పోతుంది.

పంజాబ్, శ్రీలంక అయిపోయిన తర్వాత ఆయన మరిన్ని కష్టాల్ని కోరుకుంటున్నారు. పార్టీలో ఆయనకి అనుకూలంగా ఉండే పత్రికలలో ఉన్నటువంటి ఆయన ఆశ్రితులు మధ్యంతర ఎన్నికలు గురించి వార్తలు ప్రచారం చేస్తున్నారు. ఒక ఢిల్లీ వార్తా పత్రిక కథనాన్ని వివరంగా ప్రకటించింది. కాని మర్నాడే అతివేగంగా దానికి ఖండన కూడా వచ్చింది దాన్ని బట్టి అర్థమయ్యే దేమిటంటే పొగ ఉన్న చోటనే నిప్పు కూడా ఉంది. ఇప్పుడు ఇంకా ఎటువంటి వదంతులు వ్యాపిస్తున్నాయంటే ఈ ఎన్నికలకు తేదీ కూడా నిర్ణయమయిందట. మార్చ్ 10న, అంటే గురువారం నాడు ఎన్నికలు జరుగుతాయి వాళ్ళు డబ్బులు కూడా సేకరించడం ప్రారంభించారు ఐతే డబ్బు సేకరణ వల్ల ఏ విషయమూ రుజువు కాదనుకోండి రాజీవ్ గాంధీ మనుషులు ఎల్లవేళలా డబ్బు కూడబెడుతూనే ఉంటారు గదా, కొన్ని సార్లు ఇక్కడా, కొన్ని సార్లు స్విట్జర్లాండ్‌లోనూ. ఐనా బోఫోర్స్ తర్వాత వాళ్ళకు డబ్బు అవసరం నిర్లక్ష్యం చేయదగిన స్థాయిలోనే ఉండాలి కాని చెడు అలవాట్లు అంత తొందరగా వదలిపోవు గదా.

మధ్యంతర ఎన్నికలు జరిగితే తగ్గి పోయిన మెజారిటీతో నైనా రాజీవ్ గాంధీయే తిరిగి అధికారానికి వస్తాడని నిర్ధారించే ఒక ప్రజాభిప్రాయ సేకరణను ఒక పత్రిక నిర్వహించినప్పుడు ఏదో జరగబోతున్న దని నాకు తెలిసి పోయింది. ఆ పత్రికకు ఇటువంటి ప్రజాభిప్రాయ సేకరణలు జరపడం ఒక క్రమ బద్ధమైన అలవాటు కాని వాటి నెవరూ నమ్మరనుకోండి. వార్తల్ని స్వతంత్రంగా తయారు చేసినట్టుగానే ఇటువంటి ప్రజాభిప్రాయ సేకరణలనూ తయారు చెయ్యవచ్చు. ఎన్ టి. రామారావు మొదటి సారి ఎన్నికలలో పోటీ చేస్తున్నప్పుడు ఆ పత్రికే, ఇటువంటి అభిప్రాయ సేకరణనే జరిపి తెలుగుదేశం పార్టీ 50 సీట్లను మాత్రమే గెలుచుకుంటుందని ప్రకటించింది. కాని రామారావు అన్ని సీట్లనూ ఊడ్చుకు పోగా ఆ పత్రిక మౌనంగా ఉండిపోయింది. మరొక వార పత్రిక హర్యానాలో అభిప్రాయ సేకరణ జరిపి భజన్ లాల్ అధికారానికి వస్తాడని జోస్యం చెప్పింది. ప్రతిసారీ ప్రతి పక్షాలు గెలిచేటప్పుడు మాత్రమే ఈ అభిప్రాయ సేకరణ నిర్వాహకులు ఎందుకు పొరపడతారా అని నేను తరచూ ఆశ్చర్య పోతూంటాను

పరిస్థితి ఇంకా పూర్తిగా చెయ్యి దాటకముందే ఎన్నికలు జరపాలని రాజీవ్‌గాంధీ నిజంగానే తీవ్రంగా అనుకుంటూ ఉండవచ్చు. కాని అటువంటి చర్య మూర్ఖత్వమే అవుతుందని నేనాయనకు చెప్పగలను. పరిస్థితి ఎంత దారుణంగా ఉన్నదంటే ఆయనకు 200 సీట్లు వచ్చినా అదృష్టమే స్వయంగా ఆయన పార్టీ మనుషులే కొందరు ఈ సంఖ్య ఇంకా తగ్గిపోవచ్చునని, బహుశా దాదాపు 150 రావచ్చునని అనుకుంటున్నారు నాకు ఒక స్నేహితుడున్నాడు. ఆయన నిజానికి కాంగ్రెస్ వాదే కాని శత్రుశిబిరంలో మన మిత్రులుండడంలో ప్రమాదమేమీ లేదు గదా. ఆయన కావలసిన లెక్కలన్నీ వేసి, ఏయే నియోజక వర్గాలలో ప్రతీకారం జరుగుతుందో కచ్చితంగా అంచనాలు కట్టాడు ఆయన కంప్యూటర్ల మీద ఆధార పడడు గనుక నేను ఆయనను నమ్ముతాను

కాని కథ ఇంతటితో సాంతం అయిపోలేదు దేశంలో సాధారణమైన అభిప్రాయం ఏమంటే అమెరికాలో రోనాల్డ్ రీగన్ లాగనే ఇక్కడ కూడా రాజీవ్‌గాంధీ పదవికి అర్హుడు కాడు అని, రీగన్ అక్కడ ప్రతి విషయాన్నీ గందరగోళం చేసాడు ఇప్పుడు ఆర్థిక వ్యవస్థను కూడా గందరగోళం చేసాడు. కొన్ని సంవత్సరాల పాటు ఆయన నేతృత్వంలో సక్రమంగా నడిచిన ఆర్థిక వ్యవస్థ ఇప్పుడు గిరికీలు కొడుతోంది. రాజీవ్‌గాంధీ కేంద్రంలో అధికారాన్ని చేపట్టిన నాటి నుంచీ మన ఆర్థిక వ్యవస్థ క్షీణిస్తూనే ఉన్నది. ఎందుకంటే మనం ఇది వరకెన్నడూ వరుసగా మూడు సంవత్సరాలు ఋతుపవనాల వైఫల్యాన్ని రుచి చూడలేదు భారతదేశంలో రానున్న పరిస్థితులను, జాతీయ ఆదాయాన్ని నిర్ణయించేది టాటాలో బిర్లాలో కాదు. ఋతుపవనాలు మాత్రమే వరుసగా మూడు ఋతు పవనాలు విఫలమయ్యాయి గనుక మరో మూడు ఋతుపవనాలు విఫలమవుతాయా లేదా అనేది అదృష్ట, దురదృష్టాలకు సంబంధించిన విషయం. అదే జరిగితే ఆఫ్రికాలో ఎన్నో దేశాలు కుప్ప కూలి పోయినట్టే, భారతదేశం కూడ మరెన్నడూ లేవ లేనంతగా కుప్ప కూలిపోతుంది

కాని చాలా మందిని భయ పెడుతున్నది శ్రీలంకలో జరుగుతున్న ఘోరమైన యుద్ధం - దాని



# న్యూఢిల్లీ లేఖ

అంతకంటే మం' మాటతో పలవలేం. శ్రీలంకలో 200 మంది అధికారులు, సైనికులు మాత్రమే చనిపోయారని ప్రభుత్వం అంటున్నది గాని విదేశీ వార్తాపత్రికలు చెప్పే సంఖ్య అది కాదు అక్కడ చాలా కాలంగా విలేఖరులను ఉంచిన టైమ్ పత్రిక ప్రకారం హతుల సంఖ్య చాలా ఎక్కువ ప్రభుత్వం చెప్పే సంఖ్యకు రెండు మూడు రెట్లు ఎక్కువ కావచ్చు పైగా ఇదంతా కూడా శ్రీలంక సైనికులు హాయిగా తమ క్లబ్బుల్లో జల్సాలు చేస్తుండగా జరుగుతున్నది శ్రీలంకలో ఈ యుద్ధంవల్ల మనకు రోజుకు రెండు కోట్ల రూపాయలు ఖర్చవుతున్నది. కరువు పాలబడిన మన స్వంత ప్రజల కోసం మనం ఖర్చు పెడుతున్న దాని కన్నా ఇది చాలా ఎక్కువ. రాజీవ్‌గాంధీ వోట్ల కోసం వాళ్ళ దగ్గరికి వెళ్ళి నప్పుడు వాళ్ళు ఆయనకు పాఠం చెప్పుతారు. అత్యవసర పరిస్థితి తర్వాత శ్రీమతి ఇందిరాగాంధీ వోట్ల కోసం వెళ్ళినప్పుడు వాళ్ళు చేసిన పని అదే.

రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీ భారత ప్రజలను సంప్రదించకుండా హఠాత్తుగా శ్రీలంక యుద్ధం లోకి ఎందుకు వెళ్ళారు? జయవర్ధనేతో కుదుర్చుకున్న ఒప్పందం కారణమనేది సాకు మాత్రమే ఎందుకంటే మీరు మీ కండ బలం ప్రదర్శించాలని ముందే నిర్ణయించుకుంటే తప్ప ఎవరో అడిగారన్నంత మాత్రాన యుద్ధానికి వెళ్ళరు. పంజాబ్‌లోని తీవ్రవాదులతో పోరాడడానికి సైన్యాన్ని పంపమంటే వరుసగా నిరాకరిస్తూ వచ్చిన ప్రభుత్వమే ఒక విదేశంలో తీవ్రవాదులతో పోరాడడానికి సైన్యాన్ని పంపటానికి సంకోచించక పోవడం, సూక్ష్మంగా, చెప్పాలంటే, విచిత్రంగా ఉంది. పైగా ఆ విదేశీ తీవ్రవాదులు మన బంధుమిత్రులూ, కొద్ది కాలం క్రితం వరకు మన స్వగృహాలలోకి సాదరంగా ఆహ్వానించిన అతిథులూను, ఒప్పందం ఒక సాకు మాత్రమే. రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీ తమ కండబలాన్ని ప్రదర్శించాలని నిర్ణయించుకున్నది. ఈ ప్రదర్శన శ్రీలంకలోని ఎల్. టి. టి. ఇ. వారికి కాదు. స్వయంగా మన ప్రజలనే భయపెట్టడానికి. తద్వారా ఇటీవలి కాలపు వివాదాల నుంచి పక్కదారి పట్టించడానికి. సమర్థుడైన పెద్దమనిషి జయవర్ధనే ఈ వ్యవహారాన్నంతా అర్థం చేసుకుని తనకు కావలసిన దాని కోసం బేరాలాడాడు. ఆయన రాజీవ్‌గాంధీని మూర్ఖుణ్ణి చేశాడు. ఆ క్రమంలోనే మనందరినీ కూడా మూర్ఖులను చేశాడు.

కాని దీనికీ, ఎన్నికలకూ సంబంధమేమిటి? ప్రజల దృష్టిని మళ్ళించడం మరోసారి అవసరమని, ఈ సారి శ్రీలంక దారుణం నుంచి ఎన్నికల వైపు మళ్ళించడం తగినదని రాజీవ్‌గాంధీకి సలహాలు వస్తున్నాయి దురదృష్టవశాత్తూ ఆయనకు గతంలో శ్రీలంక విషయంలోనూ, అంతకు ముందు బోఫోర్స్ విషయంలోనూ సలహాలు ఇచ్చిన వాళ్ళే ఇప్పుడూ ఈ సలహా ఇస్తున్నారు. వి. పి. సింగ్ వ్యవహారంతో తలపడడంలో, ప్రజాభిప్రాయ సేకరణలను తయారు చేయడంలో (దానికి అంతకంటే మరో మాట లేదు) ఆయనకు సహాయపడుతూ ఉన్నవాళ్ళే వీళ్ళు ఇటువంటి స్నేహితులుండగా రాజీవ్‌గాంధీకి శత్రువులు అవసరం లేదు కానీ రేస్ కోర్స్ రోడ్‌లోని ఉద్రిక్త వాతావరణంలో ఎవరు ఎవరో కనిపెట్టడం చాలా కష్టం.

మరొక వివరణ కూడా ఉన్నది కాంగ్రెస్ పార్టీ రాజీవ్‌గాంధీని వదిలించుకొని మరొక ప్రత్యామ్నాయం కోసం వెతుకుతున్నదట కనుక ఆయనను వదిలించుకోవడానికి మంచి మార్గం ఓడిపోయే ఎన్నికలు జరిపించి లోపలి నుంచే ఆ ఫలితాన్ని సాధించడం ఆయనతో పంజాబ్ ఒప్పందం మీద సంతకం చేయించిన వాళ్ళు, ఆయనను శ్రీలంకలోకి నడిపించి వాళ్ళు, సరిగ్గా వాళ్ళే దురదృష్టవంతుడైన ఆయనని శాశ్వతంగా వదిలించుకోవడానికి వేచి ఉన్నారు అందుకోసం రానున్న పార్లమెంటు పూర్తి కాలం వేచి ఉండవలసి ఉన్నా సరే ☐





సీరియల్

# ఈతరం యువతి

## వడ్లమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

పది రోజులు గడిచేసరికల్లా...... రాఘవయ్యగారింట్లో ఊహించని శుభకార్యం తాలూకు నిర్ణయం ఒకటి కలలో లాగ జరిగిపోయింది.

పెద్దమ్మాయి పద్మిని అందచందాలు.... గుణగణాల గురించి తెలిసినవారి ద్వారా విని కంచికచర్ల నుంచి ఒక సంబంధం వెతుక్కుంటూ వచ్చింది. పిల్లను చూడగానే మగపెళ్ళివారు పరమానందభరితులయ్యారు. వెంటనే ఓ. కే. చేశారు. రాఘవయ్యగారి కుటుంబం సంతోషానికి హద్దుల్లేవు. రవికాంత్.... రాఘవయ్య గారు - సంప్రదించుకుని.... వియ్యాలవారితో మాట్లాడి కట్న కానుకలు ఫైనలైజ్ చేసేశారు. ఆ సమయంలో రాఘవయ్యగారికి తన కన్న కొడుకు రవికాంత్...... తండ్రిమాటకోసం వనవాసం చేస్తున్న శ్రీరామచంద్రుడిలా అగుపించాడు. పోతే లోటల్లా ఒక్కటే! దగ్గరలో ముహూర్తాలు లేకపోవటం వల్ల... నిశ్చితార్థం మాత్రం చేసుకున్నారు. అదయినా ఒక బాధ్యత దాదాపు తీరినట్లేగా? అదీ రాఘవయ్యగారి సంతోషం.

"చెల్లెమ్మా! నువ్వత్తారింటికి వెళ్ళమ్మా..... అతి త్వరలో" ఆటపట్టించాడు నవ్వుతూ రవికాంత్.

"ఫో అన్నయ్యా! ఇదంతా నీచలవేగా" అంది పద్మిని - సిగ్గుతో ముఖం కప్పుకుంటూ.

"నిన్ను పో అంటోందికానీ..... దానికి అత్తారింటికి త్వరగా పారిపోవాలనే వుందన్నయ్యా" ఫిర్యాదుచేసింది వసంత.

"మరే..... నీతో మొరపెట్టుకున్నా" చిన్నగా చెల్లెలు నెత్తిమీద మొట్టికాయవేసింది పద్మిని.

"తొందరపడకే భడవాకానా..... నిన్ను కూడా దానివెనకే మీ అత్తవారింటికి పంపిస్తాడులే కాంతాయి బామ్మగారు వత్తాసుపలికింది.

"అదిగో బామ్మా! చాంతాడు కొని యిచ్చినా...... యింకా నువ్వు అన్నయ్యని - కాంతాయి - అనటం బాలేదు. నీకు పూజా మందిరంలో వత్తులు చేసుకోటానికి పత్తి తెమ్మంటే తీసుకురాను ఇకనుంచీ" చిరుకోపం చూపించింది వసంత.

"అట్టాగేనే బాబూ! ఎట్టాగా నీతో వేగేది?" అనుకుంటూ పెరట్లోకి వెళ్ళిపోయింది బామ్మగారు.

**జరిగిన కథ -8 :** మృదులకు అడతనం లేదని జరుగుతున్న దుష్ప్రచారాన్ని ఎదుర్కోవాలని మృదుల మిత్రులు నిర్ణయించుకుంటారు. తప్పిపోయిన సంబంధాల గురించి విని మృదుల ఇక ఇంట్లో వాళ్లను ఎదిరించయినా వివాహం చేసుకోవాలని సలహా ఇస్తారు. రవికాంత్ మృదుల కోసం రావడాన్ని రుక్మిణమ్మ వ్యతిరేకిస్తుంది. ఆ మాటలు విన్న రవికాంత్ అవమాన భారంతో కుమిలిపోతాడు.

ఆశాదీపం లాంటి కొడుకుండగా..... ఇంకా తమకు ఏమీ చింతా ఎక్కడి దన్నట్టుగా రవికాంత్ కేసి ప్రేమగా చూసింది సీతమ్మ.

ఇంకొక్క చెల్లెలి పెళ్ళి కూడా కుదిరితే..... అప్పుడు తనకు రిలీఫ్. అందాకా భరించక తప్పదు.... తన బాధ్యత! నిర్వికారంగా అనుకున్నాడు. పెద్ద కూతురి పెళ్ళి కుదిరిన శుభ సందర్భంలో ...... శాయినాథుని దర్శనం చేసుకుని..... అర్చన చేయించి, కొబ్బరికాయ కొట్టించి.... ప్రసాదం తీసుకుని తిరిగివస్తున్నారు రాఘవయ్యగారు.

ఆయన మనసంతా సంతోషం నిండివుంది. ఆడపిల్ల పెళ్ళి కుదిరితే.... ప్రతి కన్నతండ్రీ ఇలానే సంతోషపడతాడుకాబోలు!

అదే కుదరకపోతే ఆ తండ్రిపడే వేదన అంతాయింతాకాదు.

అప్పుడు సమయం రాత్రి ఏడున్నర గంట లయ్యింది. వీధిలైటు బల్బు మాడిపోయిందేమోమరి...... వెలగటం లేదు. అందువల్ల అక్కడ చిమ్మ చీకటిగావుంది. ఇద్దరు వ్యక్తులు తన ముందుగా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. రాఘవయ్యగారు తన పేరు వారి సంభాషణలో దొర్లటంతో ఆసక్తిగా చెవులు రిక్కించారు. వారి మాటలు వింటున్న ఆయనకు హఠాత్తుగా గుండెపోటు వచ్చినట్టయింది.

'అయ్యో భగవంతుడా!' అనుకుంటూ తూలిపడబోయి నిలదొక్కుకున్నారు.

వాళ్ళిద్దరూ అనుకుంటున్న మాటలు రాఘవయ్యగారి చెవులని తూట్లు పొడుస్తున్నట్లు వినిపిస్తున్నాయి.

"ఏమండీ మేష్టారూ! మీ రీ ప్రాంతం వారేనా?" అంటున్నాడొకడు.

"అవును మేష్టారూ. మీ రే వూరినుంచి వస్తున్నారు?" అంటున్నాడింకొకడు.

"నేను చీరాల నుంచి వస్తున్నానండీ."

"ఏం పనిమీద? ఏం కావాలి మీకు?"

"షిర్డీ శాయిబాబా గుడి.... మనం దాటి వచ్చిందే గదండీ?"

"అవును."

"ఇక్కడెక్కడో రాఘవయ్యగారి యిల్లు వుందిట గదండీ?"

"ఏ రాఘవయ్యగారు?"

"వాళ్ళబ్బాయి సిద్ధార్థ కాలేజీలో లెక్చరరట... ఆయనండీ."

"ఆయనా? ఏమిటండీ పని ఆయనతో మీకు?"

"మేస్టారూ మీరు నాకో సాయం చెయ్యాలి."

" చెప్పండి తప్పక చేస్తాను."

"ఆ అబ్బాయి చాలా బాగుంటాడట..... బుద్ధిమంతుడట.... నిజమేనా అండీ?"

"ఎందుకు మీకు?"

"మా అమ్మాయి నిద్దామనుకుంటున్నామండీ. పెళ్ళిళ్ళపేరయ్య ఈ కుర్రాడి

గురించి బాగా చెప్పాడు."

"మీకు నిజంగా సాయంకావాలా నాదగ్గర్నుంచి?"

"అలా అంటారేమిటండీ. ఆడపిల్ల తండ్రినండీ. తప్పక కావాలండీ."

"అయితే నేనడిగినవాటికి జవాబులు చెప్పండి ముందు."

"అడగండి."

"మీ అమ్మాయి ఎరుపా? నలుపా?"

"ఎర్రటి ఎరుపండి."

"పొట్టా? పొడుగా?"

"మీడియంగా వుంటుందండీ."

"లావా? సన్నమా?"

"ఒకమాదిరిగా వుంటుందండీ."

"ఏం చదువుకొంది"

"బి. ఎస్‌సి. పాసయింది. డ్రాయింగు....... సంగీతం బాగా వచ్చు."

"కట్నం ఎంత యిస్తారు"

"కనీసం ఏభైవేలండీ."

"అయ్‌బాబోయ్.... రూపాయలేనా?"



# ఈతరం యువతి

"అదేంటండీ అలా అంటారు ఇంకా లాంఛనాలు కూడా బాగా జరిపిస్తామండీ "

"అలాగా?"

"అవునండీ."

"అలాంటప్పుడు ఈ దిక్కుమాలిన సంబంధం ఎందుకండీ.... బంగారం లాంటి మీ అమ్మాయికి?"

"అదేంటండీ అలా అనేశారు?"

"అయినా నా కెందుకులెండి. శుభమా అని 'మీరొస్తే.. నేను చెడగొట్టినట్టవుతుంది ఆ పాపం నే చెయ్యలేను. ఒక మగపిల్లోడి జీవితంలో నిప్పులు పొయ్యలేను. అదిగో! అదే రాఘవయ్యగారిల్లు.. వెళ్ళండి..... నే వస్తానుమరి."

"అమ్మబాబోయ్! దీంట్లో ఏదో తిరకాసుందన్నమాట.. మాస్టారూ! చచ్చి మీ కడుపున పుడతాను మీ పాదాలకు చెప్పులు కుడతాను. దయచేసి అసలు విషయం ఏమిటో చెప్పండి?"

"వెళ్ళు వెళ్ళవయ్యా బాబూ! నా నోటితో ఆ సంగతి చెప్పమంటావా? నావల్లకాదు."

"చంపేస్తున్నారు మాస్టారూ! చెప్పి పుణ్యం కట్టుకుంటారా? లేకపోతే నా తల మీ పాదాల దగ్గర బద్దలు కొట్టుకోమంటారా?"

"ను వ్వెక్కడ దొరికావయ్యా? కామవరపు జీడి! అంబాజీపేట ఆముదం!"

"బాబ్బాబు! నాయన్నాయన! తొరగా చెప్పండి. నేనసలే బి. పి. మనిషిని "

"చంపుతున్నావయ్యా బాబూ! ఏం చేస్తాను... చెప్పి పాపం కట్టుకుంటాను. తరవాత ప్రాయశ్చిత్తం చేసుకుంటాను "

"తొరగా చెప్పండిభాబో.. ..."

"రాఘవయ్యగారికి ఇతను పెద్దకొడుకు."

"ఆఁ!"

"అయినా ఇతని కింకాపెళ్ళికాలేదు."

"అదే..... ఎందుకనండీ బాబూ?"

"చెపుతున్నా వినవయ్యా."

"పిల్లనిస్తామని వచ్చినవాళ్ళు..... ఈ పేటలోకి అడుగు పెట్టగానే.... వేటగాణ్ణి చూసి జింకలు పారిపోయినట్టు తలో వంకకి పారిపోతున్నారు."

"ఎందుకని?"

"వస్తున్నా! వస్తున్నా!"

"రండి రండి త్వరగా."

"ఇతన్ని వదిలేసి పెద్దమ్మాయికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు రాఘవయ్య."

"అలాగా?"

"అంతేగాకుండా రెండో అమ్మాయికి కూడా సంబంధం చూస్తున్నారు "

"ఎందుకని?"

"ఇంకా అర్థం కాలేదుటయ్యా.. పెద్దవాడైన కొడుక్కి పెళ్ళిచెయ్యటం మానేసి, ఇద్దరు కూతుళ్ళకి సంబంధాలు చూస్తున్నాడంటే.... బెండకాయ సామెత గుర్తు రావటం లేదా నీకు?"

"అయితే మేస్టారూ.. ఇతనికి ?"

"నా నోటితో అనిపించాలని కాకపోతే ఏమిటయ్యా.. బెండకాయ ముదిరినట్టు ముదిరిపోయాడు. పైగా సంసార జీవితానికి పనికిరాడు."

"మాస్టారూ. మరొక్కసారి గుక్కతిప్పుకుని చెప్పండి. మీరు చెప్పింది నిజమేనా? చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అయ్యేంత వరకూ పెళ్ళిచేసుకోని అన్నయ్య లెంతమందిలేరు?"

"నిజమేనా ఏమిటయ్యా..... కట్నం కానీ లేకుండా చేసుకుంటాం అని రాఘవయ్యగారు ఆఘమేఘాలమీద కబుర్లుమీద కబుర్లుపెట్టినా. ఏ. కన్యాదాతా ముందుకు రావటం లేదు దీని అర్థం ఏమిటంటావ్? నపుంసకుడికి రంభ నిస్తేమాత్రం ఎందుకు పనికివస్తుంది చెప్పు? మూడేళ్ళనుంచీ పిల్లనిస్తామని ఒక్కడు ముందుకు రాలేదు నీలాంటి మూఢుడు తప్ప. ఉన్నదున్నట్టు చెప్పాను. నమ్మితే నమ్ము లేకపోతే నీ ఖర్మ!"

"కోప్పడకండి మీ మాటే నమ్ముతున్నా అయితే నేను మాత్రం ఎందుకండీ వెనక్కి తిరిగివెళ్ళి తిరుగుబస్సు అందుకుంటానండీ."

"ఆగవయ్యా! గంద్రగోళం చంద్రయ్యా ఏమి టా హడావ్విడి? మా తమ్ముడి కొడుకున్నాడు. వాడూ ఎం. ఏ. పాసయ్యాడు. ప్రైవేట్‌కంపెనీ అయితేనేం బ్రహ్మాండమైన ఉద్యోగం రాఘవయ్యగారి అబ్బాయికన్నా బాగుంటాడు. వాడు మీ అమ్మాయిని చేసుకుంటానంటే.... అది నీ అదృష్టం. కావాలంటే పద వెడదాం... నీ యిష్టం."

"సరే మేస్టారూ పదండి."

"రండి మేస్టారూ కట్నం కాస్త ఎక్కువయినా..... లాంఛనాలు కాస్త పెచ్చయినా.... మీ రేం బాధపడకండి. బంగారంలాంటి సంబంధం. రాఘవయ్యగా రబ్బాయి లాంటి ఆడంగి సంబంధం కాదు."

"అలాగే. నడవండి మరి."

వాళ్ళిద్దరూ ముందుకి సాగిపోయారు.

రాఘవయ్యగారు చేష్టలుడిగిన వానిలా అలా అక్కడే నిలుచుండి పోయారు.

ఏ భూకంపమయినా క్షణాలమీద వచ్చి..... తను భూ స్థాపితమయితె ఎంత బాగుండును అనిపించిం దాయనకి.

తన ముందున్న వడ్డించిన విస్తరిని....... నీకు కాదు.... అని బలవంతంగా ఎవరో ఎత్తుకుపోయి తింటున్నట్టు అనుభూతి చెందారు.

మనసంతా కకావికలయిపోయింది.

కలతబారిపోయింది..... ఆయనకు.

తన కొడుకు నపుంసకుడా?

చక్కని కను ముక్కు తీరుతో.... అందగాడు. మంచి పర్సనాలిటీ కలవాడయిన తన కొడుకు మగతనం లేనివాడా?

ఆ కారణం వల్లనే తను వాడికి పెళ్ళిచెయ్యలేకపోయాడా?

హతాశులయ్యారు రాఘవయ్యగారు. అందువల్లనే వాడిని వదిలేసి ఇద్దరమ్మాయిలకు పెళ్ళిసంబంధాలు చూస్తున్నాడా?

నిజంగా లోకులు పలుగాకులు!! పచ్చి అబద్దాన్ని నిండు నిజంగా చిత్రీకరించే వీళ్ళ నాలుకలు...... నిలువునా చీలికలు చేసి..... ఉప్పుపాతర వెయ్యాలి!



1వ వారం



2వ వారం



3వ వారం



4వ వారం



5వ వారం



# చూడండి! కేవలం 6 వారాల్లో త్వరగా మీ ఛాయ మెరుగవుతుంది

6వ వారం



క్లియర్-టోన్ తెచ్చే మెరుగైన ఛాయను మీరూ చేజిక్కించుకోవాలిక కదూ?

## క్లియర్•టోన్
### ద్వారా ఛాయ మెరుగయ్యే పథకం

మీ ముఖంపైన ఛాయ మరింత మెరుగ్గా మిలమిల మెరిసేలా, ప్రకృతి మీకిచ్చిన వరంలా.

క్లియర్-టోన్• ఛాయను మెరుగు పరిచే క్రీమ్, చేస్తుందిది నిజం.

క్లియర్-టోన్‌ని రోజుకి రెండుసార్లు మృదువుగా రాయండి. దానిలోని మృదుత్వాన్ని మీ చర్మంలో లోపలికి ఇంకుతూన్న అనుభవాన్ని పొందండి —మిగిలేదిక కేవలం అద్భుతమైన ఆ ఫ్రెంచి సుగంధం. క్లియర్-టోన్ యొక్క 4 విధాల చర్య యిక మొదలు.

**అద్వితీయమైన తీరులో చర్మపు ఛాయని మెరుగు పరిచే పదార్థం** (మరే క్రీములోనూ లేదు యిది), మీ చర్మం లోపలినుంచి ప్రకృతి సహజమైన ఆ మెరుగు మెరుపును పునరుజ్జీవితం చేస్తుంది.

**సూర్యకిరణాలను వడగట్టగల ప్రత్యేకమైన పొర మీకు** రోజంతా రక్షణనిస్తుంది, సూర్యకిరణాల నుంచి నల్లబడకుండా.

**సమృద్ధివంతమైన మాయిశ్చరైజర్ మీ చర్మాన్ని అలా** కోమలంగా యవ్వనంలోని నేవళంగా వుండే ఆ లక్షణాన్ని తీసుకొస్తుంది.

**వారాలు తిరిగే సరికల్లా చర్మంపైన మచ్చలలా మాసిపోతాయి.** అలా చూస్తూచూస్తూ ఆరు వారాలు తిరిగేసరికల్లా క్లియర్-టోన్ తెచ్చే ఆ తేడాని మీరే చూస్తారిక-దేశమంతట్లోని వేలకి వేల స్త్రీలూ యిప్పటికే వాడి అనుభవంలోకి తెచ్చుకున్న ఆ అనుభవాన్ని.




లండన్•పారిస్•న్యూయార్క్

## ఈతరం యువతి

ఇంతకాలం రవికాంత్‌కి పెళ్ళికాకపోవటానికి కారణమేమిటో తనకు తెలుసు! తనకూ వాడికి మాత్రమే తెలుసు

తండ్రిగా తన స్వార్థం మాత్రమే చూసుకున్నాడుగానీ:.. తన కొడుకును అర్థించిన సాయం. .. వాడి జీవితాన్నింతగా చీకటిమయం చేస్తుందని ఊహించలేదు తను

ఒక్కసారిగా రాఘవయ్యగారి మనస్సు గతంలోకి దూసుకుపోయింది.

* * * *

నాలుగు సంవత్సరాల క్రితం. సిద్ధార్థకాలేజీలో లెక్చరర్ పోస్ట్కి వచ్చిన అప్పాయింటుమెంటు ఆర్డరుని తీసుకునివచ్చి.... అప్పుడే పూజచేసుకుని హాల్లోకి అడుగుపెట్టిన తన పాదాలకు నమస్కారం చేశాడు రవికాంత్. తనచేత అతి తక్కువ డబ్బుమాత్రమే ఖర్చుపెట్టించి ఎక్కువభాగం స్వశక్తిమీద మెరిట్ స్కాలర్‌షిప్పుల డబ్బుమీద బాగా చదువుకుని ఎం. ఎస్. సి. పాసయ్యి ఉద్యోగం సంపాయించుకుని ప్రయోజకుడైన కొడుకుని చూస్తే తన మనసు ఆర్ద్రమైంది. పుత్రోత్సాహం పొంగిపొరలింది.

"శుభం" అంటూ నిండు మనసుతో ఆశీర్వదించాడు తను.

వెంటనే మనసుపొరల్లో ఏదో మెదిలింది బాధగా.

కానీ అది సమయంకాదని నిగ్రహించుకుని వూరుకున్నాడు.

కాలేజీలో జాయినయి రెండుమూడు రోజుల తరవాత "రవీ అలా పోయొద్దాం వస్తావా?" అన్నాడు ఓ సాయంత్రం.

"తప్పకుండా . పదండి వెడదాం" అన్నాడు రవి.

ఇద్దరూ కలిసి పిచ్చాపాటీ చెప్పుకుంటూ బందరురోడ్డునీ ఏలూరురోడ్డునీ కలిపే రింగురోడ్డుమీద నడవసాగారు ఏలూరురోడ్డు వేపుగా.

అప్పటికి ఇంకా ఇళ్ళు పూర్తిగా పడలేదు. దాదాపు అన్నీ పొలాలే!

"ఇక్కడ కూర్చుందామా? అన్నాడు తను

"అలాగే నాన్నగారూ!" అన్నాడు రవి

తను ఉపోద్ఘాతం లేకుండా మొదలుపెట్టాడు విషయాన్ని 'రవీ! పద్మినికి..... వసంతకి పెళ్ళీడు రాబోతోంది వాళ్ళని ఓ యిద్దరు అయ్యలచేతిలోపెట్టాలి అంటే దానికి తగిన ఆర్థికస్తోమతు కావాలి. అది నాదగ్గిరలేదు" అన్నాడు దీనంగా.

"ఏం చేయ్యమంటారో చెప్పండి అలాగే చేస్తాను "

"నాది దురాశ. లేక అత్యాశ అనుకోకపోతే నీ నుంచి ఒక సాయం కావాలి ఇది నిన్ను నేను కొడుకుగా అడగటం లేదు స్నేహితుడిగా అర్థిస్తున్నాను."

"చెప్పండి నాన్నగారూ "

"నీకు పిల్ల నివ్వటానికి కన్యాదాతలు ఎగబడివస్తారు కానీ నువ్వు పెళ్ళిచేసుకున్న తర్వాత అంతా పూర్తిగా నీ యిష్టంకాదు కోడలు మాటని కూడా చాలావరకు వినవలసిన అగత్యం నీకు ఏర్పడుతుంది '

" . . . ."

"అప్పు డామె... పద్మినిపై వసంతపై సుముఖత చూపుతుందో. లేక విముఖత ప్రదర్శిస్తుందో ఎవరికీ తెలియదు '

".. ... .."

"కీడెంచి మేలెంచుదాం పద్మిని వసంతల వివాహబాధ్యత కన్న తండ్రిగా మీ నాన్నగారిది మనదికాదు ఆయన తంటాలేవో ఆయన్ని పడనీయండి మన కెందుకీ పెంట – అంది అనుకో "

" "

"ఆర్థికంగా పటిష్టంగా లేని నేను ఈ యిద్దరాడపిల్లల పెళ్ళిళ్ళు ఎలా చెయ్యగలను? వాళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యలేక . లోకుల విమర్శలు పడలేక

కృష్ణలో దూకి ఆత్మహత్య చేసుకోవాల్సిందే." తనకు తెలియకుండానే తన గొంతు గద్గదికమైంది.

"నాన్నగారూ..... అంతమాటలనకండి. ఇంటికి పెద్దకొడుకును నేనున్నాను" అన్నాడు రవి.

"ఆ ధైర్యంతోనే నాయనా.... నిన్నో చిన్న త్యాగం చెయ్యమని అభ్యర్థిస్తున్నాను."

"చెప్పండి."

"నీ చెల్లెళ్ళిద్దరి పెళ్ళిళ్ళు అయ్యేంతవరకూ నీవు నీ వివాహాన్ని వాయిదావెయ్యి రవీ. నీ జీతంలో సాధ్యమైనంత ఎక్కువభాగాన్ని చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు కట్నంగా నిల్వచెయ్యి. నాకు తెలుసు.... వీళ్ళిద్దరి పెళ్ళిళ్ళయ్యే సరికి...... నీ వయస్సు కూడా కొంత ముందుకు పరుగెడుతుందని. దీనుడైన నీ తండ్రికోసం.... ఈ సాయం మనస్ఫూర్తిగా చెయ్యగలవని విశ్వసిస్తున్నాను" అన్నాడు తను.

తన ముఖంలోకి కొన్ని క్షణాలు పరికించిచూసి తలదించుకున్నాడు రవి.

"పోవయ్యా! ఎంతకన్నా తండ్రి వయితే మాత్రం నువ్వు కన్న ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళకోసం...... నా సుఖ సంతోషాల్ని..... జీతాన్ని త్యాగం చెయ్యాలా? నాకుమాత్రం హాయిగా పెళ్ళిచేసుకుని సంసార జీవితం గడపాలని వుండదా? పో పోవయ్యా పెద్దమనిషీ! తగుదునమ్మా అని అడగవచ్చావ్" అంటాడేమో అని వణికిపోతున్నాడు తను.

కానీ..... వాడు తన కొడుకు.

ఆణిముత్యం!

"మీ యిష్టప్రకారమే చేస్తాను నాన్నగారూ. ఈ విషయం గురించి మీ రేమీ దిగులుపడకండి" అన్నాడు.

"అమ్మయ్య" అనుకున్నాడు తను.

కొడుకు తనకు కొండంత అండగా నిలబడటం ఎంతో బలాన్నిచ్చింది.

ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు తను.

రవిని గాఢంగా... కౌగలించుకోవాలనిపించింది.

ఆప్యాయంగా వాడి చేతిని నొక్కి వదిలేశాడు. "గుడ్ మై బోయ్" అంటూ.

* * * *

ఇదీ జరిగిన సంగతి.

తన మాటమీద తు చ తప్పకుండా నిలబడ్డాడు రవి.

ఎంతో మంది...... తమ కూతుళ్ళ నిస్తామని క్యూలో నిలబడివచ్చారు.

కనీసం నిశ్చయం చేసుకోండి.... అంతవరకూ ఆగుతా మన్నారు యింకొంతమంది.

తనకిచ్చిన మాటకోసం...... పెళ్ళిచూపుల మాటే తలపెట్టలేదు రవి.

"చెల్లెళ్ళ పెళ్ళి అయిన తరవాతనే నా పెళ్ళి" అంటూ నొక్కివక్కాణించాడు.

అలాంటి రవి కెలాంటి శిక్ష విధించిందీ సమాజం?

రవికి సంబంధాలు రావటంలేదా? రవి సంసార సుఖానికి అనర్హుడా?

అయితే తల్లి దండ్రుల కిచ్చిన మాటకోసం...... చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకోసం తను పెళ్ళిచేసుకోకుండా వేచివుండే ప్రతి సోదరుడూ.. . ఈ సంఘం దృష్టిలో ఒక పనికిమాలినవాడు పనికిరానివాడేనా? పుంస్త్వం లేనివాడేనా?

ఓ అద్భుతమైన సమాజమా.... నీకు జేజేలు!!!

రవీ..... నా స్వార్థం...... నీ వివాహం మీద..... వ్యక్తిత్వంమీద..... యింత దెబ్బతీస్తుందని నేను ఊహించలేదు నాయనా!

నీకన్నా వయసులో పెద్దవాడినయినా.... అడుగుతున్నాను నన్ను క్షమించు.

నీవు అండగా లేకపోతే..... ఈ ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళు కానేకావురా.....

అందుకోసం.... యింత ఘోరమైన, దారుణమైన నింద నీమీద పడిందని తెలిసినాకూడా నేను అశక్తుణ్ణి..... నీ పెళ్ళికి అనుమతించలేని అసహాయుణ్ణి బాబూ!

రాఘవయ్యగారి మనసు మూగగా విలపించింది.

ఎలాగో కాయాన్ని ఈడ్చుకుంటూ వచ్చి..... ఇంట్లోకి రాగానే మంచంమీద వాలిపోయారు.

"ఏమిటండీ అలా వున్నారు?" అంది సీతమ్మ.

"ఒంట్లో బాగులేదు.... నన్ను ఒంటరిగా వదిలేయండి కాసేపు" అన్నారు.

నిజానికి ఆయనకు బాగోలేనిది మనసులో!

(ఇంకా ఉంది)

## విజ్ఞానం – వినోదం

బాబ్ బ్రౌన్

### సమస్య

కొట్టినా దిగని మేకు

### అవసరం

తాడుకి వ్రేలాడదీసిన ఒక చెక్క బల్లపలక, ఒక మేకు, ఒక సుత్తి.

### ఇలా చెయ్యాలి

వ్రేలాడు తున్న చెక్క బల్ల పలక లోకి మేకును కొట్టడానికి ప్రయత్నించండి. మేకు దిగటం ఇంచు మించు అసాధ్యమే అవుతుంది.




### వివరణ

సుత్తితో మేకును కొట్టినప్పుడు ఆ తీవ్రతకి చెక్కబల్ల మేకు ఒకే దిశలో కదులుతాయి. మామూలుగా అయితే బల్ల స్థిరంగా ఉంటుంది కాబట్టి సుత్తితో మేకు కొట్టినప్పుడు అది కదలదు మేకు బల్లలోకి దిగుతుంది. బల్ల పలక బాగా బరువుగా ఉండి, మేకు కూచిగా ఉంటే వ్రేలాడుతున్న బల్లలోకి మేకు కొంచెం దిగుతుంది.



# ప్రశ్నావళి కె. రామలక్ష్మి



### ఎ. ఎమ్. పైడిపఱ్ఱు

★ నాకు జీవితం ఒక నరకం. 25 సంవత్సరాలు. పెళ్ళికాలేదు. తల్లితండ్రులకు బరువు కావటం గురించి, వారి బాధ సహించలేక, గౌరవంలేక తలెత్తుకు తిరగలేక చావాలనిపిస్తుంది.

● పిచ్చి పిల్లా, పెళ్ళి కానంత మాత్రాన చచ్చిపోవాలనిపించడం ఏమిటి? నీ స్వేచ్ఛకి రెక్కలున్నాయని సంతోషించు. తల్లితండ్రులకు భారం కాకుండా, ఇంట్లో ఇతరులకి లోకువ కాకుండా, పరువుగా ధైర్యంగా వుండడానికి ఒకటే దారి. పని ఏదో ఒకపనిలో చేరె ప్రయత్నం చెయ్యి. చదువుకోకపోయినా- యీనాడు స్త్రీని ఆర్థికంగా స్వంత కాళ్ళపై నిలబడడానికి కావలసిన తర్ఫీదు నిచ్చే సంస్థలెన్నో వున్నాయి... పిరికితనం ముందు వదులు. ఆర్థిక స్వాతంత్ర్యం మనిషికిచ్చే ధైర్యం- నీకు అర్థం అవుతుంది.. కూలీనాలీ చేసుకుని ధైర్యంగా బ్రతికే కార్మిక మహిళలు చూడు- ఎంత నిబ్బరంగా వుంటారో డూసంధ్గ్ ఏ పనీ చేయని బుర్రలో దెయ్యాలు కాపురానికి వస్తాయి జాగ్రత్త.

### ఎస్. డి. ఎమ్. ఒంగోలు

★ ప్రపంచం గర్వించ దగిన గవాస్కర్పై మీ అభిప్రాయం?

● అద్భుతమయిన ఆటగాడే కాని సాటి ఆడవాళ్ళ పట్ల సద్భావం లేకపోవడం - బాగులేదు. అర్థమయిన ప్రచారాలకీ- దిగిపోవడం అంతకన్నా బాగులేదు!

### రాము, గుంటూరు

★ ఈ మధ్య సినిమా పాటలో కూడా బూతు ఎక్కువై పోయిందేమిటండీ?

● అవి 'మీరు కోరిన పాటలు!' మరచి పోయారా?! పట్టపగలు పదిమంది జులుం చేసి నడి రోడ్డున ఈడ్చి ఆడదాన్ని బలాత్కరిస్తే- అది రేపు సీరియల్ అయిపోతోంది. సినిమా కథ అయిపోతోంది ఇక దానికిలాంటి పాటలు కాక ఎలాంటి పాటలు కావాలి?

### డి. ఏ. ఖర్గపూరు

★ రూపంలో, గుణంలో, చదువులో అన్నిటిలో అధికురాలయిన స్త్రీని సునాయాసంగా చులకన చేయకల్గుతున్నాడు ఈ మగాడు ఇదెలా ప్రారంభమైంది-

● మనువుగారి ధర్మం యిది. పురుషాధిక్యతకి పట్టం కట్టి- పితృస్వామ్యం పెంచిన విషవు మొక్క యీ తత్వం. అదే అలవాటైపోయి- తనకు మటుకు అధునిక న్యాయ సూత్రాలూ, సంప్రదాయాలూ స్త్రీకిమటుకు ఆటవిక సాంప్రదాయమే- అమలులో పెట్టి రాణించ కల్గుతున్నాడీనాడు పురుషుడు అంతే.

★ కె. రా. గారూ గాలిబ్ కవిత్వం వింటూంటే మళ్ళీ మళ్ళీ వినాలని ఉంటుంది నాకు. మరి మీకో?

● నాకు కొందరు చదివితేనే 'మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తుంది... కాస్త ఒత్తులు ప్రాక్టీసు చెయ్యి నాయనా. లేకపోతే రేపు గాలిబ్‌ని కాస్తా గలీబు చేస్తావు!

### ఎమ్. వి. హైదరాబాద్

★ న్యాయానికి కళ్ళు లేవు. కామెంట్?

● అయితేనేం- గొప్ప జ్ఞాపకశక్తి వుంది

★ ఓటమి నిరుత్సాహపరుస్తుంది నిజమేనా?

● నిజంగా ఓడిపోయిన వాడు- గట్టిగా గెలుపు కోసం ప్రయత్నించ లేదని అర్థం!








★ క్రూరంగా ప్రవర్తించె మగవారిని చూస్తే మీకేమనిపిస్తుంది?

● జంతువు అనుకుంటాను కాస్సేపు. అంతకంటె నాకు వింతగా తోచేది- ఒకటి- అలా క్రూరంగా ప్రవర్తించినవాడు- సిగ్గుపడడెందుకని?!

★ నేరానికి శిక్ష?

● పొరపాటు సర్వసాధారణంగ లబ్ధి పొందిన వాడే నేరం చేసి ఉండాలి

### జి. ఎమ్. ఆర్. విజయవాడ

★ దేశం అంటే?

● నా దేశం నా ప్రపంచం. మతం- మంచి చేయడానికి అంతేగాని దేశం అంటే- కుక్కలు చింపడానికి వదిలేసిన విస్తరి కాదు.

### ఏమ్. ఎస్. ఆర్. అన్నవరం

★ నేటి వార్తా విధానం గురించి మీ అభిప్రాయం?

● పేపరు వార్తలా? రేడియో- టి వి. వార్తలా?! మొదటిది కంద జీవిని భూతద్దంలోంచి చూసినట్టాక శీర్షికల్లో కవిత్వం గుప్పించి చంపుతుంది రెండోదా? అది ప్రభుత్వ బాకా మనం పట్టించుకోడం దండగ. రాజకీయవేత్త, ఉపన్యాసంలో లాగ, వాటిలో ఏమీ ఉండదు!

★ రచయిత కాలేని వాళ్ళు విమర్శకులుగా మారుతారంటారు నిజమేనా?

● అందని ద్రాక్షల కథ అని కాబోలు శ్లేష! రచయితే తనకు తాను విమర్శకుడు అవుతాడు ఎటొచ్చీ కొందరు- తామేం రాస్తే అది ఘనకార్యంగా ఉబ్బిపోతారు కొందరు ఏం రాసినా డోలాయిమానాలో పడి కొట్టుకుంటూ వుంటారు. రెండూ- సహజమే

### కె. ఎన్. వి. ఆర్. కె. మైలవరం

★ రామలక్ష్మిగారూ మీరు ఆంధ్రపత్రిక పుట్టి నప్పటినుండి పాఠకులకు జవాబులిస్తున్నారా?

● లేదు. నాకంటే పత్రిక చాలా సీనియరు!

★ హేతువాదులకు, నాస్తికులకు తేడా ఏమిటి?

● ఇదివరకు లేదనుకునేదాన్ని మీరిలా అడిగేసరికి నాకూ డౌటు వస్తూంది!

### ఎమ్. సిహెచ్. పెనుగొండ

★ కె. రా. [illegible] ముద్రించవచ్చుగా?

● నేనూ అదే [illegible] కూడా అక్కరలదు - [illegible] కాగితమో, ఇరవై కాగితమో, [illegible] కాపీలు చేయించుకుంటే ఏం పోయి[illegible]

★ ఇతరుల వుత్తరాలు చదివే [illegible]?

● సభ్యత తెలియనివాళ్ళు

# మార్వెల్ - కంచిపట్టు వంటి మృదువైన, అపూర్వమైన అనుభూతి.




పట్టు కుచ్చు వంటి కోమలత్వం, కంచిపట్టువంటి లావణ్యం కొబ్బరి నూనె సహజ గుణాన్ని రంగరించుకున్న. పాల మీగడవంటి నురగ.

సాధారణమైన సబ్బులకన్న
3 రెట్లు అధికంగా కొబ్బరి నూనెను కలిగి యున్నది.

కొత్త శీర్షిక







న్యూఢిల్లీ


ఈ షేర్ మార్కెట్టును గూర్చి చాలా కాలం పరిశీలించిన తరువాత ఒక ఆర్థిక శాస్త్రవేత్త దీన్ని చాలా చక్కగా వర్ణించటం జరిగింది ఈ మార్కెట్ మొత్తాన్ని ఒక మహారణ్యంగా పోల్చాడు దీనిలో వుండే పెట్టుబడిదారులు (ఇన్‌వెస్టర్స్) యొక్క ఆపరేషన్ విధానం బట్టి కొందరికి బుల్ ఆపరేటర్, బేర్ ఆపరేటర్ అని అంతేకాక ప్రాఫిట్ హంటర్స్ అని స్టాగ్స్ అని నాలుగు రకాల పేర్లు వుండటము కూడా అతని వాదాన్ని సమర్థిస్తున్నది ఇప్పుడు మనం విడివిడిగా ప్రతి ఆపరేటర్ విధానాలని గూర్చి తెలుసుకొందాము,

**బుల్ ఆపరేటర్** అంటే ఈ పేరు సూచించిన విధంగానే బుల్ (ఎద్దు) ఎలా ప్రవర్తిస్తుందో ఆ విధంగానే ఈ ఆపరేటర్ ప్రవర్తిస్తాడు ఎద్దు తనకు వ్యతిరేకమైన లేక కావలసిన వస్తువు కనిపించిందంటే దాన్ని తన కొమ్ములతో బలంకొద్దీ పైకి విసిరి పారేస్తుంది అలాగా ఈ ఆపరేటర్ కూడా ఎక్స్ అనే కంపెనీని ఎంచుకుని [illegible] కొనుక్కుంటూ పోతూ వుంటాడు ఈ పనిని కొందరు సిండికేట్‌గా ఏర్పడి చేయటం మూలంగా కావలసిన వనరులకు ఇబ్బంది వుండదు ఇలా కొనుక్కుంటూ పోవటం మూలంగా ఎక్స్‌కి గిరాకీ పెరిగి దాని దర పెరగటం మొదలవుతుంది 25-30 శాతం పెరిగిన వెంటనే అతడు అమ్మి లాభాన్ని గడిస్తాడు పెరిగిన రేటులో సామాన్యుడు కొంటూ పోతూ వుంటాడు తగ్గినప్పుడు అంటే బాగా పడిపోయిన తరువాత అమ్ముతూ సామాన్యుడు నష్టపడుతూ వుంటాడు

ఈ మార్కెట్ భిన్నమైన మనస్తత్వాన్ని కలిగి వుంది మామూలుగా మనకు నిత్యం కనిపించే వస్తు మనస్తత్వం అంటే ఏదైనా ఒక వస్తువు దాని అసలు దరకంటే తక్కువ దరలో అమ్ముతూ వుంటే అవసరం లేకపోయిన కొనుక్కుంటాము దీన్ని వస్తు మనస్తత్వం అంటారు అలా కాక షేర్ మార్కెట్ మనస్తత్వంతో ఏదైనా ఒక షేర్ పెరుగుతూ వుంటే దాన్ని కొంటూ వుంటారు పడిపోతూ వుంటే అమ్ముతూ పోతూ వుంటారు దీన్ని షేర్ మార్కెట్ సైకాలజీ అంటారు [illegible]

**బేర్ ఆపరేటర్** బేర్ అంటే ఎలుగుబంటి అని అర్థం మనకు అందరికీ తెలిసిందే కదా! దాన్ని ఒకసారి [illegible] అది ఏ వస్తువునైనా పైనుంచి గట్టిగా కిందకు పడవేయటం దీని సహజ గుణం అలాగే ఆపరేటర్ కూడా 25-35% పెరిగిన ఏ షేర్‌నైన పడగొట్టటం ఇతని లక్ష్యం ఈ మార్కెట్‌లో [illegible] పేర్లు అమ్ముతూ పోవచ్చు వాటి కోసం ఇతడు కొంత డబ్బుని డిపాజిట్‌గా చెల్లిస్తే సరిపోతుంది అందు వలన షేర్లు లేకుండా అమ్ముతూ పోతూ వుండటం మూలంగా ఆ షేర్‌కి ఎక్కువ గిరాకీ లేకపోవటం మూలంగా దాని దర తగ్గుతూ వస్తుంది దర తగ్గుతున్నది కదా అని కొందరు అమ్మేస్తూ వుంటారు ఈ రకంగా అది ఇంక కొంత దర కోల్పోతుంది పడిపోయిన దరలో బేర్ ఆపరేటర్ ఎన్ని షేర్లు అయితే మొదట అమ్మేడో అవి అన్నీ కొని రెండింటి మధ్య వున్న తేడాను లాభంగా చేసుకుంటాడు. ఈ విధంగా చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తూ చేస్తూ కొద్ది కాలంలో అధిక మొత్తాలలో చాలా సులువుగా సంపాదిస్తూ ఉంటారు లక్షల్లో, కోట్లల్లో నమ్మ బుద్ధి కాకపోతే మీరు ఈ విషయాన్ని గమనించారా? వార్తా పత్రికలతో ఆదాయపు పన్ను దాడులు సినిమా తారలు, షేర్ బ్రోకర్ల ఆఫీసులపై జరిగినప్పుడు [illegible] పట్టుకుంటూ వుంటారు ఇదంతా చూస్తుంటే చాలా మాయగా వుందా! అవును ఇది పెద్ద మాయా ప్రపంచమే మీకు ఇంకొక సందేహం రావచ్చు బాగా పెరిగిపోయిన తరువాత ఎవరు కొంటారు అని, దీనికి [illegible] ఒక చిన్న ఉదాహరణ ఇస్తున్నాను

మా అన్నగారు ఇక్కడ పని చేస్తున్నారు అతని ఆఫీసులో ఎన్.పి.ఎఫ్. అనే డివిజన్‌లో ఒక అతన్ని నాకు పరిచయం చేయటం జరిగింది నా విజిటింగ్ కార్డ్ మీద షేర్ కన్సల్టెంట్ అని వుండటం గమనించి వింతగా వుందే ఇంత వరకు ఎవ్వారు ఈ రకంగా చెప్పుకోలేదే అన్నాడు, అవును అన్నట్టు [illegible] టీ కి ఆహ్వానించాడు టీ తాగుతూ మీరు వృత్తి పరంగా షేర్ కన్సల్టెంట్ అయితే నేను స్వయంగా అయ్యాను నా సలహాల మీదే ఈ ఆఫీస్‌లో అందరూ షేర్‌లు కొనటం, అమ్మటం చేస్తూ వుంటారు వీరందరికీ నేను కన్సల్టెంట్‌ని అని గర్వంగా మరొక్కసారి ఎలిగెత్తి చాటుతున్నాడు (నా మనసులో మాట సెల్ఫ్ డబ్బా బాగా కొట్టున్నాడులే అనుకుంటూ) అంతా ఓపిగ్గా విన్న తరువాత మా అన్నయ్యగారు ముందే ఇతని వద్ద 1500 విమల్ కంపెనీ షేర్స్ వున్నాయి అనిచెప్పటం మూలంగా వాటి విషయం ప్రస్తావించాను

మీరు వాటిని మార్కెట్‌లో కొన్నారా' అని అడిగా.

లేదు మొదట 300 పబ్లిక్ ఇస్యూలో వచ్చినవి తరువాత అవి బోనస్‌తో కలిపి 1200 కావటం దాని తరువాత రైట్ ఇస్యూ రావటం అన్నీ వివరించాడు దానిలో 300 షేర్లు రెండు నెలల క్రితం రు 320లో అమ్మి తన కూతురు పెళ్లి చేయటం అన్నీ వివరించాడు

# సరైన సూచనలకు రు. 100/- బహుమానం

ఈ శీర్షిక ఇంకా వివరంగా మీకు తెలియాలి అంటే ఎలా? మీలో కొందరు ఇన్వెస్టర్‌లు వుండే వుంటారు కాబట్టి మీకు ఏ ఏ టాపిక్స్ మీద వివరంగా కావాలంటే వాటి మీద వ్రాయటానికి నాకు అవకాశం వుంటుంది అంతేగాక సరైన సూచనలు ఇచ్చిన వారికి 100 రూపాయల బహుమానాన్ని సదరన్ కన్సల్టెన్సీ సర్వీసెస్, శీతమ్మధార బ్రాంచి, విశాఖపట్నం వారు ప్రకటిస్తారు మీ అడ్రస్ తెలుపగోరుతున్నాను.
—యన్. రామ్‌జీ

చాలా బాగుంది. 'ఇప్పుడున్న 1200 షేర్లు మీరు అమ్మేయ కూడదూ' అన్నాను. నేను పాతాళంలోకి దూకమంటే ఎంత కోపం వస్తుందో అంత కోపం అతని మొహంలో ప్రస్ఫుటంగా కనిపించింది. చదువుకున్న వ్యక్తి కాబట్టి, అంతే కాక నన్ను పరిచయం చేస్తున్నప్పుడు మా అన్నయ్యగారు నా గురించి చెప్తూ నాకు కరాటేలో బుడాకాయ్ వారిచ్చిన బెల్ట్ గూర్చి వివరించటం మూలంగా నైతేనేమి నన్ను కొట్టకుండా తన కోపాన్ని తనలో తమాయించుకుని 4 నిమిషాల తరువాత ఇలా అన్నాడు·

'చూడండి రామ్‌జీగారూ! మీరు చాలా చిన్న వాళ్ళు మీ వయస్సుకన్నా నా అనుభవం చాలా పెద్దది. అంతే కాదు నేను 300 రూపాయల వద్ద నుంచి నా మిత్రులు బంధువుల చేత ఈ విమల్ కంపెనీ షేర్లు కొనిపిస్తున్నాను వారి వద్ద డబ్బు లేదన్నా వారి మిగతా ఆస్తి అమ్మి అయినా సరే దీనిలో పెట్టుబడి పెట్టిస్తున్నాను మీకు ధీరూభాయి అంబాని గూర్చి గాని, విమల్ గూర్చి కాని విపులంగా తెలియకపోవటం మూలంగా చాలా తొందరపడి మాట్లాడారు. అయినా ఫర్వాలేదు. మీకు నేనిచ్చే సలహా ఏమిటంటే మీరు మీ వద్ద వున్న డబ్బు అంతటిని పోగు చేసి విమల్ షేర్లు కొనండి. అప్పుడే 360కి వెళ్ళి మళ్ళీ 340కి వచ్చింది. ఈసారి జంప్ 500 వరకు వెళ్తుంది ఎందుకంటే విమల్ కంపెనీ షేర్ బ్రిటన్ స్టాక్ ఎక్స్‌ఛేంజ్‌లో నమోదు చేయబడుతున్నది. అప్పుడు ప్రపంచం మొత్తం ప్రజలు దాని కోసం పోటీ పడటం మూలంగా దాని ధర రు. 500 హీనపక్షంలో పలుకుతుంది. మహా అయితే ఇది అంతా 3-6 నెలలకంటే ఎక్కువ కాలం పట్టదు అని నాకు నా ప్రక్కనున్న మా అన్నయ్యగార్కి ప్రోత్సహించటం ప్రారంభించాడు. అది చూసిన మా అన్నయ్యగారు ఇంత లాభం వస్తుంది అని తనకు చెప్పనందుకు నా పైన కోపంతో అతని మీద గొప్ప ఆరాధనా భావంతో చూస్తున్నారు అంతా వివరించిన తరువాత మెల్లగా నేను చెప్పాను.

అయ్యా తమరు చెప్పింది అంతా బాగుంది. మీరు పబ్లిక్ ఇష్యూలో సంపాదించారు (అంటే 10 రూ.ల షేరు 10 రూ.లకే) కాని మీరు మిగతా వార్ని 10 రూపాయల షేర్‌ను 330కి కొనిపించటం భావ్యం కాదు. అంతే కాక ఈ షేర్ విషయంలో మీరు సాంకేతిక విషయాన్ని గమనిస్తే ఇది 230 నుంచి ఏక ధాటిగా 360 వరకు వెళ్ళింది. ఏ షేర్ అయినా సరే ఇంత త్వరగా పెరగటం వలన కనీసం పెరిగిన దానిలో 1/3వ వంతు పడాలి. లేకుంటే 2/3 పడటానికి కూడా అవకాశం వుంది అంటే రు 320కి లేదా 280కి కానీ పడటానికి చాలా అవకాశాలు వున్నాయి. అంతే కాక ఆ కంపెనీకి రాజకీయ వాతావరణం బాగుండలేదు కాబట్టి ఈ ధరలో అమ్మేసి ఏ కాల్గేట్ షేరో (అది అప్పట్లో రు 280 వుండేది) కొనండి అని చెప్పాను

నా మాటలు రుచించని అతడు సరే పందెం కాద్దాం అన్నాడు. నాకు ఈ మార్కెట్‌లో పందాలు కాయటం ఇష్టం లేదు. అందుకని నేను అతనితో వాదన చెయ్యలేదు

ఆ తరువాత విషయం ఏమిటంటే ఆ కంపెనీ అధినేత శ్రీ ధీరూభాయి అంబానీకి రాజకీయ ప్రత్యర్థులు, వ్యాపార ప్రత్యర్థులు అధికం అవటం మూలంగా ఆ కంపెనీ మీద అనేక కేసులు, కుట్రలు, కుతంత్రాలు జరిగి నేటికి అది కేవలం 90 రూపాయలకు మాత్రమే ధర పలుకుతున్నది. అంటే పెట్టిన పెట్టుబడిలో 1/4 మాత్రం అసలు వుంది ఈ విధంగా తెలిసీ తెలియని మిడి మిడి జ్ఞానంతో ఎందరో మరి ఇంకొందరిని నష్టపరచటం



మూలంగా చాలా మంది పెట్టుబడిదారులు మార్కెట్ నుండి 1985- 86 తరువాత తుపాకి గుండుకి అందకుండా పారిపోయారు

ఈ విధంగా ఎందరెందరో చిన్న పెద్ద పెట్టుబడిదారులు తమ అమూల్యమైన కష్టార్జితాన్ని సరైన అవగాహన లేకుండా వేలు, లక్షలలో ఈ మార్కెట్‌లో పోగొట్టుకున్నారు. వారందరికి నా ఈ వ్యాసాలు చేరాలని, పెరుగుతుంటే ఇంకా పెరుగుతుంది అనే పిచ్చి మోహముతో అమ్మక నష్టపోయిన వారికి, ఎందరెందరో షేర్ డీలర్స్, షేరో బ్రోకర్స్ ద్వారా మోసపోయి రైట్ ఇష్యూలు ఎక్కువ ధరకి కొని అలాగే ప్రమోటర్స్ కోటాలు అధిక మొత్తాలలో కొని నష్టపోయిన వారు తిరిగి ఈ మార్కెట్‌లో ప్రవేశించాలని నా సంకల్పం అందుకోసం వ్రాస్తున్న ఈ వ్యాసావళిని పెద్ద మనసుతో ఆదరిస్తారని నా ప్రగాఢమైన విశ్వాసం.

అన్నట్టు చెప్పటం మరిచాను. మొన్న ఈ మధ్య మా ఫ్రెండ్ అదేనండీ వెంకటరత్నం సి.బి.ఐ పి లో పని చేసే ఆయన నాకోసం స్టాక్ ఎక్స్‌ఛేంజ్‌కి వచ్చి నేను బిజీగా వుండటం మూలంగా గాలరీలో కాలక్షేపం చేసాడు. 4 గంట. ఐన తరువాత నా కాబిన్‌కి వచ్చి 'మీకు ఒక పొడుపు కథ వెయ్యనా' అన్నాడు 'సరే అన్నాను. 'ప్రపంచం మొత్తం మీద మీ స్టాక్ ఎక్స్ఛేంజ్‌లో మాత్రమే కనిపించే విశ్వమానవ సౌభ్రాతృత్వం ఏ విషయంలో' అన్నాడు మా స్టాక్ ఎక్స్‌చేంజ్‌లలో అటువంటి ప్రశ్నని ఎదురు చూడని నేను తెల్ల మొహం వేశాను. ఎందుకంటే ఆఫీసుకి వచ్చిన దగ్గర్నుంచి ఏదిపెరుగుతుంది, ఏది పడుతుంది ఆ రెండు ప్రశ్నలు తప్పించి మరి ఏ ఇతర ప్రశ్నలు ఇక్కడ అడగటం జరగదు. అతడు చిన్నగా నవ్వి (అన్నట్టు మీరు చూడలేదు కాని అతను నవ్వితే చాలా బాగుంటుంది సుమా) సిగరెట్టు త్రాగే వాళ్ళ మధ్య (రెండు ఇన్వెష్టర్ల మధ్య) ఎలాగైతే సిగరెట్టు త్రాగే వారు నిప్పు లేకపోతే లక్షాధికారి, రిక్షావానికి నిప్పు ఇస్తాడు, అలాగే రిక్షావాడు, లక్షాధికారికి నిప్పు ఇస్తాడు, అలానే మీ ఇన్వెస్టర్లు ఒకరికొకరు అడగకుండా ఇంకొకరికి వుచిత సలహాలు పుచ్చుకోవటం జరుగుతున్నది. ఇది కాదా విశ్వమానవ సౌభ్రాతృత్వం? అని ప్రశ్నించాడు.

అతని వివరణకి చాలా ఆశ్చర్యపోయాను. మరి వచ్చే వారం లాభాల వేటగాళ్ళ (ప్రాఫిట్ హంటర్స్) గురించి, సామాన్య ఇన్వెస్టర్‌ని స్టాగ్ (దుప్పి) అని ఎందుకంటారు అనే విషయాలు తెలుసుకొందాము □

---

# ప్రసాదం

శివల ఉమాదేవి

"నీకేం ఫర్వాలేదు. ఈ వూర్లో నీకు దివ్యంగా వుంటుందిరా! మీ వూరుకంటే చాలా నయం అనుకో! ప్రతీ వస్తువా అందుబాటులో దొరుకుతుంది! మా ఏరియా చూశావ్‌గదూ? ఎలావుంది?"

వాళ్ళ యింటికి వెళుతూనే, మావయ్య మాటలతో వూపిరిసలపనీయలేదు చిదంబరానికి తనతో తీసుకువచ్చిన ఎయిరిండియా బ్యాగు యింకా చేతిలోంచీ దించలేదు! మావయ్య వాక్ప్రవాహంలో పడిపోయి, చిదంబరం చేష్టలుదక్కి అలా నిలబడివుండిపోయాడు.

నిజమే! జనార్ధనం మావయ్య యిల్లు చాలా బావుంది! విశాలమైన గదులు నాలుగయిదున్నయ్! అన్నిటికీ పెద్దపెద్ద కిటికీలూ, వాట్లోంచీ ధారాళంగా గాలీ, వెలుతురూ వస్తున్నయ్! మొజాయిక్ నేలా, డిస్టెంపరేసిన గోడలూ, అధునికమైన ఫర్నిచరూ, అప్టుడేటు వంటగదీ.... మెట్లు ఎక్కి పైకివెళ్ళాడు చిదంబరం. మేడమీద ఒక పెద్ద గదివున్నదంతే! సౌకర్యాలన్నీ ఆ గదికి వున్నయ్! కాని తలుపులువేసి, గడియ బిగించివున్నది ఆగది! తలుపుతీసి లోనికెళ్ళిచూసి నిట్టూర్చాడు చిదంబరం.

"మావయ్యా! యింతగదిని ఎందుకు నువ్వు యిట్లా ఖాళీగా వుంచేశావోగానీ, యిదే మా వూరిలో అయితే ఓ నూట ఎనభయ్ రూపాయలేనా రాబడ్తారీ గదిమీద! మరి నువ్వెందు కిలా వుంచేసావో?" అన్నాడు చిదంబరం.

"నా కెవరికీ అద్దెలకివ్వడం యిష్టంలేదురా! నేను మొదట్నించీ యిల్లు కట్టినదగ్గర్నించీ అలాగే అనుకున్నాను! అలాగే చేస్తున్నాను యిదిగో! ఎవరయినా మనవాళ్ళొంటూ వుంటే నా కెంతో తృప్తీ, సంతోషమూను! నువ్వయితే ఒంటిగాడివి! నీకు మరోళ్ళ పోరులేదు! ఒక్కడివీ ఆ గదిలో చక్కగా రాసుకుంటూ వుండొచ్చు!! చదువుకో! నిద్రపో! నీయిష్టం! ఆ గదిని నీ కిచ్చేశానంతే! నా నిర్ణయానికి మాఆవిడా, పిల్లలు ఏమీ అభ్యంతరం చెప్పర్రా!! వాళ్ళసంగతి నీకుమాత్రం తేలీదూ?"

తెలుసునన్నట్టు బుర్ర వూపేడు చిదంబరం.

అతను వెళ్ళేసరికి యిల్లంతా నిశ్శబ్దంగానే వున్నది! అత్తయ్య దక్షిణదేశ యాత్రలకి టూరిస్టు బస్సుమీద ఒక బృందంతో వెళ్ళిందని మావయ్య చెప్పాడు. ఇద్దరాడపిల్లల్లో పెద్దపిల్ల మృణాళినికి నాలుగేళ్ళక్రితమే వివాహం అయ్యి, భర్తతో అతను ఉద్యోగం చేస్తున్న బొంబాయి వెళ్ళిపోయింది. ఏడాది కొక నాల్రోజులే అరుదుగా యింటికి వస్తుందిట! రెండోపిల్ల వింధ్య పెద్దచదువులు చదివి, మధ్యప్రదేశ్‌లో ఏదోవూర్లో మంచి జాబ్ చేస్తోందిట! "అది ఎందుకోగానీ పెళ్ళిచేసుకోననేసింది! సరే! ఏంచేస్తాం? దాని బ్రతుకునీ, భవిష్యత్‌నీ దానిఖర్మానికి విడిచిపెట్టేసేము" అన్నాడు మావయ్య.

"అయితే, క్రింద యింత యిల్లూ యిట్లా మీ యిద్దరే వుంటున్నారా? యిన్నిగదులు, యిన్ని సౌకర్యాలు?" వాపోయాడు చిదంబరం.

"ఆహా అత్తయ్యా, నేనే వుంటున్నాం! నే నసలు నెలలో ఏ వారం పదిరోజులో యింటిదగ్గర వుంటానేమో నా వ్యవహారాల్నికు తెలుసుగదూ?" నవ్వాడు మావయ్య.

"జనార్ధనం మావయ్య వుద్యోగం ఎప్పుడూ చేయలేదు! ఎం. కాం. ఫస్ట్‌క్లాస్ అయినాక, రాజకీయాల్లో దిగాడతను! గాంధీగారి కాలంలో మావయ్య వుద్యమాలుతో వూపిరాడకుండా తిరిగాడు. జైలుకెళ్ళాడు. లాఠీదెబ్బలితిన్నాడు చాలాచాలా హీరోగారి కార్యాలు నెరవేర్చాడు.

ప్రస్తుతం అతని వయసు అరవయ్యయిదు! అయినా బ్రహ్మాండమైన పర్సనాల్టీ!! మంచి పుష్టిగలఒళ్ళు! ఒక్కపూటే రోజుకి తిన్నా శుభ్బరంగా తినగలచేవవుంది! అది తనకేలేదు అని చింతించాడు చిదంబరం.

ఆ వూరికి అంతకుమునుపు ఒక్కమారే వచ్చాడు చిదంబరం. అదీ ఆరు సంవత్సరాలక్రితం. చుట్టం చూపుగా వచ్చి. యిరవయిరోజులుండీ వెళ్ళిపోయాడు.

జనార్ధనం మావయ్యకి వుద్యోగం లేదుగదా? భార్యనీ సంసారాన్నీ ఎట్లా పోషిస్తున్నాడని చిన్నతనంలో అనుకునేవాడు చిదంబరం. అత్తయ్య – మావయ్య పెళ్ళినాటికే బ్యాంకులో వుద్యోగం చేస్తున్నదని తెల్సింది! వాళ్ళిద్దరికీ సామరస్యం వున్నదిగనుక సర్దుకుపోతున్నారు! యిల్లు ఆవిడే కట్టించింది! మావయ్యకి పలుకుబడిబాగా వున్నది ఆ వూరిలో, చుట్టూ వూళ్ళలో! ఎవరో వస్తారు యింటికి! రాజధానికి వెళ్ళి వాళ్ళపనులు సానుకూలం అయినట్లు చూడమని కోరుతారు! మావయ్య వెళతాడు! వాళ్ళపన్లు అవుతాయ్! మావయ్యకి దారిఖర్చులూ, భోజనం, బసా, ఇతరత్రా ప్రతిఫలమూ లభిస్తుంది! అతను తన జేబులోంచీ తీసీ ఒకరికీయడమేగానీ, భార్య నించి ఏ రోజూ రూపాయి పుచ్చుకోలేదు! తనే ఆవిడకి చీరలూ, చేప్పులవీ కొనేవాడు! పిల్లలికి కొనేవాడు. ఆనాటికీనాటికీ మావయ్య జెండా అలా ఎగురుతూనేవున్నది!

ఆమధ్య స్వాతంత్ర సమరయోధులనీ, రాజకీయ బాధితులనీ యిలాగ అనేకమందికి పెన్షన్లు ప్రభుత్వంనించీ లభించసాగాయి. మావయ్యకి అప్పటినించీ నెలకి వెయ్యికి తక్కువలేకుండా పెన్షను వస్తోందలాగ!

చిదంబరం స్నానంచేసి ఫ్రెష్‌గ అయ్యాడు. వంట



మావయ్య బ్రహ్మాండంగ చేశాడు. సాయంత్రం చిదంబరం అలా బయటకి నడిచాడు ఒక్కడూ. మావయ్య మధ్యాహ్నమే ఎటో వెళ్ళిపోయాడు తిరిగి రాత్రి పదికే రావడం!

చిదంబరం బయటికెళ్ళి నిమషం అలా నించుండిపోయాడు.

మావయ్య మేడప్రక్కనే ఒక చిన్న గుడి వున్నది! చిదంబరానికి గుడి అంటే చాలాయిష్టం! ఎక్కడా దొరకని ప్రశాంతత గుడిలో మనిషికి దొరుకుతుందని అతని అభిప్రాయం. నమ్మకం ఆ గుడిలోకి అంతకుమునుపతను ఒక పదిహేనుమార్లయినా వెళ్ళాడు. ముందర నంది విగ్రహం! వెనుకన శివలింగం, పానవట్టం! నిశ్శబ్దంగా వున్నది అక్కడ. పూజారి చెన్నకేశవులెక్కడా కన్పించలేదు! బహుశా బయటికే కూరానారా తెచ్చుకొందికి వెళ్ళివుంటాడనుకున్నాడు చిదంబరం.

చెన్నకేశవులు ఒక్కడే వుంటున్నాడా గుళ్ళో. గుడిలోనే ఒక గది వేరేగ వున్నది. అందులో చెన్నకేశవులు ఒకవార తనకోసం వంట చేసుకుతిని, పడుకుంటాడు. భక్తులు యిచ్చే దక్షిణ తాంబూలాలు. యితరత్రా వ్రతాలకీ, పూజలకీ వాటికీ లభించేదీ చెన్నకేశవులికి రాబడి! దాంతో అతని జీవనం గడిచిపోతున్నది!

గతమారు చిదంబరం వెళ్ళినపుడు, చెన్నకేశవులు అడిగాడు

"అయితేబాబూ! తమరికి వుద్యోగం సద్యోగం లేదుగదా? ఎట్లాఅయితే ఎందుకుతమరు ఏపనీ చేయలేదు? ఒంటి బతుకు బతుకుతున్నారేవిలా? అడగవచ్చా?"

"అడిగేస్తూ, అడగవచ్చా? అనడం బావుందండీ!" అని నవ్వాడు చిదంబరం

"నాకు వుద్యోగం, ఆఫీసూ లేకున్నా ఫర్వాలేదండీ! రచనలమీద ఆదాయం వస్తుంది! ఇకపోతే, ఒంటిబతుకు అంటారా? ఎందర్నో చూస్తుంటే. ఏంటో ంటే నా కిట్లా ఒంటగా జీవించడంలోనే సుఖం లభ్యమవుతున్నదన్పిస్తుంది! మీ సందేహాలకు సమాధానాలు దొరికాయికదూ?" అని నవ్వాడు.

చెన్నకేశవుల్ని అడగకుండానే, అతని కథ క్లుప్తంగా చెప్పాడు!

"మా అమ్మా, అయ్యని నేను ఎరగనండీ! నాకు బాగా జ్ఞానం వచ్చేనాటికి ఎవరో ఒక అయ్యగారు నన్ను సాకుతున్నారని తెలిసింది!

ఆ అయ్యవారి పెంపకంలోనే నేను పదిహేనేళ్ళవాడినయ్యేను! తర్వాతాయన గుండె ఆగి మరణించేరు! ఆయనదే బాబూ ఈ గుడి! అదిగో ఆనాటినించీ ఈనాటిదాకా యిదే నా ఆవాసం! ఆదాయం! అన్నీనూ" అని చెప్పాడు.

అయితే మీరేం చదివీవుండలేదాండీ?

"చదువా? నాకది వంటపట్టలేదుబాబూ! మా. అయ్యవారు ఆ ముచ్చటపడ్డారుగాని తీరలేదది!! ఆయన తనెలా ఈ గుడిమీద జీవనం కొనసాగించారో? నన్ను ఆవిధంగానే బ్రతకమంటూ మంత్రాలూ అవీ నేర్పారు! జనానికి దేవుడి మీదా, కర్మమీదా భక్తిప్రపత్తులమీదా నమ్మకం. గురీ వున్నంతకాలం మేమూ వుంటాం బాబూ!!" అంటూ యింత పులగం (పెసరన్నం) చేతిని పట్టమంటూ యిచ్చాడు చెన్నకేశవులు.



ఆ ప్రసాదం రుచి అద్భుతంగా అనిపించింది చిదంబరానికి. అది చెన్నకేశవులిచేతి మహాత్యమో? ఈశ్వరుడి మహాత్యమో అనుకున్నాడు
చిదంబరం వెళ్ళినపుడల్లా ఆ ప్రసాదం పట్టెడు యిచ్చేవాడు చెన్నకేశవులు.

"శివుడికిదే నేనెప్పుడూ వండీ నయివేద్యం చేస్తాను బాబూ!" అని చెప్పాడు

చిదంబరం ఆ ప్రసాదం జ్ఞప్తికివచ్చి నాలికతో పెదిమల్ని తడుముకున్నాడు. మళ్ళీ ప్రసాదం కోసం అతని నోరూ, మనసూ వూరసాగింది రాడేమి అతనింకా? అని ఎదురుచూస్తుంటే –

అంతలో చెన్నకేశవులొచ్చాడు బయటనించీ!

"అర్రెర్రేర్రే! ఎందుకబ్బా అట్లాగోల?! కొనిచ్చేగదా, నువ్వడిగిందీ?!"

వులిక్కిపడి చూసాడటు చిదంబరం. వచ్చింది చెన్నకేశవులేనా? అనుకున్నాడు ఆహా! అతనే! అయితే మరి, అతని చేతుల్లో ఆ మూడేళ్ల పాప ఎవరు?

చిదంబరం ఒకడుగు ముందుకి వేసాడు "ఏవండీ?" పిలిచాడు

చెన్నకేశవులు మొదట యిటుగా చూడలేదు. అతనిధ్యాసలో అతనున్నాడు

ఈ గుడిలోకి చిదంబరం వస్తూనే తలుపులుతీసే వుండడం చూసి "ఈ చెన్నకేశవులికి ఎంతగురి. మనుషులుమీద? గుడి తలుపులెప్పుడూ తీసేసే వుంచుతాడుగదా?" అని అనుకున్నాడు. పూజారి గది తలుపులూ తెరిచేవుంటయెప్పుడూ!

"అయినా ఏమున్నయ్తే? పోయేవి? రాతి లింగం. రాతి నంది? చెన్నకేశవులికిమాత్రం ఆ గదిలో ఖరీదయినవేమీ లేవుగద? అతని ఒంటి బ్రతుకు వస్తువుల కాశపడేంత కక్కుర్తి మనుషులుంటారా?" అని అనుకున్నాడు మళ్ళా.

చెన్నకేశవులికీ లోకంలో బంధాలు, అనుబంధాలూ, తనవాళ్ళూ. తనదంటూ విలువయిన వస్తువులూ ఏమీలేవు అనుకుంటూంటే –

ఇదేమిటి? ఈ పాప ఎవరితడి చేతులలో?!

అంతమోజేమిటతడి కా పాపపైన? గుడిలో ఎవరున్నారో కూడా చూడనంత?!! అని విస్తుపోయాడు చిదంబరం.

ఎవరో తెలిసిన వాళ్ళపిల్లయివుండొచ్చు! పిల్లలంటే, పువ్వులంటే ఎవరికి ప్రేమ కలగదు? అనుకుంటున్న చిదంబరం అటుగా చూసి విస్తుపోయాడు.

చెన్నకేశవులు పాపని తీస్కొని తన గదికి వెళ్ళాడు. వెడుతూ, "మీ రెప్పుడు వచ్చేరు, బాబుగారూ? ఇలారండి!" అన్నాడు మామ్మూలుగానే, చిదంబరం అతని గది వయిపు వెళ్ళాడు. పాప నేలమీద ఒకటికి పోసేస్తే, అలుగ్గుడ్డ తెచ్చి అక్కడ తుడిచాడు చెన్నకేశవులు. "మీరు కాస్సే పుంటారు గదూ? నేను దీనికి బువ్వ తినిపించాలి! పాపం ఆకలవుతోంది వెర్రి నాన్నలుకి!" అన్నాడు చిదంబరంతో.

ఆత్రం పెరిగి పోతోంది చిదంబరంలో.

ఇతని కింత శ్రద్ధ ఏమిటీ పాప పైన?! ఎవరి పాపో అయితే?!

ఏదో అడగబోయి ఆగి పోయాడు.

ఒక చిన్న స్టీలు కంచంలో అన్నం మజ్జిగా కలుపుతున్నాడు, చెన్న కేశవులు! మెత్తగా గుజ్జులా పిసికి, ఒక్కో ముద్దా పాప నోటిలో జాగ్రత్తగా పెడుతున్నాడతను! "తినమ్మా! అలా మారాం చెయ్యకూడదు, మరి! ఆఁ ఆఁ అమ్! ఆఁ అలా తినాలి!! ఏదీ? ఏదీ? ఒక్కటే ముద్ద! ఆఁ ఆఁ .. అమ్!! అద్దీ! మా మంచి పాప గదూ?"

"పేరేంటండీ పాప పేరు?" చిదంబరం అడిగాడు, నోరిప్పకుండా వుండలేక.

"దీని పేరా? చందమామ అనీ నేను పెట్టాను! ఎలా వుందీ?"




"చాలా బావుంది" అన్నాడు చిదంబరం. తను పేరు పెట్టాడా? అదేవిటి? అయితే ఇంకో పేరుందా? ఆ పేరెవరు పెట్టారు?!

"ఏవండీ?...." అంటూంటే,

"వస్తున్నా వస్తున్నా! ఒక్క నిముషం! దీన్ని పడుకో బెట్టి...." అంటూ, పక్క వేస్తున్నా డతను, మంచమ్మీద!!

సందేహాలతో చిదంబరం నుంచుండి పోయాడా గుళ్ళో.

నిశ్శబ్దం పూర్వం మాదిరిప్పుడు లేదక్కడ! పాప అల్లరితో గుడి ధ్వనించింది! పాప అవశిష్టంతో తడిసింది! పాప చేష్టలతో వాతావరణం స్థబ్దతని, జడత్వాన్నీ కోల్పోయి, ఒక చిత్రమైన స్పందనతో నాదంతో నిండింది!! అది ఢమరుక నాదమా?!

తలోచిస్తూన్న చిదంబరం, "ఏవిరా? నువ్విక్కడ వుంటావని నాకు తెల్సురా! అందుకే వచ్చేను" అన్న మావయ్య గొంతుతో వులిక్కి పడ్డాడు.

"పద పద! చాలా సేపయింది. నీ కాకలవుతూందే(వో? అన్నం పెట్టేస్తాను" అంటూ చెయి పట్టి తీసుకు పోయాడు అతను చిదంబరాన్ని.

భోజనం దగ్గర చిదంబరం తన సందేహాన్ని బైట పెట్టాడు! "మావయ్యా! మన చెన్నకేశవులి దగ్గర పాప ఎవరూ?"

సమాధానంగా మావయ్య నవ్వాడు. "నాకూ ఆ విషయం సరిగ్గా తెలీదురా! అడిగిన వాళ్ళకి చెన్నకేశవులు తన పాపే అని చెపుతున్నా డంతే! మరి ఆ పిల్ల తల్లి ఎవరో? ఎక్కడుందో? ఎప్పుడు ప్రవేశించిందో, అతని జీవితంలోకి?"

చిదంబరం సందేహం అలాగే వుండి పోయింది.

* * * * * * *

ఆకాశం దట్టంగా మబ్బుపట్టి, చల్లటి గాలి వస్తోంది ఒకటీ, ఒకటీగా మొదలెట్టిన చినుకులు క్రమ క్రమంగా అధికం అయ్యి, అలా వాన తీవ్రమైంది!

చిదంబరం తన గదిలోంచీ బయటికి వచ్చి, మెడదిగాడు. మావయ్య ఇంట్లో లేడు. వుండి, వుండి, ఎవరో వస్తే వాళ్ళతో గభాల్న వెళ్ళిపోతూంటాడు! చెప్పి వెళ్ళడం అనేదతని నిఘంటువులో లేదు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అత్తయ్య ఈ వారం అంతా కూడా రాదని మావయ్య తనతో చెప్పాడు అనుకున్నాడు చిదంబరం. భోజనం. నిద్ర రాత. చదువు రెండు దినాల నించీ చిదంబరానికి బోరుగా అనిపిస్తోంది. వాన వాన! ఇల్లు కదలనీయడం లేదు!!

అతనలా వరండా దాకా వెళ్ళాడు. అక్కడి నించీ కొంత మేర గుడి ఆవరణా కనిపిస్తూంటాయి.

గుడి ఆవరణలో చెన్నకేశవులి పాప తారట్లాడుతోంది! కాయితాలు పడవలు చేసి చెన్నకేశవులిస్తోంటే, అక్కడ చిన్న కాలువగా ప్రవహించే వాన నీటిలో పడవల్ని వదులుతూ, చప్పట్లు కొడుతోంది! పాప మరి కొంచెం ముందుకు వెళ్ళి, మరుక్షణం కాలు జారి దభాల్మంటూ పడిపోయింది నీట్లో!

# ఇ-వేమన-పద్యాలు




వల్లవైపు లేక వాగ్దత్తములు చేసి
యదిగో ఇదిగో యన చు నాశబెట్టి
గడువుబెట్టి రేపు గడియగానిమ్మని
గడియలో నబడియె గదర వేమ.

గట్టిగా పాప ఏడుస్తోంది! చెన్నకేశవు లామె నెత్తుకుని, ఓదార్చుతూ, లోపలికి తీసుకు వెళ్ళాడు.

ఆ దృశ్యం కనుమరు గయితే, చిదంబరం వూపిరి విడిచాడు, బరువుగా. వాన తగ్గితే బావుండు నన్నుకున్నాడు. వానలో తడవడం అతనికి చాలా చికాకు.

ఆ రోజంతా కూడా వానలా పడుతో నే వుంది!

మావయ్య రెండు పూటలకి ఒకేసారి వంట చేసి, ఫ్రిజ్‌లో పెట్టేసి వుంచుతున్నాడు! తినే సమయానికి గాస్ పొయ్యి మీద వేడి చేస్కోడమే!

చిదంబరం ఇల్లంతా అలంగం తిరిగాడా రోజంతా.

ఆ రాత్రి పదకొండు గంటలకి మావయ్యని వాళ్ళ కారులో తెచ్చి దిగబెట్టారు తీసుకుని వెళ్ళిన వాళ్ళు.

## ప్రసాదం

ఆ మర్నాడు వాన తగ్గిపోయింది! ఆకాశం నిర్మలంగా మారింది! ఎండ కూడా వస్తే, చిదంబరం ఆనందించా డెంతో. "ఏరా? మీ అమ్మకి, నాన్నకి, అన్నయ్యకీ వుత్తరం రాశావా?" అడిగాడు మావయ్య.

"వచ్చిన మర్నాడే రాసేను!" ,అని చెప్పాడు చిదంబరం.

అతనా రోజు సమయం చూస్కుని, గుడిలో కెళ్ళాడు.

చెన్న కేశవుల్ని చూసి నిశ్చేష్టు డయ్యాడు చెన్న కేశవులి మొహం ఎంతో నీరసంగా, వాడిపోయి, కళతప్పి, పది లంఖణాలు చేసినట్టు వున్నది!!

"పాప కెలా వుంది?" అడిగాడు చిదంబరం

"మీ కెట్లా తెలుసూ?"

"నీళ్ళలో జారి పడిపోవడం చూశాను మా ఇంట్లోంచి!"

"దెబ్బ చిన్నదే గానీ, జ్వరం బాగా వచ్చేసింది! మందు వేస్తున్నాను!" అంటూ పాపని చూపించా డతను

"మీరు భోజనం మానివేశా రేమిటి? అట్లా అయిపోయారు?!"

అతనదోలా నవ్వాడు "నాకు తిండి 'సహించడం లేదు! నిద్ర పోవడం లేదు! అదేం అయిపోతుందోనని బెంగగా వుంది!" దిగాలుగా చెప్పాడు.

చిదంబరం వెళ్ళి ఒక రిక్షా తీసుకు వచ్చాడు. అందులో చెన్నకేశవులు, పాప నెత్తుకు కూచుంటే, తను పక్క నుండీ, ఒక డిస్పెన్సరీకి తీసుకు వెళ్ళాడు. తిరిగి వాళ్ళు గుడిలోకి వెళ్ళాక, తీసుకు వచ్చిన మాత్రలు పాపకి వేసాక, అప్పటికి చెన్నకేశవులి ముఖం కొద్దిగా వికసించింది! అతను నింపాదిగా, చిదంబరంతో ఇలా చెప్పాడు.

"పాప తల్లి పవిత్రమైన బాధ్యత నా కప్పగించి పోయిందండీ!! ఆమె చాలా హీనమైన పరిస్థితిలో మరణించింది! ఆఖరి క్షణాలలో కూడా ఆమెకి అన్నం కరువై పోయిందంటే, నమ్ముతారా, మీరు? ఈ ప్రక్క వూరే వారిది! భర్త బాధ్యత లేకుండా ఆమెనీ, పిల్లని వాళ్ళ ఖర్మానికి విడిచి ఎటో వెళ్ళిపోతే, ఆవిడ నానా తిప్పలూ పడింది!! ఆవిడకి చదువు లేదు. సంపాదన చేసే ఏ పనీ చేత కాదు! అలా అని పాచి పనీ అలాటివి చేయడానికి మానాభిమానా లొప్పలేదు!! అబద్దాలాడీ, ఈ అమ్మాయిని ఒక కుటుంబంలోంచీ లాగాడు ఆ రాస్కెలు!! కట్నమూ, ఆమె ఒంటి మీద వస్తువులూ, అన్నీ హరించి పారి పోయాడు!!! ఆమె తాలూకు వాళ్ళు ఒక అన్నా, వదినె మాత్రమే!! వాళ్ళు మరి చేరదీయరని ఆమెకి తెలుసు! ఆ పరిస్థితిలో.... నేనా చోటికి, ఒక పని మీద, అంటే, ఆమె వుంటోన్న పక్కింటిలో రెండు దినాలు భారీ ఎత్తున నోము జరిగి ఆహ్వానిస్తే, అది జరిపించే నిమిత్తము వెళ్ళాను!! పనయ్యేకా, పక్కనే ఆ దుస్థితి నా గుండెని చెరువు చేస్తే వెళ్ళీ, స్వాంతన పలకబోయీ, ఆవిడ నాతో తన గోడంతా చెప్పుకునీ నా చేతుల్లో ఈ పిల్లనుంచితే, ఏం చేస్తానండీ? చెప్పండి??" అగా డతను ఆయాసం తీర్చుకున్నాడు.

"ఆవిడ నా కప్పగించిన ఈ బాధ్యతని ప్రసాదంలా స్వీకరించే నండీ!! ఈ విషయం అందరికీ నేను ఎందుకు చెప్పాలీ? మీ మీదయితే నా కున్న ఒక మంచి భావం వలన ఇదంతా ఇప్పుడు చెప్పాను!!" అన్నాడు నిట్టూర్చుతూ.

చిదంబరానికి తన ప్రసాదం గుర్తు వచ్చి, అడగబోయీ, అది సమయం కాదని వూరుకున్నాడు

పాప చెన్నకేశవులి చేతుల్లో నిబ్బరంగా నిద్ర పోతున్నది! □







# భారతి

సాహిత్య మాసపత్రిక

## అతిత్వరలో మళ్ళీ వెలువడుతోంది!

కొన్ని అనివార్య కారణాల వలన భారతి సాహిత్య మాసపత్రిక ప్రచురణని తాత్కాలికంగా నిలిపి వెయ్యటం జరిగింది కాని–

సాహిత్యాభి మానుల కోరికపై

**– అతిత్వరలో –**

సాహిత్య మాసపత్రిక

**భారతిని**

తిరిగి వెలువరించటానికి ఏర్పాట్లు చేస్తున్నాము!

★ ఎప్పటిలాగే భారతి సాహిత్యానికి ప్రాధాన్యం ఇస్తుంది!

★ కవిత్వం, కథలు, చారిత్రక పరిశోధన, విమర్శనము, భాషా శాస్త్రం, చర్చ– అన్నిటికీ భారతి చక్కటి అవకాశాలు కల్పిస్తూనే ఉంటుంది!

★ ఒక్క మాటలో చెప్పాలంటే భారతి తెలుగు వారి సంస్కృతికి (భారతీయులుగా, ఆధునిక ప్రపంచపు పౌరులుగా) ప్రతిబింబంగా ఉంటుంది

సాహిత్యాభిమానులు చందాదారులుగా చేరి భారతి ప్రచురణకి తగిన ప్రోత్సాహం ఇవ్వాలని కోరుతున్నాము

చందాదారులుగా చేరే వారి సౌకర్యం కోసం ముందుగానే ఒకేసారి 12 సంచికల చందా కట్టేవారికి రు 15/–ల ముదరా ఏర్పాటు చేస్తున్నాము.

అంటే సంవత్సర చందా నెలకి రు. 5/–చొప్పున రు. 60/– అవుతుంది. కాని ముందుగా చందా దారులు కావాలనుకున్న వారు రు. 45/– పంపితే చాలునన్నమాట!

ఆంధ్ర పత్రిక ఏజెంటు ఉన్న చోట సరఫరా ఏజెంటుద్వారా జరుగుతుంది

ఏజెంటు లేని చోట ఉన్న వారికి భారతిని పోస్టు ద్వారా పంపగలము.

ఈ ప్రకటనలో పొందుపరిచి ఉన్న కూపనుని నింపి మీ చందా మొత్తంతో నేడే పంపగోరు తున్నాము.

చందాదారులుగా చేరదలచినవారు భారతి, కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003. చిరునామాకు మనియార్డరు/ డ్రాఫ్టు ద్వారా రూ 45/– చెల్లించాలి మనియార్డరు రసీదు/ డ్రాఫ్టుతో బాటు ఈ క్రింది కూపన్ జతచేర్చి పంపాలి

మనియార్డరు కూపన్‌లో భారతి సంవత్సర చందా నిమిత్తం రు 45/– పంపుతున్నట్టు రాస్తూ, తమ పోస్టలు చిరునామాను స్పష్టంగా రాయాలి

### భారతి చందా కూపను

నేను భారతి మాసపత్రికకు చందా దారునిగా చేరదలుచుకున్నాను సంవత్సర చందా పైకము రు 45/-(25 శాతం ముదరా పోను) డి. డి/ ఎం. ఒ ద్వారా పంపుతున్నాను.

పేరు : . .

చిరునామా .

పిన్‌కోడ్ : . .. .. .. ..

**చందాదారుని సంతకం**

సీరియల్

# మంత్రనాగం

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

రాత్రి పన్నెండు గంటలు కావస్తోందని అరవింద్ చేతినున్న ఎలక్ట్రానిక్ వాచ్ చెప్తోంది.

కాంతి, అరవింద్, భట్టు ముగ్గురూ అతి ప్రయాసగా ఓ పెద్ద వటవృక్షం ఎక్కి, కొమ్మల మాటున బిక్కు బిక్కుమంటూ కూర్చున్నారు.

అరవింద్, భట్టు కాస్త ధైర్యంగానే వున్నా కాంతి మాత్రం ఏ చిన్న చప్పుడయినా ఉలిక్కిపడి చివురుటాకులా కంపించి పోతోంది.

ఆమె మొహం పది లంకణాలు చేసినట్టుంది. మగాళ్ళిద్దరూ ఆమెకి ఎన్నో విధాల ధైర్యం చెప్తున్నా, ఆమెని ఆవరించిన పిరికితనం పోలేదు.

వాటికి తోడు మధ్య మధ్య క్రూరమృగాల అట్టహాసాలు! అరచేతిలో ప్రాణం పెట్టుకున్నట్టు కూర్చుంది.

క్షణాలు గడుస్తున్న కొద్దీ అరవింద్ వాళ్ళలో కూడా భయం తన్నుకొస్తోంది.

దూరంనించి పులి గాండ్రింపులు, నక్కల వూళలు, వింత పక్షుల అరుపులు వినిపించి మరణ గీతాల్లా అనిపిస్తున్నాయి. రివాల్వర్స్ సిద్ధంగా వుంచుకున్నారు.

"ఎవరీ పన్ను చేసింది? నిజంగా అడవి మనుష్యులే అయితే ఆ గ్రంథాన్నేం చేసుకుంటారు? ఒకవేళ తమని బంధించడం కోసం ఇలా చేస్తున్నారా?.... ఒకవేళ అదే నిజం అయితే తాము కనిపించనంత మాత్రాన ఒదిలి పెడతారా? ఈ అడివి నలు మూలలా గాలించరూ?" ఇలా వున్నాయి అరవింద్ ఆలోచనలు.

"అసలు ఇంత కారడివిలోకి రావడం పెద్ద సాహసమే! అందులోనూ ఓ ఆడపిల్లతో!– . ఈ అడివిలో ఇంత దారుణమైన పరిస్థితుల్లో వున్నామని అయ్యగారికి తెలిస్తే ఏమనుకుంటారు? ఎంత తల్లడిల్లి పోతారు?....

ఒక వేళ వెంటనే బయల్దేరి వచ్చేస్తారేమో కూడా!.... అలా జరిగితేనే మంచిదేమో ఎలాగో ప్రాణాలతో బైటపడచ్చు!..... అయినా ఇక్కడి సంగతి వాళ్ళ కెలా తెలుస్తుంది?" ప్రశ్న, జవాబూ కూడా తనే వేసుకుంటున్నాడు భట్టు.

"ఛ!ఛ!..... ఏవేవో సుందర దృశ్యాలు చూద్దామని వచ్చాను గానీ.... ఇంత నరకంలో కొచ్చి పడతాననుకోలేదు. అలా అని ముందే తెలుస్తే..... సత్యాగ్రహం చేసైనా సరే... ఈ ప్రయాణాన్ని ఆపించేదాన్ని!..." అనుకుంది కాంతి. ఇలా అనుకోవడం ఆమె నూటొక్కోసారి.

క్షణాలు యుగాల్లా గడుస్తున్నాయి.

వాళ్ళ ఆలోచనలు ఓరకంగా లేవు?

అన్నీ వూహాగానేలే!

అక్కడి కొచ్చినందుకు ఓ వైపు ఆనందంగానూ, అక్కడ చిక్కుకు పోయినందుకు మరో వైపు భయంగానూ వుంది.

ఓ సారి చెట్టు పైకి చూసింది కాంతి.

ఆకుల మధ్య నించి చంద్రుడు తమాషాగా కనిపిస్తున్నాడు.

"అరవింద్", మెల్లగా అంది కాంతి.

అతను తల తిప్పి చూశాడు.

"నాకు భయమేస్తోంది అరవింద్" దీనంగా అంది కాంతి.

"భయమెందుకు కాంతీ! మనదగ్గర రివాల్వర్స్ వున్నాయి. ఎలాంటి ఆపదనైనా ఎదుర్కోవచ్చు" ధైర్యం చెప్పాడతను.

"అవుననుకో!.... కానీ రేపట్నుంచీ బతకడం ఎలా? గుర్కాడు కాఫీ తాగడానికక్కూడా లేకుండా అన్ని వస్తువుల్ని ధ్వంసం చేసి పోయారు..... ఏం తినిబతుకుతాం?" అంది కాంతి.

"నాకు నమ్మకం లేదు. మనం ఇక్కణ్నుంచి బైట పడతామని. మానవ మాత్రుడు మనల్నేం చెయ్యక పోయినా తిండి లేక మలమల మాడిపోతూ, చివరికి ఏ జంతువు వాతో పడి దిక్కులేని చావు చావాలి. మన రాత అలా రాసుంది కాబట్టే ఇక్కడి కొచ్చాం! కానీండి. పదిమందితో చావు పెళ్ళితో సమానం అన్నారు పెద్దలు. ఇంక ముగ్గురం ఇక్కడ కూర్చుని భగవన్నామ స్మరణ చేసుకుందాం!" అన్నాడు భట్టు.

జరిగిన కథ –19 : 'ప్రేమకు మరణం లేదు' గ్రంథాన్ని చదివేసిన అరవింద్ కాంతికి, భట్టుకు రసన్ చందనల వృత్తాంతాన్ని వివరిస్తాడు. భారమైన మనసులతో ముగ్గురూ రసన్ శవాన్ని, గ్రంథాన్ని ప్రభుత్వానికి అప్పగించాలని నిర్ణయించుకుంటారు. పేటికను మళ్ళీ సమాధి చేయడానికి వెళ్ళే సరికి అది మాయమై ఉంటుంది. తిరిగి స్థావరానికి వచ్చేసరికి మంచె ధ్వంసమై ఉంటుంది. గ్రంథం అదృశ్యమవుతుంది.

"అదికాదు భట్టూ మనం ఎంత కష్టపడి ఇక్కడికొచ్చాం? ... మనం బయల్దేరేటప్పుడే తెలుసు ఇది చాలా ప్రమాద భరితమైన స్థలమని! తీరా వచ్చి ఇప్పుడు వెనకాడితే ఎలా?

ప్రాణాలకి తెగించి ఈ అడవిలో ప్రవేశించాం. శ్రమ పడి గొయ్యి తవ్వి అమర ప్రేమికుణ్ని చూశాం. అతను రాసిన గ్రంథాన్ని వేదాలకన్నా గొప్పగా దాచుకున్నాం. అలాంటి గ్రంథం మాయమయింది. అంటే మనం పడిన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. మరిదాన్ని వదిలేసి చేతులు దులుపుకుని వెళ్ళగలమా?" అనునయంగా అన్నాడు అరవింద్.

"నిజమే .... కానీ.... ఇప్పుడు తిరిగి వెళ్ళాలన్నా సాధ్యపడేలా లేదు" అన్నాడు భట్టు.

"చూద్దాం ఏం జరుగుతుందో!" భారంగా అంది కాంతి.

కొన్ని క్షణాలు భయంకర నిశ్శబ్దం ఆవరించింది.

ఆ నిశ్శబ్దాన్ని భరించలేక ఏవో సంబంధం లేని మాటలు మాట్లాడుకున్నారు ముగ్గురూ.

అందరి గొంతుల్లోనూ చిత్రమైన కంపన వుంది.

అందరి మొహాల్లోనూ ఆవేదన తొంగి చూస్తోంది.

అలా చాలా సేపు ఏవేవో మాట్లాడుకున్నారు.

క్షణాలు, నిమిషాలు గంటలూ భారంగా దొర్లి పోతున్నాయి.

అసందర్భపు వాగుడు వాగి వాగి విసుగుతో మౌనాన్ని ఆశ్రయించారు ముగ్గురూ.

ఎక్కడో ఓ పక్షి వికృతంగా అరిచింది.

వెన్నెల పుచ్చపువ్వులా వుంది.

వెన్నెలలో అడవి, అడివిలోని చెట్టు చేమలు అందంగా ఆకర్షణీయంగా వున్నాయి.

అయితే ఆ ముగ్గురికీ ఆనందంగా లేవు. భయం నరనరాల్లోనూ నిండి ప్రకృతి కూడా మృత్యువులాగే కనిపిస్తోంది. వెన్నెల విరగకాస్తున్నా వారి మనస్సుల్లో మాత్రం అమావాస్య చీకట్లు ఆవరించాయి.

ఎప్పుడు తెల్లవారుతుందా అన్నట్టు క్షణాలు లెక్క బెట్టు కుంటూ కూర్చున్నారు.



# రచయిత్రి జవాబులు



ఎ. చిరంజీవి, గురజాడ

ప్ర: డబ్బుతో కొనలేనిదేమిటి?

జ : చాలా వున్నాయి. అందులో ముఖ్యమైంది జరామరణాల నించిరక్ష!

వై. చంద్రశేఖర రెడ్డి

ప్ర డబ్బే అతి ప్రధానమని భావించే నేటి సమాజంలో "తల్లీ బిడ్డల మధ్య ఆత్మీయతలు, అనుబంధాలు, ప్రేమానురాగాలు కమర్షియల్‌గా మారాయనడం, అప్సలాయెల్బీకి, హిపోక్రసికి బలయినాయి" అనడం నిజంకాదూ?

జ : కాదు.

కె ఎన్. ఎ. రవికుమార్, మైలవరం

ప్ర . రచయిత్రిగారూ! మీ ఫోటో ఒకటి పంపగలరా?

జ : సారీ! పంపలేను!

వై. నాగలక్ష్మి, రాజోలు

ప్ర : సువర్ణాకన్నన్ గారూ! అడవుల గురించి అంత విపులంగా రాయగలుగుతున్నారు?

జ · వూహించే!

జి. రాజ్యలక్ష్మి, మచిలీపట్నం

ప్ర : సూపర్ రైటర్‌గారూ! మీ మంజీరనాదం చదువుతుంటే మా గుండెలు సస్పెన్స్ నాదం పలుకుతోంది. ఇంత చక్కగా ఎలారాయ గలుగుతున్నారండీ!

జ : మీ అభిమానానికి కృతజ్ఞతలు. మీ అందరి ప్రోత్సాహంతో నే రాస్తున్నాను.

ఎస్. సుకన్య, విశాఖపట్నం

ప్ర · మీకు కోపం వస్తే ఎవర్నీ లెక్క చెయ్యరనీ, మీతో మాట్లాడ్డానికి చాలా మంది భయపడతారనీ మా ఫ్రెండ్ అన్నారు ఇందులో నిజం.. ..

జ : అయ్య బాబోయ్! నా సంగతి విశాఖదాకా పాకిందా సుకన్యా? ... కానీ మీ ఫ్రెండ్ మరీ ఎక్కువగా వూహించారు!

పి శ్రీకాంత్, బళ్ళారి

ప్ర · సువర్ణాకన్నన్ గారూ! "మంజీరనాదం" చదువుతుంటే కన్నడ పత్రికలోని ఓ వ్యాసం గుర్తొచ్చింది. అది ఈజిప్ట్‌లోని 'మమ్మీ'లగురించిన వ్యాసం. మీకేమైనా పనికొస్తుందేమో అని తెలుగులోకి అనువదించి పంపుతున్నాను చదివి మీ అభిప్రాయం చెప్పండి... అది మీ నవలలో చివరికి జత చేస్తే ఎలా వుంటుంది!

జ : మీ అభిమానానికి కృతజ్ఞతలు. వ్యాసం బావుంది. అయితే ఆవ్యాసం రాసింది మీరా?కాకపోతే అనుమతి పత్రం అదీ కావాలేమో!

వి. నాగలక్ష్మి, తెనాలి.

ప్ర: మీ మంజీరనాదం 'పత్రికకే హైలైట్! 1. మీ హృదయ వీణను నాస్నేహ తీగతో మీటితే ఏ సర్వాలు పలుకుతాయక్కయ్యా?2. రచయి(త్రు)తలకి కావలసింది శైలా, భాషా? 3. ప్రజల ఆస్తుల్ని తమ ఆస్తులుగా భావించేవాళ్ళనేమనాలి? సమయానుకూలంగా రంగులు మారేదేమిటి?

జ. మీ అభిమానానికి థ్యాంక్స్ 1 మీకు నచ్చే రాగం, 2. శైలీ, భాషా రెండూ కావాలి. 3. భావించే వాళ్ళ ఉద్దేశాన్నిబట్టి వుంటుంది. 4 రాజకీయం.

ఎన్ సుబ్బలక్ష్మి, నర్సీపట్నం.

ప్ర: సాహసాలు చేసే పురుషులే అరుదు. ఇక స్త్రీలెంచేస్తారు? మీ నవలలన్నీ హీరోయిన్ డామినేషన్‌వే (ఉదా: యమున, సింధులు) యిలాంటి నవలలు రాసి, యువత తప్పుడు మార్గాల్ని అన్వేషించేలా ఎందుకు చేస్తున్నారు.

జ: మగాడు చెయ్యలేని సాహసాలు ఆడది చేసినట్టు రాస్తే మీ వుద్దేశంలో తప్పుడు మార్గాన్ని చూపించినట్టా మిస్. సుబ్బలక్ష్మీ? మన చరిత్రలో స్త్రీ 'సాహసా'లు చేసిన యదార్థగాథలు మీరు విన్లేదా? అంతెందుకు నిన్నటిదాకా మన దేశానికి నాయకత్వం వహించిన శ్రీమతి ఇందిరాగాంధి ఏ

## మంజీరనాదం

అందరికీ.... కళ్ళు మండిపోతున్నాయి. రాత్రి తిండేమీ లేక పోవడం వల్ల కడుపులోని పేగులు గొడవ చేస్తున్నాయి. అజాగ్రత్తగా వుంటే ఎక్కడ రెప్ప మూతపడుతుందో, ఎక్కడ పట్టు తప్పి కింద పడి పోతామో అన్నట్టు కొమ్మల నంటిపెట్టుకుని మరీ కూర్చున్నారు.

హఠాత్తుగా దగ్గరలో సింహగర్జన వినిపించింది.




తృప్తిపడి చూశారు ముగ్గురూ

అంతే! వారి పైప్రాణాలు పైనే పోయినట్టయ్యాయి.

మునుపటి లాగే ఓ సింహపు కుటుంబం చెట్టు కేసే వస్తోంది. ముచ్చెమటలు పోశాయి వాళ్ళకి.

సింహాలు వాళున్న చెట్టు కింది కొచ్చి ఓసారి పైకి చూసి, గుర్రు మన్నాయి పిల్లలు కూడా అదోలా అరిచాయి

ఒణికి పోయింది కాంతి. కొమ్మని మరింత గట్టిగా పట్టుకుంది

సింహాలు తీరుబడిగా పడుకున్నాయక్కడే

కాస్త తేరుకున్న కాంతి చిన్న చిన్న కొమ్మలు విరిచి దాని మీద పడెయ్య సాగింది. ష్! ష్! అంటూ. అయినా అవేమీ పట్టించుకోలేదు.

పైగా మరింత కోపంతో గుర్రు మన్నాయి.

అప్పుడే పక్కగావున్న ఓ పొద కదిలింది సన్నగా.

చివ్వున తలలు అటుకేసి తిప్పాయి సింహాలు.

మరోసారి పొద కదిలింది.

అంతే! మగసింహం గభాల్న లేచి ఆ పొదమీద పడింది. మరుక్షణం దాని నోటికో కుందేలు చిక్కింది. ఆనందంగా చూశాయి మిగతా సింహాలు.

ఆకుందేలును తెచ్చి పిల్లల ముందు పడేసి మళ్ళీ కాస్త దూరంగా పడుకుంది.

పూర్తిగా చావని ఆకుందేలు పారి పోవడానికి ప్రయత్నించింది. అయితే

మగాళ్ళకన్నా తీసిపోయారు? ఒక స్త్రీ అయుండి స్త్రీ సాహసాన్ని గురించి రాస్తే. దాన్ని 'తప్పుడు దారిన నడపడం' అంటున్న మీ మనస్తత్వానికి నిజంగా బాధగావుంది.

సి. హెచ్. మురళీధరరావు, పాములవలస.

ప్ర: రచయిత్రిగా మీ ఆశయం ఏమిటి?

జ: మీరు చదివినన్నాళ్ళూ రాయడమే.

డి. రమణారావు, ఖరగపూర్.

ప్ర: సువర్ణాకన్నన్‌గారూ! ఏ తరగతి ప్రజలమీద కథా భావాన్ని తీసుకుని రచనలుచేస్తే అద్భుతంగానూ, ప్రజాదరణపొందేలానూ వుంటాయి?

జ: ఏ తరగతి ప్రజలమీద రచనలు చేసినా చెప్పే తీరూ, కథాగమనం కొంతవరకు పాఠకుల మనస్తత్వం మీద ఆధారపడివుంటుంది దాని భవిష్యత్తు. మొదటి రెండూ వుంటే చాలామంది చదవచ్చు. కానీ అందరికీ అన్నీ నచ్చుతాయని అనుకోలేం. లోకోభిన్నరుచి అన్నారు.

పర్వతనేని వరలక్ష్మి, నూజెళ్ళ.

ప్ర: మంజీరనాదం లాంటి మంచినవల మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. రాజావారి తోటలో వుండే తేనె ఫలాలు ఏ జాతికి చెందినవో కాస్త వివరణ యిస్తారా?

జ: మంజీరనాదం మీ కంతగా నచ్చినందుకు కృతజ్ఞతలు. ఇంక తేనె ఫలాలంటారా? అవో ప్రత్యేకమైన జాతి. ఒక్క రాజావారి తోటలో మాత్రమే వుంటాయి. ఒకవేళ ఆ అడవిలో కాంతీ వాళ్ళకేమైనా కనిపిస్తాయేమో చూద్దాం.

## ఉత్తమ ప్రశ్న

పి. విజయలక్ష్మి, రామేశ్వరం.

ప్ర: "తప్పు చేయడం మానవ సహజం. కానీ ఆ తప్పు తెలుసుకుని, తిరిగి చెయ్యకపోవడమే నిజమైన మనిషి లక్షణం" అన్నారుకదా. ప్రస్తుత సమాజంలో "చేసిన తప్పునే మళ్ళీమళ్ళీ చెయ్యడం మనిషి లక్షణం" అనేట్టు ప్రవర్తిస్తున్నారేం అక్కయ్యా?

**జ: మనం తిరోగమించి, మళ్ళీ ఆదిమానవ కాలానికి పయనిస్తున్నామని మొన్నటి "సతీ సహగమనం" వృదంతం చాటిచెప్పడం లేదూ?**

వై. వి. టి. ఎస్. సూర్యనారాయణ, అత్తిలి.

ప్ర: పద్దెనిమిదేళ్ళ బాలుడికి ప్రేమని గురించి, విరహంగురించి ఏం తెలుస్తుంది?

జ: ఆ టీనేజ్‌లోనే యిలాంటివి గజిబిజిగా ఆలోచించేది (సాధారణంగా).

పోలాని రమేష్‌బాబు, గురజాడ.

ప్ర: 1. ఇంతవరకు మీ రచనల ద్వారా సంతృప్తి చెందారా? 2. మీ ఆశయం ఏమిటి?

జ: 1. చెందాను 2. ఇంకా ఇంకా మంచి రచనలు చెయ్యాలని.

కె. జనార్ధన్, రామవరం.

ప్ర: 1. నేటి యువతీ యువకులు సభ్యత, సంస్కారం మర్చిపోయి. అనాగరికంగా ప్రవర్తిస్తున్నారు. ఇందుకు బూతు సాహిత్యం, సెక్స్ సినిమాలు ఎంతవరకు ప్రోత్సహిస్తున్నాయి? 2. వీటిని అరికట్టడంలో ప్రజలు, ప్రభుత్వం ఎలాంటి బాధ్యతల్ని స్వీకరించాలి?

జ: 1. కొంతవరకు యువత అంతా అనాగరికతగా ప్రవర్తించడంలేదు. 2. ప్రభుత్వంకాదు. ప్రజలే అలాంటి రచనల్ని, సినిమాల్ని నిషేధించాలి. పరకట్నం తీసుకోరాదని ప్రభుత్వం బిల్లుపెట్టింది. ఎంతమంది మానారు? అలాగే ముందు ప్రజల్లోనే మార్పురావాలి.

ఇంద్రాణి, కుంచనపల్లి.

ప్ర: అక్కయ్యా! ప్రశ్న అన్నతర్వాత జవాబు లేకపోదు. అలాగే సమస్య అన్నతర్వాత పరిష్కారమూ వుండకపోదు. కానీ యిప్పుడు సమస్యతో మిగులుతున్నాయి. కారణం ఏమిటి?

జ: చిన్న సమస్యని పెద్ద సమస్యగా చేసుకుని, చిక్కుముడివేసి తియ్యలేనట్టు బాధపడుతున్నారు చాలామంది. చక్కగా ఆలోచించి చేస్తే, సాధారణంగా ఏ సమస్యకైనా పరిష్కార మార్గం వుంటుంది.

భాను (మున్నీ).

ప్ర: సువర్ణాకన్నన్‌గారూ! మీరంటే నాకు చాలాచాలా యిష్టం. కాబట్టి మీ ఫొటో కావాలి. పంపకపోతే నాకు మనశ్శాంతి వుండదు. ఆ పాపం అంతా మీదే.

జ: డియర్ మున్నీ! మా బంగారుతల్లి కదూ! నా ఫొటో అడగద్దమ్మా!

బి. వెంకట్రావ్, దాచేపల్లి.

ప్ర: 1. ఉత్తమ నవల ఎలావుండాలి? 2: మీకు నచ్చిన మీ నవలేమిటి?

జ: 1. చదివిన మరుక్షణం మర్చిపోయేదిలాకాక, చదివేశాక కూడా మరోసారి మంచిగా ఆలోచింప చేసేది. 2. "పరాధీన". □

---

తల్లి సింహం పిల్లలకేదో చెప్తున్నట్టు అరిచింది. వెంటనే సింహం పిల్లలు వుత్సాహంగా ఆకుందేలు మీద పడ్డాయి. ఆపై తల్లి సింహం లేచి కుందేటిని వాటి నించి తప్పించి వదిలింది.

మళ్ళీ ప్రాణాల మీది తీపితో పరిగెత్తింది కుందేలు. వెంటనే రెట్టించిన ఉత్సాహంతో దాన్ని పట్టుకున్నాయి పిల్లలు.

అలా నాలుగైదు సార్లు చేశాక ఆ కుందేలు ప్రాణాలు విడిచి కూలిపోయింది.

"ఇంక తినండి!" అన్నట్టు చూసింది తల్లి సింహం. పిల్లలు గభాల్న ఆ కుందేలు మీద పడిపోయాయి.

జరిగేదంతా ఆశ్చర్యంగా, భయంగా చూస్తూ కూర్చున్నారు ముగ్గురూ.

"పిల్లలకి... వేట నేర్పుతున్నాయి!" అన్నాడు అరవింద్.

"అవును... చిత్రంగా ఉంది కదూ?" అంది కాంతి. "అవును... సగం చంపిన జంతువుల్ని తెచ్చి పడేసి పిల్లలకి నేర్పుతాయి క్రూర జంతువులు.... కానీ.... పాపం!... వీటికి ఉత్సాహంగా ఉన్నా... ఆ సాధు జంతువులు మాత్రం చిత్రహింస అనుభవిస్తూ మరీ చావాలి!" అన్నాడు భట్టు.

కుందేటిని స్వాహా చేసేసి... మూతి నాక్కుంటూ మళ్ళీ పైకి చూశాయి సింహాలు.

మళ్ళీ ఒణుకు ప్రారంభమయింది కాంతిలో.

"అరవింద్! రివాల్వర్‌తో కాల్చేదాం!..." అంది భయంగా వాటికేసి చూస్తూ.

"మనకున్న ఆధారం ఈ రివాల్వర్సే!... ఇందులోని బుల్లెట్స్ అన్నీ అయిపోతే... మన పని మరీ దారుణం అయిపోతుంది. అందుకే... రివాల్వర్‌ని మరీ అవసరం అయితే తప్ప వాడద్దు!" అన్నాడు అరవింద్.

ఇంతలో ఎవరో గొల్లున ఏడుస్తున్నట్టు ఏడ్పులు వినిపించాయి. అన్నీ స్త్రీల గొంతులే!

మొహాలు చూసుకున్నారు ముగ్గురూ.



## మంజీరనాదం

దూరాన్నుంచి పది మంది కలిసి భోరున ఏడుస్తున్నట్టు వినిపిస్తుంటే చెట్టు మీద కూర్చున్న కాంతి క్కూడా అంత ఏడుపూ వచ్చేస్తోంది.

అరవింద్ భట్టు కూడా భయంగా చూశారటు కేసి – ఏడుపుల సందడికో ఏమో సింహాలు తోకాడించుకుంటూ ... గుర్రుగా వెనుతిరిగి చూస్తూ వెళ్ళిపోయాయి.

పది నిమిషాల తర్వాత ఏడుపులు హటాత్తుగా ఆగిపోయాయి

ఏడుపులు ఆగినా పక్షులు చెల్లాచెదురుగా ఎగరడం ఆపలేదు. తీతువులు భయంకరంగా అరుస్తూ వాళ్ళ తలల మీదుగా ఎగరడమూ మానలేదు

"అరవింద్!" అప్పటికి నోరు విప్పింది కాంతి.

"ఊఁ!...."

"ఎవరా ఏడ్చింది?" తడారిపోతున్న గొంతుతో అంది. అతను మాట్లాడలేదు.

"భట్టూ!...." ఒణుకుతున్న స్వరాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ అంది కాంతి.

"బహుశా అవి భానూర్ భార్యల ఏడుపులు కావచ్చు!" మెల్లగా అన్నాడు భట్టు.

బిగుసుకు పోయింది కాంతి.

"ఛ! ఛ! .. ఇక్కడికి రాకుండా వుంటేనే బావుండేది!" మరోసారి అనుకుంది

"భలేవాడివే! .. నీకేమైనా మతి పోయిందా? అవి... భానూర్ భార్యల ఏడుపులూ కాదు. ఏం కాదు!" చిరాగ్గా అన్నాడు అరవింద్.

అసలే హడిలిపోతున్న కాంతిని ఇలాంటి దెయ్యాల కబుర్లు చెప్పి మరీ హడలగొట్టడం అతని కెంత మాత్రం నచ్చలేదు

"మరి? ... మరా ఏడుపులు ఏమిటి?" పదునుగా అంది కాంతి. అయితే దానికి అరవింద్ మాత్రం ఎలాంటి సమాధానం చెప్పలేదు. అయినా ఏం చెప్తాడు.. అతనికి తెలిస్తే కదూ?...

"అరవింద్! ప్లీజ్! నా మాట విను..." అంటూ బ్రతిమాలుతున్న ధోరణిలో ఏదో అనపోయింది కాంతి

"ఇంతలో మళ్ళీ గొల్లున ఏడుపులు వినిపించాయి.

ఓ సారి తల విదిలించి... రివాల్వర్‌ని సరిచేసుకుంటూ టార్చ్ ఫోకస్ ఏడుపు వచ్చిన వైపుకి వేశాడు అరవింద్.

అక్కడేం లేదు.... పచ్చని పొదలు తప్ప. ఏడుపులు ఆగనూ లేదు.

గభాల్ని చెట్టు దిగిబోయాడతను

ఇంత కష్టపడి ఇల్లు కట్టించానా
ఒక్కడూ అద్దెకు రావటం లేదు
ఎందుకనో...?!!

"అగు! ఎక్కడికి?" అతని ప్రయత్నాన్ని గ్రహించిన కాంతి గభాల్న అతని చెయ్యి పట్టుకుని కంగారుగా అంది

"అదేమిటో చూసొస్తాను!" అన్నాడు అరవింద్ అటు కేసే పరీక్షగా చూస్తూ

నీకేమైనా మతి పోయిందా! .చేసిన నిర్వాకం చాలు గానీ.. మాట్లాడకుండా కూర్చో!" ఎప్పుడూ లేనంత కఠినంగా అంది కాంతి

"అది కాదు కాంతీ ."

"నో! .. నువ్వెళ్ళడానికి వీల్లేదు! " కచ్చితంగా అంది కాంతి.

"అయ్యో! కాంతీ!. అంత భయమైతే ఎలా? నా దగ్గర రివాల్వరుంది! అందుకే ఒక్కసారి వెళ్ళి చూసొస్తాను దగ్గరగా వెళ్తేనే గానీ విషయం సరిగా తెలియదు!" నచ్చజెప్తున్నట్టు అన్నాడు అరవింద్.

"నో! నా కంఠంలో ప్రాణం వుండగా నిన్ను ఇప్పుడు చెట్టు దిగనివ్వను...

నిస్సహాయంగా చూశాడరవింద్

"అవును సర్!.. అమ్మాయిగారన్నట్టు మీరు ఇప్పుడు వెళ్ళడం ఏమాత్రం క్షేమం కాదు మన చుట్టూ క్రూరమృగాలు కూడా తిరుగుతున్నాయి. దెయ్యాల మాటిలా వున్నా!" అన్నాడు భట్టు కూడా

క్షణం ఆలోచించిన అరవింద్ తన ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

"అసలు ఇంతవరకు లేని ఈ ఏడుపులు హటాత్తుగా ఇప్పుడు ఎందుకు మొదలయ్యాయి?" తనలో తానే అనుకుంటున్నట్టు అన్నాడు.

'ఏముందీ.. మనం ఇక్కడుండడం . వాళ్ళు దాచిన నిధుల కోసం వెదకడం ఆ దెయ్యాలకి ఇష్టం లేదు అందుకే ."

కాంతి మాటలకి అలాంటి సమయంలోనూ నవ్వొచ్చింది అరవింద్‌కి పకపక నవ్వేసాడు

"ఎందుకా నవ్వు?" చిరుకోపంతో అంది కాంతి

"నవ్వకేం చెయ్యను కాంతీ! . అసలు నువ్వు రావద్దు తల్లీ భయపడతావ్" అంటే–

"టట్! నేను చదువుకున్నదాన్ని. కరాటీ విద్య నేర్చుకున్నదాన్ని ... ధైర్యసాహసాలున్న దాన్ని!. .. మీరు భయపడితే నేను ధైర్యం చెప్తాను!" అని సవాల్ చేసి మరీ వచ్చావ్... తీరా వచ్చాక.... నాలుగు జంతువుల అరుపులకే... రెండు క్రూరజంతుల్ని చూసీ, ఇంకా ఏవో అరుపులు వినీ. ఒణికిపోతూ నువ్వు కంగారు పడ్డమే గాక. మమ్మల్నీ కంగారు పెట్టేస్తున్నావ్!

"అయినా కాంతీ!... ఈ రోజుల్లో కూడా దెయ్యాలున్నాయంటే నువ్వు నమ్ముతావా?" తమాషాగా అన్నాడు అరవింద్.

"కళ్ళారా చూసిందాన్ని నమ్మకుండా ఎలా వుంటాం?"

"ఏం చూశావ్ కళ్ళారా?..."

"పోనీ విన్నాను . సరా?"

"చూసేవే ఒకోసారి నిజం కానప్పుడు విన్నవి నిజం ఎలా అవుతాయి?"

ఆ వాదనకి కాంతి మొహం కోపంతో ఎర్రబడింది.

"ఇదిగో అరవింద్... దెయ్యాలో భూతాలో నాకు తెలియదు! నిజాలో అబద్ధాలో అంత కన్నా తెలియదు. నాకు తెలిసిందల్లా మనం ఆపదలో ఉన్నామని! – తొందరగా మేలుకుంటే ప్రాణాలు నిలవడానికవకాశం వుందని! ఎంత ధైర్య సాహసాలున్నా... కొండతో ఢీకొనడం ఎవరికీ శ్రేయస్కరం కాదు!..." తీక్షణంగా అంది

"అంటే? ."

"ఏముందీ . తెల్లవారగానే మనం వెళ్ళిపోదాం!"

క్షణం ఆమె మొహంలోకి పరిశీలనగా చూశాడు అరవింద్. అయితే అతని కళ్ళలో తన కళ్ళు కలవకుండా జాగ్రత్త పడింది కాంతి.

"సరే! అయితే రేపే ప్రయాణం!" అన్నాడు అరవింద్ ఏదో ఆలోచిస్తూ.

కాంతి మొహం కాంతివంతమైంది.

## గడుసులోకం —బాపు







"నిజమేనా?" అంది చివ్వున తల ఎత్తి.

"అవును!" ముభావంగా అన్నాడతను.

"కోపం వచ్చిందా?" అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అంది కాంతి.

"కోపమా?... ఎందుకు?"

"అదిగో! నిజంగానే కోపం వచ్చింది!"

"అదేం లేదు!..."

ఆహా! నాకు తెలియదేమిటి? అయినా నీ కోపం ఎలా పోతుందో కూడా నాకు బాగా తెలుసు!" అంత భయానక పరిస్థితిలో నూ తియ్యగా నవ్వింది కాంతి.

అయితే అరవింద్ నవ్వలేదు.

"భట్టూ!" అన్నాడు మెల్లగా.

"ఏమిటి సర్?"

"నీకు మనం వచ్చిన దారి బాగా గుర్తుందా?...

"ఆ! గుర్తుంది సర్! ఎందుకు?"

"అయితే రేపు ఉదయం పరిస్థితులు అనుకూలంగా వుంటే నువ్వూ కాంతీ మన వూరు వెళ్ళి పోండి!.." గంభీరంగా అన్నాడు అరవింద్.

తృళ్ళి పడింది కాంతి.

"అంటే నువ్వు మాతో రావా?" తీక్షణంగా అంది.

"ఊఁహూఁ."

"ఏం?..."

"నేనొస్తే ఆ గ్రంథంతో నే!"

"అయితే.. అది దొరక్కపోతే శాశ్వతంగా ఇక్కడే వుండి పోతావా" ఉడుకుమోత్తనంగా అంది కాంతి.

"ఎందుకుండి పోతాను... నా శాయశక్తులా ప్రయత్నించి చూస్తాను!... అయినా అది దొరకుతుందన్న నమ్మకం నాకు నూటికి నూరు పాళ్ళూ ఉంది!"

"కానీ... నాకు లేదు!"

"అందుకే నువ్వు వెళ్ళిపో".

"అది దొరక్కపోతే నీ జీవితం నాశనం అయిపోతుందా?" చిరాగ్గా అంది కాంతి.

"అలా అని కాదు...."

"మరి?...."

"ఒకటనుకున్న తరవాత అది సాధించే దాకా నాకు నిద్ర పట్టదని నీకు తెలుసు కాంతీ!.... అందులో చేజిక్కి జారిపోయిన దాన్ని అంత తేలిగ్గా వదిలేస్తానని ఎలా అనుకున్నావ్?..."

"అంటే?"

"ఎలాగైనా ఆ గ్రంథం దొరకందే నేను రాలేను. అదే నాకున్న వీక్నెస్!" బలవంతంగా నవ్వాడు అరవింద్.

"రేపట్నించి తిండి కూడా లేదు... గుర్తుందా? తిండి లేకుండానే బ్రతికే శక్తైనా నీలో వుందా?" తీక్షణంగా అంది కాంతి.

"అందుకే మీరిద్దరూ ఇప్పుడు వెళ్ళిపోండి. నిన్ను దించి భట్టు మళ్ళీ ఇక్కడి కొస్తాడు. వచ్చేటప్పుడు కావల్సినవన్నీ తెస్తాడు!" అన్నాడు అరవింద్.

భారంగా నిట్టూర్చింది కాంతి.

"అయితే నేనూ వెళ్ళను!" అంది.

"మళ్ళీ అదేమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు అరవింద్.

"అదంతే!... అయినా అరవింద్! నా ప్రాణం మీద మాత్రమే నాకు ప్రేమనుకుంటున్నావా?"

"అలా అని కాదు... ఎలాగో ఆహార పదార్థాలూ అవీ కావాలిగా.... అందుకే....

"అయితే నువ్వే వెళ్ళి తెచ్చుకో!"

"ఈ అలకలకేం గానీ కాంతీ, నేను నిజంగానే చెప్తున్నాను. నువ్వెళ్ళి పో!...."

"నేనూ నిజంగానే చెప్తున్నాను మిస్టర్ అరవింద్! నేను వెళ్ళను!" మొండిగా అంది కాంతి.

"అది కాదు కాంతీ!..."

"షటప్!" అరిచింది కాంతీ.

"అమ్మ బాబోయ్! అదంతా కోపమే?" భయం నటించాడు అరవింద్.

"కోపం కాదు అరవింద్!... బాధ!... ఇలాంటి మొండి మనిషిని కట్టుకుని... ఏం సుఖపడతానా అని ఏడుపు!" విసురుగా అంది కాంతి. ఆమె మాటలకి అరవింద్, భట్టు కూడా నవ్వారు.

ఎప్పుడాగిపోయాయో ఏడుపులు ఆగిపోయాయి. దూరాన మళ్ళీ డెక్కల చప్పుళ్ళయ్యాయి. ఆ వెనకే భయంకరమైన ఆర్తనాదం.

మళ్ళీ భయం వాళ్ళ నావరించి ఒణికించేసింది అరచేతుల్లో చిరు చెమటలు పడుతున్నాయి.

రెండు నిమిషాల తర్వాత మళ్ళీ భయంకరమైన కేక!.. దూరాన్నించి కాదు. వాళ్ళకి అతిచేరువలో నే!

(ఇంకా ఉంది)

## చిలుక ఆయుర్దాయం

చిలుకలు చిరంజీవులట. ఐర్లండ్‌కు చెందిన 'చిలుకలు సుమారు 140 సంవత్సరాలు బ్రతుకుతాయట. చిలుకలు సామాన్యంగా నూరేళ్ళు సునాయాసంగా బతుకుతాయట. తల మీద పింఛం వంటిది వున్న జాతి చిలుకలు తొంభై య్యేళ్ళు బ్రతుకుతాయట.

## మూడు కోట్లకి పైగా అతిమూత్ర వ్యాధిగ్రస్థులు!

భారత దేశంలో అతిమూత్ర వ్యాధితో బాధపడేవారు మూడు కోట్లకి పైగా వున్నారట. ఈ అతిమూత్ర వ్యాధి ముదిరి చాలా మందిని గుడ్డివారిగా కూడా చేస్తోందట. అతిమూత్ర వ్యాధి వల్ల కిడ్నీ సంపూర్ణంగా పాడై పోయే ప్రమాదం కూడా వుందట. గుండె జబ్బు కూడా వస్తుందట.

## మూడు నిమిషాలకో కార్మికుని మరణం!

ప్రపంచంలో ప్రతి మూడు నిముషాలకూ ఒక కార్మికుడు మరణిస్తున్నాడట. ప్రతి సెకనుకూ భూభాగంలో ఎక్కడో ఒకచోట వో కార్మికుడు గాయపడుతున్నాడట. ఈ చనిపోయే కార్మికులలో ఎక్కువ భాగం గనులలో పనిచేసే వారేనట. ఈ విషయం అంతర్జాతీయ పనివారి సమాఖ్య తెలియ జేసిందట.

## వెంట్రుకల పునర్జన్మ!

మనిషి తలమీద లక్షాయాభై వేల వెంట్రుకలుంటాయట సుమారుగా. నెలకు సుమారు మూడువేల వెంట్రుకలు రాలిపోతూంటాయట. వాటి స్థానే మళ్ళీ కొన్ని పుట్టూంటాయట. నాలుగు సంవత్సరాల కోసారి వెంట్రుక తిరిగి జన్మిస్తూంటుందట.

## దుబాయ్‌లో నీటి కరువు

ఆయిలు రిచ్ దేశం దూబాయ్‌లో నీటి కరువున్నదట. ఈ నీరు వీరు శిజూ అట్లాంటిక్ సముద్ర తీర ప్రాంతాలనుంచి తెచ్చుకుంటారట. నార్త్ సీ అట్లాంటిక్ కార్పొరేషన్ వారు ప్రతి రోజూ రెండు వేల టన్నుల మంచు గడ్డలను ప్రత్యేక విమానాల ద్వారా చేరవేస్తూంటార్రట.

## ఆర్థిక దుస్థితి - భార్యా బిడ్డల హత్య

హైదరాబాద్ ధూల్‌పేటకు చెందిన ఆటో డ్రయివరు రాజాసింగ్ ఆర్థిక దుస్థితిని తట్టుకో లేక తన భార్య గీతను, కూతుళ్ళు రేణు, రాధికలనూ కత్తితో పొడిచి చంపేసి, తానూ అదే కత్తితో పొడుచుకున్నాడట. భార్యా పిల్లలూ పోయి, అతనాసుపత్రిలో ప్రమాద స్థితిలో పడున్నాడట.




## తొమ్మిది వందల ఏళ్ల బాబా

యమునా తీరాన్న బృందావన్‌కు చెందిన పరమాపధూతరహ బాబా అనే వో బాబా తాను గత తొమ్మిది వందల ఏళ్ళుగా బ్రతికున్నట్టు ప్రకటించారు. ఆయనకు అన్నేళ్లో కాదో చెప్పటం కష్టమయినా ఆయన్ను చూస్తే బాగా వయస్సున్న వ్యక్తిలానే కనపిస్తారని. బహుశా ప్రపంచంలోని వృద్ధులందరిలో ఈయనే అతి వృద్ధుడై యుంటా- రనడానికి సందేహమే లేదని విమర్శకులంటు- న్నారట. ఈయన తన ఆశ్రమంలో వో ఆరడుగుల ఎత్తయిన మంచె వంటి దాని మీద కూర్చుని, తన భక్తులను చూసి, వారితో తానను గ్రహించ దల్చుకున్న వారిని పిలిచి, వారి శిరస్సున తన పాదం వుంచుతారట. అలా ఆయన పాదం తల మీద పెట్టుకోవడం తమ అదృష్టఫలంగా భక్తులు యోచిస్తారట.

## సర్టిఫికెట్‌తో గాని గుర్తింపబడని భర్త!

లాగోస్‌లో ఓ భవన ప్రమాదంలో మరణించిన వృద్ధులలో వో వ్యక్తిని పాల్ అకిన్ క్యూబ్‌గా ఆతని తమ్ముడు, భార్యా గుర్తించి ఆ శవానికి దహన




సంస్కారాలు అన్నీ పూర్తి చేసేశారట. అనక అసలు క్యూబ్ గారింటికి వస్తే నువ్వెవరు! మా ఆయన నిక్షేపంగా చనిపోయాడు పొమ్మందట ఆతని ధర్మపత్ని. దాంతో అతను కోర్టును శరణుజొచ్చి తానా పాల్ అకిన్ క్యూబే అని సర్టిఫికెట్ పొందాకాతని భార్య హా నాథా అన్నదట.

## గేదె వెలకు భార్యను జమ!

బీహారు అల్దాపూర్‌కు చెందిన బేగూరామ్ వో పాడి గేదె కొనుక్కోవాలన్న కోర్కెతో చాలాకాలం సతమతమై, అది తీరక, చివరికి అది కట్నంగా యిచ్చే షరతు మీద ఒహాయన కూతుర్ని పెళ్లాడ సమ్మతించాడట. తీరా తంతు పూర్తయ్యాక మామగారు గుటకలేసి, ఆ పాడి గేదెను కొన్నాళ్ళలో ఇవ్వగలనని వో హామి పత్రాన్ని రాసిస్తానని హామీ యిచ్చాడట. దాంతో పట్టరాని ఉక్రోష ఆవేశాలొచ్చిన ఆ బేగూరామ్ ఐతుకేశర్మ అనే వాని దగ్గర పాడి గేదెను కొని, దాని వెలకు తానప్పుడే పెళ్లాడిన తన భార్యను జమ చేశాడట.

## కన్నబిడ్డను చంపిన కసాయి తండ్రి!

పశ్చిమ నేపాల్‌కు చెందిన త్రౌ అనే వో కంసాధముడు చెవిలో రింగు బింగున్న తన ఏడాది చంటిపిల్ల రొదగా ఏడుస్తూంటే, అది భరించలేక, కోపంతో ఆ పసి పిల్లను తుపాకితో కాల్చి చంపేశాడట. ఈ ఘోరం చూసి, ఆతని భార్య గుండె ఆగి అక్కడే చనిపోయిందట.

## కంప్యూటర్ కనుక్కున్న బంగారం!

మద్రాసు త్యాగరాయ నగరులోని వో టీ షాపులో పని చేస్తున్న 32 ఏళ్ళ నూరుద్దీన్ అనే అతన్ని ఎవరో వో అపరకర్ముడు హాయిగా సింగపూరు వెళ్ళి ఆపూరు చూసి, ఎంచక్కా తిరిగివచ్చెయ్ అని సకల వసతులూ చేసి పంపాడట. నూరుద్దీన్ సింగపూరు తిరిగి, హాయిగా తిరిగొచ్చి మద్రాసు విమానాశ్రయంలో దిగి బయటకు రాబోతూండగా అతన్ని చూసిన కంప్యూటరు గోల పెట్టిందట. దాంతో అధికారులు అతన్ని వెతికితే వొంటి మీద లక్షన్నర ఖరీదు చేసే బంగారం కడ్డీలు గుడ్డలతో కట్టేసుకుని, పైన బట్ట ధరించాడటా నూరుద్దీన్ అకర్మ్ముడెచట!

## పట్టపగలు దోపిడీ!

మద్రాసుకు చెందిన చిట్లపాకం అనే వో గ్రామంలో మురళీధరన్ అనే వో ధనికుని యింట్లోకి పట్ట పగలు ఆరుగురు వ్యక్తులు ప్రవేశించి, పిస్టళ్ళు చూపి బెదిరించి, ఆ మురళీధరన్ భార్య నగా, నట్రా వో 25 వేలవి వసూలు చేసుకుని మోటారు సైకిళ్ళ మీద పారిపోయారట. □

# ప్రకాశదీపం

## కొచ్చెర్లకోట వెంకటసుబ్బారావు

నీలకంఠం గారు మరణించారన్న వార్త వినగానే వూరు వూరంతా అట్టుడుకి పోయింది. ఆ చుట్టు ప్రక్కల పల్లెలలో ఆయన పేరు ఎరుగని వారు ఉండరు. గ్రామంలో కల్లా మాంఛి మోతుబరి రైతు. సంపన్నుడు. అరవయ్యోపడిలో బడ్డా క్రమం తప్పకుండా పొలం వెళ్ళడం, నాట్లు దగ్గర్నుంచి కుప్ప నూర్చేవరకు దగ్గరుండి అన్ని పనులు సవ్యంగా చేయిస్తూండటం కాలకృత్యాల్లా ఆయన చేసుకుపోతూ వుండేవాడు. అంతటి ఉక్కుపిండం అకస్మాత్తుగా చావడమా, అదీ గుండెపోటుతోనా! అసలు ఆయనకు గుండెకాయ వుందన్న సంగతి ఆయన మరణించిన తర్వాతే అందరికీ తెలిసింది. ఆయన బ్రతికి వున్నంత కాలం గుండె వుందన్న దాఖలాలు ఇతరులకు కనబడనీయ లేదు శ్వాస పీలుస్తున్నాడు కాబట్టి ఏదో మిషను ఉండకుండా పోతుందా అని అందరూ అనుకునే వారు. కానీ ఇప్పుడు గుండెపోటుతో పోవడం వల్ల ఆయనకు గుండె వుందన్న మాట రూఢి అయిపోయింది. గుండె వుందని చెప్పటానికి మరో కారణం కూడా కనబడింది. అది తర్వాత చెబుతాను.

"సహాయం అన్న మాటకు అర్థం లేదురా! ఒకడు మరొకడికి సహాయం చేయడం ఏమిటి? ఎవడి పని వాడు చేయడం అందుకు తగ్గ ప్రతిఫలం పొందటం అంతే! ఇందులో సహాయం అనే ప్రమేయం ఎందుకు? ఒకడు మరొకణ్ణి సహాయం కోరుతున్నాడంటే వీడు వాణ్ణి దోచుకోవాలని ప్రయత్నిస్తున్నాడన్న మాట. అందుకే నేను ఈ దోపిడికి లొంగను. సహాయం చెయ్యను." అంటూ నీలకంఠం గారు సాయం అర్థించిన వాళ్ళ ముందు ఉపన్యాసం దంచుతూ వుండేవారు. అనుకున్న పని కాలేదే అనే దిగులు ఒక ప్రక్క ఆయన సొది వినలేక మరో ప్రక్క జనం బాధపడేవారు. ఇవేమి పట్టనట్టు ఆయన నిర్వికారంగా చెప్పుకు పోతూ వుండే వాడు.

కానీ అదేమి చిత్రమో ఆయన పట్టింది బంగారం అయ్యింది. ఆయన వరి నాటితే వరి ఆ సంవత్సరం బాగా పండేది. చెరకు నాటితే చెరకు పుష్కలంగా పండేది. ఎందరు ఎన్ని శాపనార్థాలు పెట్టినా ఆయన మీద పని చేసేవి కావు. ఒక రోగం రొష్టు లేకుండా దుక్కలా వుండేవాడు. అందరికి ఆశ్చర్యం కలిగేది. ఇంత గుండె లేని బండ వాడికి ఏ కష్టం రాదే అనుకునే వారు. కొంత మంది ఆశావాదులు "ఇప్పుడే కాదురా, చచ్చేప్పుడు చూడాలి. కుక్క చావు చస్తాడు" అనేవారు చాటుగా. మరణం కూడా సునాయాశంగా వుండటంతో "ఏ జన్మ సుకృతమో ఈ జన్మలో అనుభవించాడు. భోగిలా పుట్టాడు భోగిలా పోయాడు" అని ఇప్పుడు అనుకుంటున్నారు.

ఇలా అనుకోవడానికి కారణం లేకపోలేదు. ఆయన పోతూ పోతూ ఓ వీలునామా రాసి పోయాడు అది ఎప్పుడు రాసిందో తెలియదు గానీ ఆయన



లాయరు మాత్రం ఇప్పుడు బయట పెట్టాడు. అది విన్న జనం గుడ్లు వేళ్ల బెట్టారు ముక్కు మీద వేలు వేసుకున్నారు. "అయ్యో! ఎంత తప్పుగా అనుకున్నాం. ఆయన మారాజు. వెన్నలాంటి గుండెకాయ వున్నవాడు" అని జనం ఒకటే చెప్పుకోవడం.

"బాబయ్యా! నా కొడుకు బడికి ఎళ్తానని మారం చేస్తున్నాడు. మన అబ్బాయిగారు చదివిపారేసిన పుస్తకం ఇప్పించండి" అని ఇరవై సంవత్సరాల నాడు యింటి పాలేరు ప్రాధేయపడితే, "వాడికి చదువు ఎందుకురా? ఏం చదివినా నా కాడ పాలేరుగా వుండాల్సిందేగా" అని కసురు కున్నాడు. దాంతో భయపడి చదువు మాన్పించి చిన్నప్పుడే కొడుకుని పాలేరుగా చేర్పాడు వెంకటేశం. ఆ వెంకటేశం కొడుకు ఇప్పుడు ఈ వీలునామా ద్వారా నీలకంఠం గారి యావత్ భూమికి అజమాయిషీ పరుడుగా అయ్యాడు.

ఒకసారి గోదావరి ముంపు వచ్చింది. గ్రామం గ్రామం జలమయం అయింది. ప్రజలు ప్రాణాలు అరచేత్తో పట్టుకుని నీలకంఠం గారి రెండతస్తుల మేడ ముందు నిలబడి తల దాచుకునేందుకు కాస్త చోటు యివ్వమని అడిగారు. ససేమిరా వల్లకాదు. మీరంతా వస్తే మీ శని మాకు చుట్టుకుంటుంది. మిద్దె కూలి పోతుందని విదిలించి పారేశాడు. ముంపు తగ్గిన తర్వాత సర్కారు వారు నది ఒడ్డు ఎత్తు చేయాలి అని తలపెట్టి నీలకంఠం గారి సాయం కోరితే అసలికే మోసం వచ్చేట్టు ఆ పని నీరు కార్చాడు. అటువంటి వాడు ఇప్పుడు 5 లక్షల ఖర్చుతో గ్రామం చుట్టూరా నదీ జలం వరదల సమయంలో లోనుకు రాకుండా వుండేందుకు కట్ట వెయ్యాల్సిందంటూ విల్లులో రాసి పోయాడు. అందుకు తగిన ప్లైకం కూడా సిద్ధం చేసి పోయాడు.

ఇలా ఎన్నో విషయాలు పొంతన లేకుండా కనబడుతూంటే ప్రజల ఆనందానికి అవధులు లేకుండా పోతున్నాయి. నీలకంఠం గారు యావదాస్తిని గ్రామానికి అంకితం చేశారు. ఓ ట్రస్టును ఏర్పాటు చేసి ప్రజా శ్రేయస్సుకు సంబంధించిన పనులు ఆ ట్రస్టుకు అప్పగించారు. గ్రామంలో ఓ జూనియర్ కాలేజీ తెరవడం, పేదలకు ఉచిత భోజన వసతితో చదువు నేర్పటం, ఇలా చాలా విషయాలు రాసారు. అన్నిటికంటే విచిత్రం ఆయన శ్రాద్ధ కర్మలు గ్రామ ప్రజలు అందరూ కలిసి చేయాలని రాసి వుండటం.

ఇంతకీ నీలకంఠం గారు సంతానహీనుడా అంటే కాదు. కొడుకు లక్షణంగా ఎమ్. బి. ఎ. చదివి ఫారెన్‌లో వుంటున్నాడు కూతురు ఓ డాక్టరుని పెళ్లి చేసుకుని అమెరికాలో సెటిల్ అయింది. మరి వారికి ఆస్తి చెందకుండా ఎందుకిలా చేశాడు అనే మీమాంస వచ్చింది. దీని ఆంతర్యం వీలునామాలో ఎక్కడా రాసి లేదు లోతుగా ఆలోచిస్తే అందరికి బోధపడిన విషయం ఒక్కటే.

నీలకంఠం గారు జీవితాంతం గడ్డితిని గడించాడు. కొడుకుని ప్రయోజకుణ్ణి చేశాడు. కూతురుని మరో ప్రయోజకుడికి యిచ్చి విదేశాలకు సాగనంపాడు తను వంటరిగా బ్రతుకు ఈడుస్తూ ఆలోచించి వుంటాడు. ఏమిటి ఈ జీవిత ధ్యేయం? తన దంటూ ఓ చిన్న ప్రపంచం ఏర్పాటు చేసుకుని దాని అభివృద్ధికి కష్టపడటం, కొడుకూ, కూతుళ్లకు నిచ్చెనలా వుపయోగ పడుటమేనా? ఇంత మమకారంతో పెంచిన సంతానం నా అవసాన దశలో ఎదురుగా లేకుండా పోయారు. తోడుగా వుండాల్సిన భార్య ముందుగానే పోయింది. ఇహ మిగిలింది ఎవరు? నా చుట్టూ వున్న ఈ గ్రామ ప్రజలు. వీళ్లే నా నిజమైన సంతానం, నా వాళ్లు. నన్ను నమ్ముకున్న వాళ్లు. కాబట్టి నా ఆస్తి అంతా వీళ్లకు చెందాలి. అంతేగానీ అమెరికాలో వుంటున్న కూతురికీ, కొడుకుకి కాదు. వాళ్లు నేను చచ్చిన మర్నాడు ఆస్తి నంతటిని తెగ నమ్మి అమెరికాకు పట్టుకు బోతారు. అక్కడ నీలకంఠం అనే వ్యక్తి గురించి తలిచే నాధుడు వుండడు ఎక్కడో వుంటున్న కొడుకు కూతురు పేరా గ్రామంలో ఆస్తి రాయడ మంటే అది నిజంగా కుక్కచావు అలా చేయ్య కూడదు గ్రామానికి సంబంధించిన ఆస్తి గ్రామానికే దక్కాలి ఏ పట్టణానికో, మరో దేశానికో ధారాదత్తం కాకూడదు నీలకంఠం గారి ఔదార్యం, ముందు చూపు తలచుకుని గ్రామ ప్రజల కళ్లు చెమ్మగిల్లాయి. ఈ నాటికి ఆయన నిలువెత్తు విగ్రహం వూరి మధ్యలో దర్పవ మిస్తూ అకాశదీపంలా ఎందరికో దారి చూపుతూంటుంది ☐

# మహిళా పాఠకుల శీర్షిక

# ఈ కాలం పెళ్ళిళ్ళు

## పునర్వివాహం పన్నీటిజల్లు!

స్త్రీ పురుషుల జీవితాల్ని తీయని బంధంతో ముడివేసే వివాహం శుభకరం! వారిద్దరికీ అవసరం. తామిద్దరూ కల్సి, మెల్సి- చేదోడు వాదోడుగా వుంటామని ప్రతిన బూనే ఆ క్షణం ఎంతో మధురం. అయితే స్త్రీకి ఒక్కోసారి వివాహం శాపంగా పరిణమిస్తూంది.

నాటి మహిళకు వివాహాత్పూర్వమే కాదు. తదనంతరం కూడా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కడు తక్కువ. భర్త, మామలఎదుట మంచమెక్కి కూర్చోడానికి సాహసించేది గాదు. పడకింట భర్త మొహం మెరుగునేమో గాని- పగలంతా పరదా చాటు మాటలు గుమ్మం చాటు నిల్చోడాలు తప్పనిసరి. ఒక్క మాటలో చెప్పాలంటే- వంటింటి కుందేలు

కాలానుగుణంగా సమాజం మారుతోంది ఇప్పుడు స్త్రీకి తనకు నచ్చిన వరుణ్ని ఎంచుకొనే స్వేచ్ఛ వుంది వద్దనే హక్కు వుంది మరీ ధైర్యస్థులైతే, ఆర్థిక స్వాతంత్ర్యము కల్గివుంటే కులాంతర, మతాంతర వివాహానికి సైతం వెనుకాడ్డంలేదు. నేడు స్త్రీ ఆకాశంలో విహరిస్తూంది- దేశాన్ని శాసిస్తూంది. అన్ని రంగాల్లోనూ రాణిస్తూంది.

కుటుంబంలో మంది తక్కువై, ఆర్థిక వనరులు బాగా వున్న ఆ రోజుల్లో ఉమ్మడి కుటుంబాలు, సంతోషదాయకంగా వుండేవి. నేడు చిన్న కుటుంబమే చింతలు లేని కుటుంబమైంది. ఆదాయం సరిపోక భార్యలు ఉద్యోగం చెయ్యాల్సిన అగత్యం ఏర్పడింది స్వార్థం పెరిగి మనసులు కుంచించుకు పోయాయి. హృదయ ద్వారాలు మూతబడ్డాయి. ఉమ్మడి కుటుంబాల మధ్య అడ్డు గోడలు వెలిశాయి. తల్లిని, తండ్రిని విడదీసి పోషించేదారుణ పరిస్థితులు దాపురించాయి.

కన్యాశుల్కం మశూచిలా మాసి పోయింది. కాని వరకట్నం కాన్సర్‌లా విజృంభిస్తోంది అబల, సబలగా మారినా వరకట్న రాక్షసి కౌగిల్లో నలిగి పోక తప్పలేదు. తత్ఫలితమే మనం దినపత్రికల్లో రోజువారి వరకట్న చావులు చదువుతున్నాం పురుష డొక్కడే దీనికి కారణం కాదు. కూతురుకు కట్నం యివ్వడానికి బాధపడే తల్లి- కోడల్ని చేసుకోడానికి గట్టి ముడుపు చెల్లించమని పట్టు బట్టటం -అవివేకం., నేరం - మూర్ఖత్వం! ఎవరైనా సలక్షణమైన కుర్రాడు కట్నం వద్దంటే అతనికి సవాలక్ష వంకలు పెట్టేది స్త్రీయే! వరకట్నం రూపుమాసి పోవాలంటే మొదట మార్పు రావలసింది స్త్రీలలో పిదప పురుషులలో.

పునర్వివాహం సతీ వియోగం చెందిన పురుషునికే కాదు- పతిని కోల్పోయిన స్త్రీకి కూడా అవసరమే! విధి చేతుల్లో వ్యధ చెందిన బాధితులకు పునర్వివాహం పన్నీటిజల్లు-

ఇక కులాంతర, మతాంతర వివాహాల్లో మాత్రం గట్టి చిక్కులు ఉన్నాయి. కులం లేదంటూనే కులం పేరుతో తమ 'పబ్బం' గడుపుకొనే నాయకులున్నంత వరకు- అన్ని మతాలు ఒకటేనని సామాన్యుడు భావించినా, మా మతమే గొప్పదని, మా వివాహ వ్యవస్థే మంచిదని వాదించే చాందసులున్నంత వరకు- ఈ వివాహాలు సఫలీకృతం కాలేవు పుట్టిన బిడ్డ కులహీనుడుగాను- మతం లేనివాడుగాను ముద్రింపబడుతూంటే ఆ చిన్నారి భవిష్యత్తు మాటేమిటి? కుల, మతాల మధ్య కాదు ... పురుషుల మధ్యనే వివాహం అని తెల్సుకోడానికి మరో నూరేళ్ళ పట్టు వచ్చునేమో!

బాల్య వివాహాలు పోయి- స్త్రీ పునర్వివాహం వరకు వచ్చింది. ఇంకా ఎన్నో ఆరోగ్యకరమైన మార్పులు రావాలి. నేటి వివాహ వ్యవస్థలో అంగడిలో బొమ్మను చేసే పెళ్ళిచూపుల తతంగం నేటి కాలానికి అనుగుణంగా మారాలి పెళ్ళిళ్ళలో అనవసర ఆడంబరాలకు స్వస్తి పలకాలి. పట్టు చీరలు- వెండిచెంబు, వెండి తట్ట- కాశీయాత్ర సామగ్రి లేకపోయినా పెళ్ళి అనిపించుకోదా! పెళ్ళి తర్వాత స్త్రీ తన అర్ధాంగి అవుతున్నప్పుడు కష్ట, సుఖాల్లో సగ భాగం పాలుపంచుకుంటున్నప్పుడు ఇక వరకట్నమెందుకు? ఆడపెళ్ళి వారు తాము పెంచి పోషించిన కూతురికి అభిమానంతో ఏదిచ్చినా తప్పులేదు గాని- కట్నం తెమ్మని వేధించి వరకట్న చావుకు దోహదం చేయడం మగాడి రాక్షసత్వాన్ని సూచిస్తుంది. మనుషులు 'అణుయుగం'లో వున్నా, మనసులు రాతియుగాన్ని' మర్చిపోలే దని దానర్థం. స్త్రీ- పురుషులు ఒకరొకరు అర్థం చేసుకుని జీవిస్తే వివాహం నూరేళ్ళ పవిత్ర బంధమవుతుంది- లేదంటే మూన్నాళ్ళ ముచ్చటగా మిగుల్తుంది.

-ఎం. పద్మజా సుబ్రహ్మణ్యం,
కలికిరి. □

కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
**ఈ కాలం పెళ్ళిళ్ళు**

పంపిన వారి పేరు..............................................

పూర్తి చిరునామా..............................................

..............................................

..............................................

పిన్‌కోడ్:..............................

# కొత్త రలక్

## మీ కుటుంబానికి ప్రత్యేక సబ్బు

తులసి సద్గుణాలు గలది.

FAMILY SOAP

Ralak

WITH THE GOODNESS OF TULSI

మీ కుటుంబాన్ని ఆనందారోగ్యాల కుటుంబంగా రూపొందించండి. వారికి తెచ్చివ్వండి, కొత్త రలక్—మీ కుటుంబానికి ప్రత్యేక సబ్బు. రలక్‌లో సుప్రసిద్ధమైన తులసి సద్గుణాలున్నాయి. ఇందుచేత చర్మం శుభ్రంగా-కళకళలాడుతూ రూపొందుతుంది. దీని తాజాతాజా సువాసనలతో వారికి సదా తాజాదనపు అనుభూతి కలుగుతుంది. హాయిగా ఆహ్లాదంగా ఉంటుంది.

## ఆనందారోగ్యాల కుటుంబం, రలక్ కుటుంబం.

everest/87/WIL/511-Ll.R

సీరియల్

# రేపటి మహిళ

## సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

వొంటి నిండా కట్లతో దయానంద చక్రవర్తి అపార్ట్‌మెంట్ ముందు నిలబడి కాలింగ్ బెల్ నొక్కాడు భాగవతార్ తలుపు సగం తెరిచి 'ఎవరు మీరు?' అన్నాడు చక్రవర్తి

అతని మాటకి సమాధానం ఇయ్యకుండా తలుపు తోసుకుని లోపలి కొచ్చేశాడు భాగవతార్ వొంటి నిండా కట్లతో ఎవరో గ్రహాంతర వాసిలా వున్నాడతను లోపల ఎవరో మరో నవనాగరిక యువతి కూర్చొని వుంది ఆమెని చూడగానే ఒళ్ళు మండిపోయింది

"ఈ రోగ్ తన మృదులని మోసంచేసి వల్లో వేసుకుని ఇప్పుడు మరో అమ్మాయితో కులుకుతున్నాడా?"

'మీరెవరు? ఎందుకొచ్చారు?" అడిగాడు చక్రవర్తి

"నేను మృదుల భర్తని"

"గ్లాడ్ టు మీట్ యూ" చెయ్యి జాపాడు చక్రవర్తి ఆ చెయ్యి అందుకోబోయి కట్టు కదిలి నొప్పి పుట్టగా 'అబ్బా" అన్నాడు భాగవతార్

"ఫరవాలేదులెండి ఇంతకీ నాతో ఏం పని?"

"మీరు నా మృదులని పెళ్లి చేసుకోవాలి".

'వాట్!"

"ఏయ్ మిస్టర్! చేసినదంతా చేసి తప్పించుకోవాలని చూడకు నా దగ్గర రుజువులు , సాక్ష్యాలు వున్నాయి. నిన్ను కోర్టు కీడ్చి, జైలు శిక్ష వేయించగలను మర్యాదగా మృదులని పెళ్లి చేసుకో ఎప్పుడు పెట్టించమంటావు ముహూర్తం?' ఆ గదిలో సోఫాలో కూర్చున్న నాగరిక యువతి కీచుమనేడ్చి ఏడుపందుకుంది చక్రవర్తి ఖంగారుపడిపోతూ–

"చకితా! వూరుకో ఊరుకో ఇతడేదో మెంటల్ హాస్పిటల్ నుండి వచ్చినట్లున్నాడు నేను మాట్లాడి సర్ది పంపిస్తాను ఊర్కో ప్లీజ్!" అని ఓదార్చబోయాడు ఆ అమ్మాయి ఏడుపు మరి కాస్త ఎక్కువయింది

"నేను హాస్పటల్ నుంచి వచ్చిన మాట నిజమే కాని అది మెంటల్ హాస్పిటల్ కాదు మృదులని నువ్వు పెళ్లి చేసుకుని తీరాలి నా భార్యని అవమానిస్తే నేనూర్కోను నానావతిలాగ నిన్ను హత్య చేస్తాను

'ఏమిటయ్యా వాగుతున్నావు నీ పెళ్ళాన్ని నే పెళ్ళి చేసుకోవడమేమిటి? వొంటి నిండా కట్లతో వొచ్చావు ఎక్కడ దెబ్బ కొట్టాలో నాకర్థం కావడంలేదు కాబట్టి బతికిపోయావు గాని లేకపోతే, చావ చితకబాదేసేవాడ్ని"

"ఈ దెబ్బలన్నీ మృదుల కోసమే తిన్నాను. ఇంకా ఎన్ని దెబ్బలైనా తింటాను గాని మృదులకి అన్యాయం జరగనీయను"

"ఏమిటయ్యా నీ గోల! ఎందుకు పెళ్ళి చేసుకోవాలి నీ మృదులని?"

"మృదులని ప్రేమించావు గనుక"

'నేనా!'

"నువ్వే ప్రేమించావు లేక ప్రేమించినట్లు నటించావు ఇప్పుడిహ మోసం చెయ్యడానికి వీల్లేదు "

"రామచంద్రా! మృదుల ఎవ్వరో నాకు తెలియదయ్యా. ఆవిడనెప్పుడూ నే చూడను కూడాలేదు'.

"నేను చూశాను వీడియోలో .

ఏం వీడియో ఏం గొడవ? ముందు మర్యాదగా అవతలికి నడు'

"ఎప్పుడు పెళ్ళి చేసుకుంటావో చెప్పు వెళ్తాను."

విసిగెత్తిపోయిన చక్రవర్తి, "యూ బ్రూట్" అంటూ లేచాడు ఆ సమయానికక్కడికొచ్చారు చూడామణి, కేశవనాథ్‌లు

"ఎవర్ని బ్రూట్ అంటున్నావు మా అల్లుడ్నేనా? వొళ్ళు దగ్గిర పెట్టుకుని మాట్లాడు " పోట్లాటకి దిగింది చూడామణి.

"చూడండత్తగారూ! ఇతడు మన మృదులని పెళ్ళిచేసుకోనంటున్నాడు" ఫిర్యాదు చేసాడు భాగవతార్.

"మృదులనితడు పెళ్ళిచేసుకోవడమేమిటి?" అడిగాడు కేశవనాథ్.

"మృదుల ఇతడ్ని ప్రేమించింది. అంచేత నా ప్రేమను త్యాగం చేసి మృదులనితనికిచ్చి పెళ్ళిచేయాలనుకుంటున్నాను".

కెవ్వున అరిచింది చూడామణి "మృదుల ఇతడ్ని ప్రేమించిదా? నువ్వే మృదులకు తగవు అనుకుంటూంటే నీకంటే దౌర్భాగ్యుణ్ణి ఇతడ్ని ప్రేమించిందా!"

"ఇతడు నాకంటే దౌర్భాగ్యుడన్న మాట నిజమే కాని ఏం చేస్తాం మృదుల ప్రేమించాక", సోఫాలో ఏడుస్తోన్నమ్మాయి టింపరరీగా ఏడుపు మర్చిపోయి నవ్వేసింది చక్రవర్తి మొహం కోపంతో ఎఱ్ఱబడింది.

"ఇతడినెలా ప్రేమించిందయ్యా మృదుల?"

"దేవకి నా గురించి చెప్పిందని నన్ను ప్రేమించింది. ఇతడి గురించి ఎవరు చెప్పారో మరి? అడగలేదు"

"ఖర్మ, ఖర్మ నా కూతుర్ని చచ్చినా ఇతడికిచ్చి పెళ్ళి చెయ్యను"

"మీరెవరు చెయ్యకపోవడానికి నే చేస్తాను మృదుల నా భార్య"

"నా కూతురు '

"నాతో పెళ్లైపోగానే మీ కూతురి మీద మీకు అధికారం పోతుంది"

"భార్యని మరొకరికిచ్చి పెళ్ళి చేయాలనుకోగానే నీకూ అధికారం పోయింది"

జరిగిన కథ –18 : రాజభూషణాన్ని బంధించి బైటికి వచ్చిన మృదుల తన కోసం దెబ్బలు తింటున్న భాగవతార్‌ను రక్షించి ఆస్పత్రిలో చేరుస్తుంది వీడియోలో ఉన్నది మృదుల కాదని చెప్పడానికి వచ్చిన సోమనాథ్ చేసిన పొరపాటు వల్ల భాగవతార్ ఉత్తరం పెట్టి వెళ్ళిపోతాడు యశోధరాదేవి హైదరాబాద్ వస్తుంది మృదులను సీక్రెట్ ఇంటలిజెన్స్ ఇన్‌స్పెక్టర్ వచ్చి అరెస్టు చేస్తాడు

అత్తా అల్లుళ్ళ వాదోపవాదాలు విని భరించలేక చిరాగ్గాలేచాడు కేశవనాథ్.

"అసలు విషయమేమిటో తెలుసుకోకుండా మీలో మీరు వాదించుకుంటారేమిటి? ఏమండీ చక్రవర్తిగారూ! మా మృదుల మిమ్మల్ని ప్రేమించిందా?" అడిగాడు.

"నాకేం తెలియదండి ఆ మాట ఎన్నిసార్లు చెప్పినా మీ అల్లుడుగారు వినిపించుకోవడంలేదు మీరైనా చెప్పండి." అన్నాడు చక్రవర్తి

"అబద్ధం వీడియోలో స్పష్టంగా చూసాను సొట్టకాలు స్పష్టంగా కనపడింది. ఆ సొట్ట కాలెవరిదో తెలుసుకోవడానికి నేనెంతో ప్రయాసపడ్డాను" చెప్పాడు భాగవతార్.

చక్రవర్తి మొహం రోషంతో రగుల్తోంది. అతడ్ని చూసి జాలేసింది చకితకి. లేచి కళ్ళు తుడుచుకొని భాగవతార్ దగ్గరకొచ్చింది.

"భాగవతార్‌గారూ! సరిగ్గా చెప్పండి. మా చక్రవర్తి మీ భార్యని ప్రేమించాడా!"

'అవును"

' ఎవరు చెప్పారు మీకు"

"వీడియోలో చూసాను".

"ఎవరు తీశారు వీడియో?"

"సోమనాథ్ ప్రైవేట్ డిటెక్టివ్ ఏజన్సీస్"

"ఆయనకి ఫోనుందా? వుంటే నంబరియ్యండి".

సోమనాథ్ నెంబర్ చెప్పాడు భాగవతార్ చకిత సోమనాథ్‌కి ఫోన్ చేసి "మీరు అర్జంటుగా ఒకసారి ఇక్కడికి రండి. భాగవతార్ మా యింటికొచ్చి చక్రవర్తిగారితో పోట్లాడుతున్నారు " అంది

ఆ మాటలతో విషయం అర్థమైపోయింది సోమనాథ్‌కి "ఇప్పుడే వస్తున్నాను" అని ఫోన్ పెట్టేసాడు పది నిముషాల్లోనే తన డొక్కు కార్లో అక్కడికొచ్చాడు. అందరూ నిశ్శబ్దంగా- కోపంగా- ఒకరినొకరు చూసుకుంటున్నారు.



JE & BLUE

It's rich: the blend of choice Virginia tobaccos.

It's true: the taste, the smoke, the satisfaction.

It's blue: unmistakably so.

It's Berkeley Filter: rich, true and blue.



BERKELEY
FILTER




Rich tobacco, true taste.

LINTAS (CAL)/BFT/2740/1

# రేపటి మహిళ

చకిత మాట్లాడింది మొదట. "సోమనాథ్‌గారూ! మీరు తీసిన వీడియోలో మృదులతో వున్నది చక్రవర్తిగారా?" అడిగింది.

భాగవతార్‌తో సమయానికి అసలు విషయం చెప్పలేదని ఖంగారు పడుతున్న సోమనాథ్-

"వీడియోలో వున్నది మృదుల కాదు, మీరు" అన్నాడు చకితతో. ఈసారి కీచుగా అరిచాడు చక్రవర్తి.

"ఎవరితో వుంది చకిత?" కోపంగా అడిగాడు.

"మీతో నే".

మతిపోయినట్టవుతోంది అందరికీ.

"వీడియో ఏమిటి? ఎవరు తీశారు? ఎందుకు తీశారు? వీడియోలో ఎవరెవరు వచ్చారు?" ఆజ్ఞాపిస్తున్నట్టు అడిగాడు కేశవనాథ్.

అతి రహస్యం బట్టబయలైంది జర్గిందంతా చెప్పక తప్పలేదు సోమనాథ్‌కి. చూడామణి చండికలా మండిపడుతూ-

"దుర్మార్గుడా! నా కూతుర్ని అవమానించడమే కాకుండా వీడియో కూడా తీయిస్తావా?" అంది.

"అదిసరే ఇంతకీ భాగవతార్ ఇంట్లో తీసిన వీడియోలో నువ్వెలా వచ్చావు??




చకితనడిగాడు చక్రవర్తి.

'అదే ప్రశ్న నిన్నడుగుతున్నాను నువ్వెలా వచ్చావు? నిలదీసి అడిగింది చకిత

"ఇంతకీ ఈ వీడియో రికార్డింగ్ ఎక్కడ జరిగింది?" అనుమానంగా అడిగాడు కేశవనాథ్ సోమనాథ్ ఫల్గుణ్‌కి ఫోన్ చేసి పిలిపించాడు

"ఎక్కడ తీసావు నువ్వు వీడియో?" డబాయిస్తూ అడిగాడు సోమనాథ్

"సరస్వతీ అపార్ట్‌మెంట్స్ బి 7 ఫ్లాట్‌లో అది మీరు నాకిచ్చిన నంబరే వెరిఫై చేసుకోండి కావాలంటే" అంతమందిని ఒక్కసారి చూసి ఖంగారుపడుతూ అన్నాడు ఫల్గుణ్

"అవును అదే మీరు నాకిచ్చిన నంబరు" చెప్పాడు భాగవతార్‌తో సోమనాథ్

'అది నా ఫ్లాట్ నంబర్ నా ఫ్లాట్‌లో వీడియో ఎందుకేర్పాటు చేయించారండీ భాగవతార్‌గారూ", ఖస్సుమంటూ లేచింది చకిత భాగవతార్ బిత్తరపోతూ "నే. నే నేను ఆ ఫ్లాటులో వీడియో రికార్డు చేయమనలేదు. నా అపార్ట్‌మెంట్‌లో రికార్డు చెయ్యమన్నాను"

'మరి ఈ నెంబరు ఎలా వచ్చింది?" ఆలోచనగా అన్నాడు కేశవనాథ్ భాగవతార్ బుఱ్ఱలో ఫ్లాష్ మెరిసింది వెలతెలబోతూ సిగ్గుపడుతూ, 'అది నా-ప్లాట్ సీట్ నెంబరు" అని తల దించుకున్నాడు.

* * * * * * * *

భాగవతార్, నక్షత్ర, సోమనాథ్ ముందు జయా నర్సింగ్‌హోమ్ కెళ్లారు. అక్కడ సిస్టర్ చెప్పిన విషయాలు విని వెంటనే లాయర్ వైజయంతి ఇంటికి చేరుకున్నారు. చూడామణి, కేశవనాథ్‌లు కూడా తమ కార్లో వచ్చారక్కడికి. లాయర్ యశోధరాదేవి మొహం బాగా వడిలిపోయి వుంది ఎన్నెన్నో సమస్యల నెదుర్కొని ఎంతో ధైర్యంగా పరిష్కరించగలిగినామె ఒక్కసారిగా డీలాపడి పోయినట్టు కనిపించింది వాళ్ళంతా ఎందుకొచ్చారో చెప్పకుండానే అర్థమై పోయింది ఆమెకి వాళ్ళేమీ అడక్కుండానే, 'సారీ! పరిస్థితి మనం ఊహించిన దానికంటే గంద్రగోళంగా తయారయిపోయింది. రాజభూషణం మృదులని రివల్యూషనరీగా ఆరోపించి అరెస్టు చేయించాడు కరీంనగర్ జిల్లా మహదేవ్‌పూర్ కనుకునూరు, వెంకలగట్ట, కాళేశ్వరం మొదలైన ట్రైబల్ విలేజస్ ప్రాంతాలలో ఉగ్రవాదుల కార్యకలాపాలు బాగా సాగుతున్నాయట వాళ్ళ జాడ తెలియపర్చమని పోలీసులు ట్రైబల్స్‌ని హెరెజ్ చేస్తున్నారట ఈ హెరెస్‌మెంట్‌కి వాళ్ళుపయోగించే కోడ్, "కోటింగ్" దురదృష్టంకొద్దీ మృదుల మేము కొనసాగిస్తోన్న మాస్ లిటరసీ ప్రోగ్రాంకి కనుకునూర్‌ని ఎంచుకుంది మాకు రాజకీయాలలో ఏ సంబంధం లేకపోయినా, రాజభూషణం ట్రైబల్ స్త్రీని ఉద్దేశించి అవమానకరంగా మాట్లాడ్డం- వాళ్ళంతా తిరగబడి అతడ్ని కొట్టడం- "మామూలుగా పై అధికార్లని చూస్తేనే భయపడి పారిపోయే గిరిజనులకి తిరగబడి కొట్టేంత ధైర్యం ఎలా వచ్చింది" అనే ప్రశ్న తలెత్తడం- రాజభూషణానికి పాలకవర్గాలలో మంచి పలుకుబడుండడం- గిరిజనులు రాజభూషణం మీద తిరగబడే సమయానికి మృదుల అక్కడే వుండడం- ఇన్ని కారణాల వల్ల మృదులని ఎక్స్‌ట్రీమిస్ట్‌గా ఆరోపించి అరెస్టు చేయించగలిగాడు రాజభూషణం ప్రభుత్వం ప్రస్తుతం ఎక్స్‌ట్రీమిస్ట్స్ విషయంలో చాలా కఠినంగా వుంటోంది మృదులని బెయిల్ మీద విడిపించడానికి ప్రయత్నించాను సాధ్యం కాలేదు అయినా ఫరవాలేదు నేను, మా వైజయంతి శాయశక్తులా ప్రయత్నించి తప్పకుండా మృదులని విడిపిస్తాము' అంది ఆవిడ తనకి, తనే ధైర్యం చెప్పుకుంటున్నట్లుగా వున్నాయా మాటలు చూడామణి రోషం- పౌరుషం- డాంబికం- ఎగిరిపోయాయి శోకదేవతలా తయారైంది

తనకి తెలుసున్న మంత్రుల్లో ఎవర్ని ఆశ్రయిస్తే పని జరుగుతుందా అని ఆలోచిస్తున్నాడు కేశవనాథ్ అతడికి శరీరంలో సత్తువ నశించినట్లు కాళ్ళూ, చేతులూ వొణుకుతున్నాయి

ఇంత ఘాతుకానికి పూనుకున్నాడా! రాజభూషణం" నమ్మలేనట్టు అన్నాడు భాగవతార్

'అధర్మ విష వృక్షస్య పచ్యతే స్వాదు కిం ఫలమ్?"- అంటే అధర్మమనే విషవృక్షానికి రుచిగల పండ్లు పండుతాయా? రాజభూషణంలాంటి వాళ్ళు ఇలాంటి ఘాతుకాలు కాక మంచి పనులు చేస్తారా?" అన్నాడు నక్షత్ర.

ఇప్పుడేం చెయ్యాలో ఆలోచించండి" ఏడుపు గొంతుకతో అంది చూడామణి

"భాగవతార్‌గారు మృదులగారి దినచర్య మీద రిపోర్టు తయారు చెయ్యమన్నారు. ఆ సందర్భంలో అనుకోకుండా మాకు మింగియార్‌గారి గురించి కూడా చాలా విషయాలు తెలిసాయి ఆయన మన ముఖ్యమంత్రి గారికి చాలా సన్నిహితులు మనకి ఆయనే ఏదైనా సాయం చెయ్యగలరు" అని చెప్పాడు సోమనాథ్

"మనకి మింగియార్ సాయం చేస్తాడా?" అనుమానంగా అడిగాడు భాగవతార్

"అగచ్ఛన్ వైనతెయోపి పదమేకం న గచ్ఛతి"- అంటే నడవకపోతే గరుత్మంతుడైనా ఒక అడుగు ముందుకు పోలేడు ప్రయత్నిద్దాం ప్రయత్నించకుండానే ఆలోచనలెందుకు?" అన్నాడు నక్షత్ర

'ముఖ్యమంత్రికి సన్నిహితుడైతే మనకి తప్పకుండా సాయం చెయ్యగలడు ప్రయత్నించండి" అంది లాయర్ యశోధరాదేవి

భాగవతార్ ప్రభృతులంతా మింగియార్ ఇంటికెళ్ళేసరికి ఎప్పటిలాగే హాల్లో ప్యూన్ మాత్రమే వున్నాడు ఆ రోజు కోడ్ వర్డ్ ఎవరికీ తెలియక పోవడం వల్ల అంచరూ హాల్లోనే కూర్చోవలసి వచ్చింది కొంతసేపటికి మింగియార్ వచ్చాడు బయటికి

"ఏం పనిమీద వచ్చారు?" మర్యాదగా అడిగాడు.

భాగవతార్ మాట్లాడే దశలో లేడు అంచేత జరిగిందంతా సోమనాథ్ వివరించాడు

భగవంతుడేం చేసినా మన మంచికే అంటారు నిన్ననే "బైలుకుప్పే"లో మా లామ్‌సరీకి వెళ్లాలనుకున్నాను కొన్ని కారణాల వల్ల ఆగిపోయాను. మృదులగారికి సాయం చెయ్యగలిగే అవకాశం వచ్చింది నాకు మీరంతా ఇంటికి వెళ్ళండి కింద నన్ను కన్సల్ట్ చేయడానికొచ్చిన వాళ్ళున్నారు వాళ్ళని పంపేసి ఈ ఫోజే మృదులగారిని విడిపించటానికి పూనుకుంటాను" అన్నాడు మింగియార్.

భాగవతార్‌కి ఇంటికి వెళ్లాలని లేదు ఒకదాని తరువాత ఒకటిగా వచ్చిపడుతూన్న ఈ సమస్యలు అతడ్ని పిచ్చివాడ్ని చేస్తున్నాయి. అన్ని విషయాలు తెలుసుకున్న ఏండెటో తన మృదంగం తీసుకొచ్చి, 'గురువుగారూ కొంతసేపు సంగీత సాధన చేసుకుందాం", అన్నాడు. వెంటనే భాగవతార్ సంగీతంలో లీనమైపోయాడు. "కళ కూడా ఒక తపస్సే" అనడానికి భాగవతార్ మంచి ఉదాహరణ తన మనసంతటితోనూ గానకళా సరస్వతిని మృదులని కాపాడమని ప్రార్థిస్తూన్నట్లుగా వుంది అతని గానం.

మూడు రోజులు గడిచాయి ఆ మూడు రోజులు– డెభ్బై రెండు గంటలు, నాలుగువేల మూడు వందల ఇరవై నిముషాలు రెండు లక్షల, యాభై తొమ్మిదివేల రెండు వందల సెకెన్లు, ప్రతి సెకను గాన కళా సరస్వతిని తన సాధన ద్వారా మృదులని కాపాడమని ప్రార్థిస్తూ గడిపాడు భాగవతార్

మూడో రోజున మృదులతో వచ్చాడు మింగియార్. ఆర్తిగా, దీనాతిదీనంగా వినిపిస్తోన్న భాగవతార్ సంగీతం, మృదులకి స్వాగతం పలికింది. పోలీసు లాకప్‌లో మూడు రోజులపాటు అనుభవించిన నరకయాతనలన్నీ ఒక్కసారిగా మాయమయినట్లనిపించింది. మృదులని చూడగానే వికసించిన ముఖంతో లేచి నిలబడి చేతులు జాపాడు భాగవతార్. ఆ చేతుల్లో వాలిపోయింది మృదుల.

కళ్ళల్లో ఉబికిన ఆనంద బాష్పాలు తుడుచుకున్నాడు మింగియార్

అప్పటివరకూ అందరికీ పజిల్‌గా వున్న మింగియార్ తన విషయాలన్నీ వివరించాడు

"ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కర్నాటక పర్యటించినప్పుడు బైలుకుప్పేలోని లామెసరీ కూడా సందర్శించాడు. అతి ప్రాచీన కాలం నుంచి లామాలలో కొందరికి కొన్ని విద్యలు పారంపర్యంగా సంక్రమిస్తూ వచ్చాయి వాటిలో ఏకాగ్రమైన సాధనతో జ్ఞాననేత్రాన్ని సాధించడం మనుష్యుల నావరించి వుండే విద్యుద్వయస్కాంత జీవతరంగాల వర్ణాలను బట్టి వారి వారి మనోభావాలని తెలుసుకో గలగడం– మూలికలతో వైద్యాలు– జూడో విన్యాసాలు– జూడో ద్వారా ఎదుటి వ్యక్తుల్ని కొంతసేపు స్పృహ తప్పేలాగ చేయగలగటం– జూడో అభ్యాసం ద్వారా మానసిక నిగ్రహాన్ని సాధించడం, మొదలైనవి ముఖ్యమయినవి. లామాలలో కూడా రకరకాల వాళ్ళున్నారు. కొందరు పెళ్ళిళ్ళు చేసుకుని సంసారాలు చేసేవాళ్ళు కూడా ఉన్నారు. కొందరు బౌద్ధాన్ని ప్రచారం చేసేవాళ్ళు. మరికొందరు రాజకీయాల్లో ప్రవేశం కల్పించుకొనేవాళ్ళు– ఇలా ఎందరో మాలోనూ, అతికొద్దిమంది మాత్రమే పూర్తి సన్యాస జీవితాన్ని గడిపేవాళ్ళు. నేను మొదటి నుంచీ సన్యాస జీవితాన్నే ఎంచుకున్నాను మా గురువుగారికి నా అదృష్టంకొద్దీ నా మీద దయకలిగి తన విద్యలన్నీ నాకు ప్రసాదించారు. నిజానికివేవీ మంత్ర తంత్రాలతో కూడుకొన్న విద్యలు కావు అన్నీ సైన్స్ వొప్పుకుంటున్నదే మీ గిరిజనుల్లో మాకంటే అద్భుతంగా మూలికలతో వైద్యం

# కోహినూర్

ఝల్లు మనే చల్లగాలులు విసిరి వీచే వేళ
జగమంతా ప్రకృతి ఒడిలో నిదురించే వేళ
వెచ్చని సుతిమెత్తని నీ వలపు వెలుగు
అలముకుంటుంది నా హృదయాన్ని చలి తెలియకుండా
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన ల్యూబ్రికేటెడ్
కాండోమ్. ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది.




ttk తయారీ

MAA (S) LRC1A TEL 86

# ఆఫీసుల్లో అందలాలు

అంధులు కళ్ళుం వడ్తే
అడుతున్నది కీలుగుఱ్ఱం!
పండితులు పస్తు బతుకుంటే
పందికొక్కులు బలుస్తున్నై!
ఇనుమూ, ఇటికలు కాజేసి
ఇసుకతో నింపారు పునాదిని!
నిన్న కట్టిన వంతెన కాస్తా
నిలువునా కూలింది నదిలో!
"బియ్యంలో రాళ్ళున్నా"యని
బీదవాళ్ళు ఘోషిస్తే
రాళ్ళల్లో బియ్యం కలిపి
'రేషన్' వాళ్ళమ్మేస్తున్నారు!
కట్నం డబ్బులతో నే
పట్నంలో ఇల్లుకట్టి
"ఇంకాదో చుకురమ్మ"ని
ఇల్లాళ్ళను తగలేస్తున్నారు!

శ్మశానంలో నైనా
'సొత్తు' వాసన చూపిస్తే
శవాలు బైటికి లేచి
"శరణు" "శరణు" "శరణం"టాయి!
జాతీ నోట్లు కొట్టించి
జాతకాలే మార్చుకునే వాళ్ళకు
పందెంలో వోడి పోతే
పార్టీలు మార్చడం కష్టమా!
వేదికపై పొద్దున్నే
వేదాలు వల్లించేసి
సాయంత్రం 'క్లబ్బు'ల్లో
"స్కాచ్" ని సేవిస్తున్నారు!
బుద్ధుడిలా కనిపిస్తూ
హిట్లర్‌లా వర్తిస్తూ
దేబెల్లా నటిస్తున్న
దేవాంతకులెందరెందరో

దేవిడీలో కుర్చీలెక్కని,
దేహాంత మైనా దిగక,
కీలు బొమ్మల్లా – ప్రజలను–
కిక్కురు మనకుండా చేసిన
గోముఖ వ్యాఘ్రా లిప్పుడు
గొప్ప నేతలై–
తమ తమ
అల్లుళ్ళను, మరదళ్ళను
అందల మెక్కించారట!

అంధులు కళ్ళుం వడ్తే
అడుతున్నది కీలుగుఱ్ఱం!
పండితులు పస్తు బతుకుంటే
పందికొక్కులు బలుస్తున్నై!!

–ఏల్చూరి విజయరాఘవరావు

## రేపటి మహిళ

చేసేవారున్నారు

ముఖ్యమంత్రికి మా గురువు నన్ను పరిచయం చేసి నేను సాధించిన శక్తుల గురించి గొప్పగా వర్ణించారు. ముఖ్యమంత్రి నన్ను రాజధానికి ఆహ్వానించారు.

ముఖ్యమంత్రి భవనంలో, ముఖ్యమంత్రి తనకి సన్నిహితులైన కొందరు మంత్రులతో మాట్లాడుతూండగా నేనూ అక్కడున్నాను. వాళ్ళంతా వెళ్ళిపోయాక ముఖ్యమంత్రి సరదాగా–

"ఇప్పుడొచ్చిన వాళ్ళల్లో ఎవరి మనోభావాలు ఎలాంటివో చెప్పగలవా?" అన్నారు.

"వంగపండు రంగు జరీ అంచున్న ఖద్దరు పంచె కట్టుకుని, గోధుమరంగు సిల్కు లాల్చీ వేసుకున్నా యన ఏదో ద్రోహ బుద్ధితో వున్నట్టు తోస్తోంది" అన్నాను. ముఖ్యమంత్రి ఆశ్చర్యపోయారు.

"అతడు నాకు పరమ ఆప్తుడు" అన్నారు. అప్పట్లో ఆయన నా మాటలు నమ్మలేదు. నాల్గు రోజులు ముఖ్యమంత్రి భవనంలో వుండి జైలుకుప్పేకు వచ్చేసాను. తరువాత చాలా విచిత్రమయిన సంఘటనలు జరిగాయి. ముఖ్యమంత్రి భార్యకి గుండె జబ్బు వచ్చింది. ప్రాణాలు దక్కవనుకున్నారు. ఆ దశలో ఆమెను తీసుకుని చికిత్సకోసం అమెరికా వెళ్ళారు ముఖ్యమంత్రి. సరిగ్గా ఆ సమయంలో ముఖ్యమంత్రి తన కాప్తుడనుకున్న వ్యక్తి అసమ్మతి వర్గాన్ని లేవదీసి కొంతమంది అనుచరుల్ని కూడదీసుకుని శాసనసభలో ముఖ్యమంత్రికి మెజారిటీ లేదని చూపించి ముఖ్యమంత్రి పదవి అలంకరించాడు. అమెరికా నించి తిరిగొచ్చిన ముఖ్యమంత్రి ఈ నమ్మకద్రోహానికి నివ్వెరబోయాడు. కాని దృఢంగా నిలబడి తన అనుచరులనందర్నీ కూడదీసుకుని శాసనసభలో తనకి మెజారిటీ వుందని నిరూపించుకుని తిరిగి ముఖ్యమంత్రి కాగలిగారు. ఈ పరిణామాలు తరువాత ముఖ్యమంత్రికి నా మాటల్లో విశ్వాసం కుదిరి నన్ను రాజధానిలో కొన్నాళ్ళుండమని ఆహ్వానించారు. మరో ఇద్దరు లామాలతో మూలికలు సేకరించే మిషమీద ఆంధ్రప్రదేశ్‌కొచ్చి రాజధానిలో వుంటున్నాను. ఈ ఇల్లు అది ముఖ్యమంత్రిగారే ఏర్పాటు చేశారు నాకు జ్ఞాననేత్రం వుందని ప్రచారం కాగానే ఎందరెందరో తమ తమ సమస్యల పరిష్కారాల కోసం నా దగ్గిరకొచ్చేవారు. ముఖ్యమంత్రి కూడా కొన్ని కొన్ని సమస్యలు నాతో చర్చించేవారు నా మాటలు ఆయన ఎంతవరకూ విశ్వసించేవారో నాకు తెలియదు. ఆ విషయం నేనెప్పుడూ అడగలేదు. ఈ పరిచయంతోనే ముఖ్యమంత్రికి మృదులగారి గురించి నాకు తెలిసిందంతా చెప్పాను అంతేకాదు ముఖ్యమంత్రి ఆప్తమిత్రుడు నమ్మకద్రోహం చేసి ముఖ్యమంత్రి అయిన సందర్భంలో రాజభూషణం అతనికి చాలా సహాయం చేశాడు. అతని పార్టీకి ధారాళంగా విరాళాలిచ్చాడు. ఇదంతా నాకు ఆ రెండో మంత్రి అనుచరుల ద్వారానే తెలిసింది. అతను అనుచరులు కొందరు తమ పార్టీ మళ్ళీ పదవిలోకి వస్తుందో రాదో తెలుసుకోవడానికే నా దగ్గరికొచ్చేవారు వాళ్ల ద్వారా తెలిసాయి నాకీ సంగతులు. ఈ విషయం కూడా ముఖ్యమంత్రికి చెప్పి రాజభూషణం పన్నుగడ అని వివరిస్తే ముఖ్యమంత్రి నా మాటలు విశ్వసించారు. ఆయన సహకారంతో మృదులని విడిపించగలిగాను. రాజభూషణం విషయం లాయర్ యశోధరాదేవిగారు చూసుకుంటున్నారు. నేను రేపు జైలుకుప్పే వెళ్ళిపోతున్నాను. నా దగ్గిరకొచ్చేవాళ్ళు ముసుగుల్లో ఎందుకొస్తున్నారో కొన్ని ఉదాహరణలు చెప్తాను.

ఒకావిడ తను దేవుళ్ళని, దెయ్యాలని నమ్మనంటుంది. మార్క్సిస్ట్ అని చాటుకుంటుంది. అయితే ఆవిడ పదవుల కోసం మంత్రుల్ని శాయశక్తులా



# డాక్టర్ సలహాలు

## డా. కె. వెంకటేశ్వరరావు

**ఎన్. జె. – సంగారెడ్డి**

రెండు సంవత్సరములుగా నా చెవులు వినిపించటం లేదు చెవులలో ఏదో శబ్దంగా వుంటున్నది. చెవిలోపల వేసే మందులు చాలా వాడాను.

మధ్యచెవి (మిడిల్ ఇయర్)లో గాని, లో చెవి (ఇంటర్నల్ ఇయర్) లోగాని రోగాల వల్ల మార్పు లేర్పడినప్పుడు ఇలా జరుగుతుంది. ఏ రోగమైనదీ ప్రత్యక్షంగా పరిశోధించి ఇ. ఎన్. టి. వైద్యులు తీర్మానించవలసి వుంది. కొందరికి స్టెపీడెక్టమీ ఆపరేషన్ చేసి వినిపించేలా చేయవచ్చును. మరికొందరికి హియరింగ్ ఎయిడ్ వాడటం వల్ల నయమవుతుంది.

**సి. యస్. – తెనాలి**

నాకు బి పి, షుగర్ 1977 నించి ఉన్నవి నా వయస్సు 61 సం లు 1985 నవంబరులో ఎడమ కాలి సీలమండ వద్ద ఒక కురుపు రాగా ఆపరేషన్ చేసినారు

ప్రస్తుతం సీలమండపై భాగమున చేసిన గాయం పూర్తిగా తగ్గినది కాని దిగువన చేసిన గాయం ఇంకా పచ్చిగానే ఉన్నది అందువల్ల ఎడమ పాదం ఒక తాడుతో బిగించినట్లు, బాధ పెట్టుచున్నది పైగా ఎడమ కాలి బొటన వేలు పైకి లేచి ఉంటుంది. సుమారు రెండు ఫర్లాంగులు నడవగల్గు చున్నాను. ఇంట్లో అటు, ఇటు నడవవలసి వచ్చినప్పుడు బొటనవ్రేలి క్రింద ఉన్న ఎముక బాగముపై గల కండ తగ్గి నందున ఎక్కువ బాధగా ఉన్నది.

డయాబెటిక్ ఫుట్ అనబడే ఈ లక్షణానికి సర్జన్లు, డయాబెటిస్ స్పెషలిస్టులు సమిష్టిగా వైద్యం చెయ్యవలసి ఉంటుంది.

సర్జన్లు పరీక్షించి రక్తసరఫరా వృద్ధి అవటానికి తగిన చర్యలు తీసుకోవటం జరుగుతుంది. వెంట వెంటనే వైద్య పరీక్ష చాలా అవసరం.

డయాబెటిక్ ఫుట్ చికిత్స అనేది ప్రస్తుతం ఒక ప్రత్యేక చికిత్సా విభాగంగా వృద్ధి చెందింది.

**బి. బి. యస్. – రాజమండ్రి**

కుక్క కరిచినచోట జిల్లేడు పాలు పొడవటం, కాకరాకు పసరు వాడటం వల్ల ప్రయోజనం వుందా?

ఈ విషయం గురించి చర్చించేకన్నా కుక్క కరచినచోట శుభ్రపరచి కాటరైజ్ చేయటం, ఆంటీరేబీస్ వాక్సిన్ వేయించటం మంచిదని తెలుసుకుంటే మంచిది. ఊర కుక్కలని పట్టి నిర్మూలించటం, పెంపుడు కుక్కలకి ఆంటీ రేబీస్ వాక్సిన్స్ ప్రతి సంవత్సరమూ వేయించటం తీసుకోవలసిన ఇతర చర్యలు. మునిసిపాలిటీ లేక కార్పొరేషన్ వారు వీటికి తగిన గట్టి చర్యలు తీసుకోవలసి వుంటుంది.

# రేపటి మహిళ

కాకాలు పడుతూనే ఉంటుంది ఇటీవల ఆవిడక ఏదో గర్భకోశ వ్యాధి పచ్చింది ఎంతమంది డాక్టర్లకి చూపించినా సరిగ్గాడయాగ్నైజ్ చేయలేక పోయారు. బాధ భరించలేక ప్రాణం విసిగి పోయిందావిడకి చివరి ప్రయత్నంగా నా దగ్గిరకి వచ్చింది. ఆవిడే మొదటిసారిగా ముసుగులో నా దగ్గిరకొచ్చింది. ముసుగులో వస్తే తనెవరో నాకు తెలియదని ఆశపడింది పాపం. నేనన్ని విషయాలు తెలుసుకుంటానని ఆవిడక తెలియదు. ఆమెని చూసి మిగిలినవాళ్ళు కూడా ముసుగులో రావడం ప్రారంభించారు ముసుగుల్లో వుండటం వల్ల తామెవ్వరో ఎవరికీ తెలియదనే ధైర్యంతో వాళ్ళు ప్రకటించే కోరికలు వింటూంటే మానవుల స్వార్థానికి– దురాశకి మతిపోయేట్లయ్యేది. ఒకడు మంచంలో తీసుకుంటూన్న తన తండ్రి ఎప్పుడు చచ్చిపోతాడని అడిగాడు. మరొకావిడ "తనకు విరోధమున్న ఇంకొకావిడకి రోగం తెప్పించే చేతబడేమైనా నాకొచ్చాని" అడిగింది. మరో ప్రబుద్ధుడు "తను కోరగానే ఏ అందమైన యువతైనా తన వెంట వచ్చే మంత్రం ఏదేనా వుంటే చెప్పమని", అడిగాడు

మరికొందరు "ముఖ్యమంత్రి పదవిలోంచి దిగిపోయే అవకాశముందా," అని అడిగారు అందుకు దారితీసే రకరకాల ఉద్యమాలు– ఆందోళనలు, తాము చెయ్యదల్చుకున్నవి చెప్పి అవి విజయవంతం అవుతాయా అని అడిగేవారు.– ఇలాంటివే ఎన్నెన్నో ప్రతి మనిషికి, ముసుగులో ఒకరూపం– ముసుగు లేకుండా మరో రూపం– ముసుగులో వున్న రూపాన్ని సైతం కనిపెట్టగలగటమే నేను సాధించిన విద్య.

భాగవతార్‌గారూ! మృదులగారి లాంటి వ్యక్తిని చాలా అరుదుగా చూడగలుగుతాం మనం. ఆమెకి ముసుగురూపం లేదు. తన వ్యక్తిత్వంతో నిర్భయంగా నిలబడుతుంది అదే ఆమెలోని విశిష్టత

కళ్ళు మూసుకుని ఏ అడవుల్లోనో కూర్చోవడమే తపస్సుకాదు నిజ జీవితంలో నిజాయితీతో నిలబడటమే గొప్ప తపస్సు మృదులగారూ! మీరు జీవితాంతమూ ఇదే నిజాయితీతో నిలబడాలని ఆశీర్వదిస్తున్నాను భగవంతుడు మానవుడికి ప్రసాదించే వరాలన్నింటిలోకి ఇదే గొప్ప వరం"–

* * * * * * *

బ్రీఫ్‌కేస్ సర్దుకుని చేత్తో పట్టుకుంది మృదుల ఉత్సాహం ఉరకలు వేస్తున్న ఆమె ముఖం అందాలకి అందంలా కళకళలాడుతోంది –

"మైడియర్ అవతారం గుడ్‌బై. నన్ను నువ్వు భరించలేవు–"

"టా టా!" చెప్పటానికి పైకెత్తిన చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుని బ్రీఫ్‌కేస్ దూరంగా విసిరేసాడు భాగవతార్.

"వెళ్ళకు. నువ్వు రేపటి మహిళవి– నేనింకా నిన్నలోనే ఉన్నాను ఎప్పటికయినా కాలం ముందుకు కదులుతుంది కానీ, వెనక్కి రాదు. నేనూ నీతోనే వస్తాను"– అతడి చేతులు విడిపించుకోకుండా మరికాస్త దగ్గిరగా జరిగి "రాగలవా, మరి?" అంది మెత్తగా. "కష్టమే అనుకో! ప్రయత్నిస్తాను. నీ కోసం! నిన్ను వదిలి ఉండలేక...."

కాలింగ్ బెల్ మోగింది– భాగవతార్ చేతులు వదిలించుకుని తలుపు తెరిచింది. జర్నలిస్ట్ మహావీర్ వచ్చి కూచున్నాడు–

"ఫ్లెమింగ్ వ్యవహారంలో మీ అనుభవాలన్నీ వివరంగా చెప్తారా? ఆర్టికల్ వ్రాయాలి! అన్నాడు మృదులతో!

"తప్పకుండా! రండి! నా స్టడీరూంలో కూచుందాం!"

హాల్లో భాగవతార్ ఒక్కడూ మిగిలిపోయాడు–

"కష్టం! చాలా కష్టం! కానీ తప్పదు– కాలం "రేపు"లోకి ప్రవహించవలసిందే!" గొణుక్కున్నాడు

ఈసారి అతడి చెయ్యి బాట్లు మీదక వెళ్ళలేదు. **(అయిపోయింది)**

# వ్యక్తిగతం

## అవకతవకలు బయటపెట్టే ఆత్మకథ

ఆసియన్లలో ఇంగ్లీషు చానెల్‌ను అతి తక్కువ కాలంలో ఈదిన మహిళ, అనితా సూద్ భారత ఈత పోటీల



సమాఖ్యతో తీవ్రంగా పోరాడుతోంది ఆమె ముక్కుసూటిగా ప్రవర్తిస్తుంది గనుకనే ఈ ఘర్షణ తలెత్తింది. ఈ ఘర్షణ వల్ల సమాఖ్య వారు ఆమెను కామన్ వెల్త్ క్రీడలకు పంపిన ఈత బృందాలలో చేర్చలేదు ఈ క్రీడలలో సమాఖ్య బహుమతులను గెలుచుకోలేక పోయింది ఇప్పుడు అనితా సూద్ ఆత్మకథ రాస్తానని ప్రకటించడంతో ఈ వ్యవహారాలన్నీ అందులో వస్తాయనుకుంటున్నారు. "ఆత్మకథ రాయడమంటే కల నిజమయినట్టే" అని ఆమె అన్నది. ...

## కన్షీరామ్ కలలు!

ప్రధాన ప్రతిపక్షం స్థాయికి ఎదుగుతుందనిపించిన బహుజన్ సమాజ్ పార్టీని ప్రతిపక్షాలు కనీసం సమావేశాలకు కూడా ఆహ్వానించడం లేదు. హర్యానా శాసనసభ ఎన్నికలలో పూర్తిగా మట్టి కరచిన తర్వాత ఇప్పుడు బహుజన్ సమాజ్ పార్టీ ఉత్తరప్రదేశ్‌ను కార్య క్షేత్రంగా చేసుకోనున్నదని దాని అధినేత కన్షీరామ్ ప్రకటించారు ఉత్తర ప్రదేశ్‌లో వి పి సింగ్ ప్రాబల్యం ఎంత పెరిగిందో, తన పార్టీకి చెందిన వారిని ఎందరిని వి. పి. సింగ్ ఆకర్షించారో తెలుసుకుని, పరిష్కారాలు ఆలో చించేందుకు నవంబర్ 10 నుంచి ప్రారంభించి శ్రీ కన్షీరామ్ సైకిల్ ప్రదర్శనలు ప్రజా సమావేశాలు, భారీ ఊరేగింపులు ఏర్పాటు చేస్తున్నారు "రానున్న ఏ ఎన్నికలలోనైనా అధికార పక్షాన్ని ప్రతిపక్ష పార్టీలన్నీ కలిసి ఎంతగా ఎదుర్కొంటాయో మా పార్టీ



ఒంటరిగానే అంతగా ఎదుర్కొంటుంది" అని అంటున్నారు శ్రీ కన్షీరామ్

## విందు భోజనం లేని వివాహం!

మహారాజ కుటుంబంలో వివాహానికి విందు భోజనం లేకపోవడమా? అని ఎవరయినా ఆశ్చర్య పోవచ్చుగాని గ్వాలియర్ సంస్థానాధీశుడు, కేంద్ర రైల్వేశాఖ మంత్రి మాధవరావు సింధియా ఆ ఆశ్చర్యాన్ని నిజం చేయదలచుకున్నారు. మాజీ కేంద్ర మంత్రి కరణ్‌సింగ్ కుమారుడితో తమ కుమార్తెకి వివాహం జరుపుతున్న సందర్భంలో ఆయన ఈ ప్రకటనను అక్షరాలా శుభలేఖలోనే రాశారు. "దేశంలోని అనేక ప్రాంతాల్లో ఉన్న



కరువు దృష్ట్యా మా గౌరవనీయ అతిథులకు విందు ఏర్పాటు చేయలేక పోతున్నందుకు చింతిస్తున్నాము" అని- గ్వాలియర్‌లో జరిగే ఈ వివాహానికి పొరుగూళ్ళ నుంచి వచ్చే వాళ్ళు భోజనాల పొట్లాలు తెచ్చుకోవాలా అని కొందరు కోపంగా ప్రశ్నిస్తున్నారట...

## మరో దురాచారం

రాజస్థాన్‌లోని కొన్ని ప్రాంతాలలో యువ వితంతువులను ఒక గదిలో ఉంచి ఆమెను పరామర్శించడానికి వచ్చిన వారందరూ ఆమె జుట్టు పూర్తిగా ఊడిపోయి బోడి గుండు అయ్యేంతవరకూ వెంట్రుకలు పెరికి వేస్తారని, ఈ ఘోరమైనదురాచారం ఇప్పటికీ అక్కడ ఉన్నదని స్త్రీలు, యువజన, మహిళా శిశుసంక్షేమ సహాయ మంత్రి శ్రీమతి మార్గరేట్ అల్వా



ఇటీవల ఒక సభలో అన్నారు. మరి ప్రభుత్వం వారు ఏం చేస్తున్నట్లు?

## ఇందిర కాదు, రాజీవ్ మాత్రం హిందువే!

సార్క్ శిఖరాగ్ర సమావేశానికి వెళ్ళిన రాజీవ్ గాంధీకి, ఆయన సతీమణి సోనియాగాంధీకి నేపాల్ ప్రభుత్వం రాజోచిత లాంఛనాలతో ఆతిథ్యం ఇచ్చింది కాని ఈ ఆతిథ్యంలో ఒక అపశ్రుతి పలకక తప్పలేదు ఖాట్మండులోని పశుపతి ఆలయాన్ని సందర్శించాలని రాజీవ్ దంపతులు ప్రయత్నించగా ఆలయ నిర్వాహకులు అభ్యంతరం తెలిపారు రాజీవ్‌గాంధీ ఆలయంలో ప్రవేశించవచ్చును గాని



సోనియా గాంధీ ప్రవేశించడానికి వీలు లేదన్నారు సోనియా హిందువుగా జన్మించక పోవడమే అందుకు కారణమన్నారు ఇందిరాగాంధీని కూడా మరొక మతస్థుణ్ణి పెళ్ళి చేసుకున్నదనే కారణం మీద ప్రవేశించనివ్వ లేదని ఆ నిర్వాహకులు ఘనంగా చెప్పారు. ఇందిరా ప్రియదర్శినికే నిరాకరించబడిన ప్రవేశం రాజీవ్‌కు మాత్రం ఎట్లా అంగీకరిస్తారని కొందరు ప్రశ్నిస్తున్నారు.. □




ఉదయ సంధ్యాకాంతులు పురివిప్పిన మయూరాల్లా విచ్చుకుంటున్నవేళ.......

సమయం ఏడు గంటలు దాటి ఒక నిముషాన్ని చూపెడుతుంది పెద్దముల్లు.

వరండా పడక కుర్చీలో పడుకున్న మాదవరావు మనసంతా అల్లకల్లోలంగావుంది. గుర్తుచేసుకో కూడదనుకున్నా, ఏవో నీలినీడలు ఆయన మొహంలో కదలాడుతున్నాయి.

ఆనవాలికల అందులలో జీవితంలోని చేదునిజా లను ఆకళింపుచేసుకోలేకపోతుంది ఆయన వృద్ధాప్యం.

* * *

వయసొచ్చిన ఆడపిల్లకు భర్తని, వంశాన్ని ఉద్ధరించడానికి పుట్టిన తనయుడికి బ్రతుకు చూపించడం తల్లిదండ్రుల కనీస బాధ్యత

కాని మాధవ తండ్రి రామశాస్త్రి ఆ కనీస కోర్కెలకుకూడా నోచుకోలేదు రేపో మాపో కూలిపోవడానికి సిద్ధంగావున్న యిల్లు.... బ్రతకడానికి పౌరోహిత్యం ఎదిగిన యిద్దరాడ పిల్లలు బ్రతుకుతెరువు చూపించాల్సిన ముగ్గురు మగపిల్లలు కష్టంలోనూ, సుఖం లోనూ పాలుపంచుకొంటున్న భార్య వసుంధర ... యివీ రామశాస్త్రి ఆస్తిపాస్తులు.

అప్పుడే పోస్ట్‌మాన్ యిచ్చిన ఉత్తరం అందు కొన్న మాధవ అసలు విషయం తల్లి చెవినేశాడు

నెలక్రితం యింటర్వ్యూకెళ్ళిన ఉద్యోగానికి పదివేలు లంచం పెడితే పని జరుగుతుందని స్నేహితుడు వ్రాసిన ఉత్తరం చదివి తల్లిచేతి కందించాడు మాధవ

ఉద్యోగం రావాలంటే కేవలం కొడుక్కున్న మార్కులు కాదు డబ్బు.. పలుకుబడి కావాలని తెలుసుకున్నప్పుడు కొడుకు చెప్పిన సలహా తప్ప వేరే దారి కనిపించలేదు వసుంధరకి

కొడుకుని నిరుత్సాహపర్చడం యిష్టంలేక తండ్రిని ఒప్పిస్తానని మాట యిచ్చింది వసుంధర

మధ్యాహ్నం భర్త రాగానే కొడుకు విషయం ప్రస్తావించింది

తండ్రి ఏం చెబుతాడోనని ఆతృతగా వసారాలో నుండి చెవులు గోడకానించి వింటున్నాడు మాధవ

ఏవండీ! మాధవ యింటర్వ్యూలో సెలక్టు అయ్యాడట కాని లంచం పదివేలన్నా పెడితేగాని ఉద్యోగం రాదట ఏవండీ! మీరు సమాధానం చెప్పండి మౌనంగా వుండి బాధపడి ప్రయోజనం ఏమిటి చెప్పండి బ్రాహ్మణీకాన్ని నమ్ముకొని మనం బావుకున్నదేముంది? మన కష్టాలు కలకాలంవుండేవే. యిల్లు అమ్మితేనేగాని వాడి భవిష్యత్తు ఓ దారిన పడదు. తరువాత పిల్లల బాధ్యతలు వాడే చూసుకుంటాడు. రోజులు బావుంటే యింతకంటే మంచియిల్లు కట్టు కుంటాడు."

తల్లి మాటలకి తండ్రి నుండి ఏ సమాధానం రాక పోవడంతో మాధవ్ తెగించి తండ్రిని అడిగాడు.

"ఏమిటినాన్నా! యిల్లు అమ్మడానికి ఏదో బిడ్డని దానం చేసినట్టు బాధపడుతున్నారు మహామహా రాజులే భార్యలకోసం. . పిల్లలకోసం ఐశ్వర్యాన్ని.. రాజ్యాన్ని వదిలి అడవులపాలయ్యారు. కేవలం ఈ చిన్న గుడిసె అమ్మడానికి యిలా దిక్కులుచూస్తా

రేమిటి? నాన్నా! నేను మీకు చెప్పేంత పెద్దవాణ్ని కాకపోవచ్చు. కాని పెద్దరికం పేరుతో మీరు దిద్దుకోలేని పొరపాట్లు చేశారు. పెళ్ళంటే ఏమిటో తెలియని వయసులో పెద్దక్కకి పెళ్ళిచేశారు. శక్తికి మించిన సంతానాన్ని కని మా ఆశలు, ఆశయాలు అడియాసలుచేశారు. మమ్మల్ని కన్న పాపానికి, మేం పస్తులువుండటం చూడలేక అప్పుచేసి, మనకిపెట్టి ఎన్ని రాత్రులు అమ్మ కడుపుకాల్చుకుందో ఎప్పుడైన ఆలోచించారా? ఇంకా ఎందుకు నాన్నా! ఈ పిచ్చుక గూడు లాంటి యింటికోసం పాకులాట?"

ఆవేశంగా అన్న మాధవ మాటలు కొరడాతో చెళ్ళున చరచినట్లయింది రామశాస్త్రికి. తన చేతుల్లో పెరిగిన కొడుకు తగిన పాఠాలు చెపుతున్నాడు. తను నడిచిన తోవను తప్పుపడుతున్నాడు.

ఆ సాయంత్రం తండ్రిమౌనంగా వుండటంవలన భయపడి తల్లి తండ్రి దగ్గరే కూర్చుంది తండ్రితో కాస్త ఉద్రేకంగా మాట్లాడానని తను తల్లి దగ్గరే కూర్చున్నాడు.

యింటిల్లపాదీ తనగురించి భోజనం చేయలేదని గమనించలేని మూర్ఖుడుకాదు రామశాస్త్రి.

ఎప్పుడో తన పూర్వీకులు సంపాదించిన యిల్లు అమ్మడమా?

తన తాత ముత్తాతలుగడిపిన యింట్లో పరాయివాళ్ళు నివసించడమా?

తన బాల్యం గడిచిన యింట్లో తన వృద్ధాప్యం గడపాలనుకొని ఎంత ఆరాటపడ్డాడు'

పగలంతా పౌరోహితంచేసి యింటికి వచ్చేసరికి అలుపు తెలిసేదికాదు

దొడ్లో పెద్ద మామిడిచెట్టు..... మామిడిచెట్టు మీద పిచ్చుకగూళ్ళు.... సాయంత్రం అయ్యేసరికి తల్లులు ఆహారం చేర్చడం...... పెద్దపిచ్చుకలు..... చిన్నపిచ్చుకలని రెక్కల్లో పొదువుకోవడం...... వాటి చిన్న సంసారంలో మూగ ప్రేమ.... అభిమానం చూస్తుంటే కాలం తెలిసేది కాదు

పెరట్లో నీడని..... చల్లని గాలిని యిచ్చే వేపచెట్టు, వేసవికాలం వస్తే ఆ చెట్టుకిందే తమ పడకలు.....

దొడ్లో కల్పవృక్షంలా నిమ్మచెట్టు.... మరోపక్క ఎప్పుడూ కందపాదులు..... మొక్కలు.

కొడుకు గుడిసె గురించే ఆలోచిస్తున్నాడు కాని..... తరతరాలుగా తమ నాదుకున్న తల్లిలాంటి స్థలం గురించి మర్చిపోతున్నాడు.

రాత్రంతా నరాలు తెగే ఆలోచనలతో మునిగిపోయివున్న రామశాస్త్రి తెల్లారేసరికి శాశ్వత నిద్రలోకి జారుకున్నాడు.

రామశాస్త్రి బాధ్యత అలా తెల్లారిపోయింది.

పదకొండు రోజుల తర్వాత వచ్చిన చుట్టాలు తిరుగుముఖంపట్టారు.

మాధవ మేనమామ యిల్లు అమ్మేసి..... పట్నం వచ్చేయమని తన పలుకుబడితో ఉద్యోగం చూపిస్తానని వసుంధరకి..... మాధవకి చెప్పాడు.

ఈ ప్రస్తావనకి వసుంధర యిష్టం చూపించలేదు.

తండ్రి వుండగా యిల్లు అమ్మి..... తనకి భవిష్యత్తు చూపించమని ప్రాధేయపడిన తల్లి మార్పు మాధవ్‌ని కలవరపెట్టింది.

మేనమామ వెళ్ళాక తల్లిదగ్గర తన ఉద్యోగం సంగతి బయటపెట్టాడు.

"ఒరే మధూ. నాన్నగారు వుండగా నీకు భవిష్యత్తు చూపించమని ఆయన్ని వత్తిడిచేసినమాట నిజమే. బాధ్యతలే చూశానేకాని ఆయన మానసికవ్యధ అర్థం చేసుకోలేకపోయానురా! నాన్నగారు పోయేరోజు సాయంత్రం మగపిచ్చుక కరంట్‌పోల్‌మీద పడి చనిపోయినప్పుడు మీ నాన్నగారు చూసిన చూపు నేను జీవితంలో మర్చిపోలేనురా! ఆయన పోవడానికి కారణం యిల్లు అమ్మాల్సివస్తుందనే బెంగే కదరా?"

అంటూ పైటచెంగుతో మొహాన్ని దాచుకొని భోరుమంది వసుంధర.

"అమ్మా! నాన్నగారివి ఛాందస భావాలు, సెంటిమెంటల్‌గా ఆలోచిస్తున్నావేకాని, రేపు మనం బ్రతకడానికి ఆధారం ఆలోచించవేమ్మా! నాన్నకి చదువు లేకపోయినా వేదాలు ఒక పూటన్నా కూడుపెట్టాయి కాని నాకు ఉద్యోగంలేకపోతే ఆగతికూడా వుండదు'

అంటూ వుద్రేకం .. ఆవేదన కలగలిసిన గొంతుతో మాధవ తెగేసి మాట్లాడేసరికి వసుంధర మాట చెల్లలేదు.

చిన్నతరం ముందు పెద్దతరం ఓడిపోయింది!

★ ★ ★

మేనమామ తనతో హైదరాబాద్ వచ్చిన మాధవకి ప్రవేట్‌కంపెనీలో ఉద్యోగం చూపించాడు.

ఉద్యోగం రావడం.... మేనమామ కూతురు అరుంధతిని మాధవ పెళ్ళిచేసుకోవడం...... వేరుగా యిల్లు తీసుకోవడం జరిగాయి.

మాధవ తమ్ముళ్ళ నిద్దరినీ హైస్కూల్లో చేర్పించాడు: మాధవ చెల్లెలు మధుర జీవితం ఎడారికావడం యిష్టంలేక వసుంధరని ఎదిరించి, అప్పుచేసి ఓ యింటికి యిల్లాల్నిచేశాడు.

మాధవ తర్వాత అమ్మాయిని కాలేజీలో చేర్పించాడు

కాలం రెక్కలొచ్చిన పక్షిలా ఎగురుతోంది.

ఇరవైకేలెండర్లు చిరిగాయి

మాధవ కిప్పుడు ముగ్గురు పిల్లలు. పెళ్ళికి ఎదిగిన యిద్దరాడపిల్లలు యింట్లోనే వుంటున్నారు. అప్పుచేసి, తాహతుకుమించి కొడుకును యింజనీరింగ్ డొనేషన్ కట్టి చదివిస్తున్నాడు.

మాధవ తమ్ముడు శ్రీకాంత్ ఓ ప్రైవేట్‌కంపెనీలో ఉద్యోగం చేస్తూ, ఓ అయినింటికి యిల్లరికపు అల్లుడయాడు.

బాధ్యతలని. బంధాలని పంచుకోకుండా, చెల్లెళ్ళ పెళ్ళిళ్ళ కట్నానికి ఓ చెయ్యివేస్తాడని ఆశించిన కలలు తారుమారు చేశాడు.

తల్లి మరణం బాధ్యతలు తీర్చడం.. . యింటావిడని యిల్లు గలావిడగా చేయడం ....

ఇదీ యిరవయ్యేళ్ళలో జరిగిన మార్పులు!

ఓ ఎకరలేకపోయినా సొంతయిల్లు కట్టడానికి కథ వేరేవుంది

★ ★ ★ ★ ★ ★ ★

అప్పటికే ఎడెనిమిది అద్దెయిళ్ళు మారి సుభద్రమ్మ యింటికి వచ్చారు – సుభద్రమ్మ యింటిని వూరికే యిచ్చినంత పెత్తనం చెలాయించేది ఆమె మనస్తత్వం గమనించిన మాధవ వేరే యిల్లు వెతుక్కునే అవసరం రాకుండా భార్యను జాగ్రత్తగా మసులుకోమనేవాడు

మాధవ యింటి దగ్గరవుండేది తక్కువ కాలమే



# పిచ్చుక గూళ్ళు

అయినా, ఇంటావిడ తత్వాన్ని ఆకళింపుచేసుకోడానికి ఆదివారాలు, సెలవురోజులు సరిపోయేవి.

కాఫీపొడి.. టీ పొడి నెలాఖరువరకు వచ్చేవి కాదు. కాఫీ... టీకి తన యింటికే చొరవగా వచ్చేది

మాధవ... అరుంధతి కలిసి సినిమాకెళితే ఓర్చుకునేదికాదు. అకారణంగా అరుంధతిమీద అవియివీ లేనిపోనివి కల్పించుకొని పోట్లాడ్డానికి సిద్ధపడేది సభద్రమ్మ.

ఐదారేళ్ళు ఓపికపట్టిన అరుంధతి సుభద్రమ్మ మీద తిరగబడటం నేర్చుకుంది

సాధారణంగా మాధవ యింట్లోవుంటే భార్యకే నచ్చచెప్పేవాడు. యింటావిడకి భర్త వయస్సులో పోవడం... కడుపున నలుసు లేకపోవడం ఒకవిధమైన శాడిజానికి అలవాటుపడిందని మాధవకి అర్థమయింది

మాధవగురించి ఎవరయినా స్నేహితులు వస్తే, మగవాళ్ళన్న బెరుకు లేకుండా అరుంధతి గురించి వున్నవి లేనివి కల్పించి చెప్పేది

ముగ్గురు పిల్లలు పుట్టాక బాధ్యతలు మరింత పెరిగాయి కాని తగ్గలేదు

భార్యా పిల్లలు. తను కలిసి సినిమాకి వెళితే తననిరమ్మనలేదని రెండు మూడురోజులు మాట్లాడేదికాదు – సుభద్రమ్మ

వాకిట్లో కడిగితే నీళ్ళు తన మెట్లమీదపడ్డాయనో... మడికట్టుకుంటే మాధవ కూతురువచ్చి ముట్టుకుందనో యిలా అకారణంగా విషయాలు వెతికోరి గొడవపెట్టడంతో మాధవ కల్పించుకోక తప్పేదికాదు

ఒకోరోజు మాధవ యింటికొచ్చేసరికి యింటావిడ యిల్లుగలావిడ జుట్టుజుట్టు పట్టుకోవడానికి సిద్ధపడుతుంటే భార్యని కేకలేశాడు. సుభద్రమ్మతో రోజూ దినదిన గండం కింద బతికేకంటే, చచ్చిపోవడం మేలని అరుంధతి కంట నీరుపెట్టేది

అప్పుచేసి యిల్లు కొనడానికే నిశ్చయించుకున్నాడు మాధవ

నెలాఖరుకి కాస్త ఆలస్యంగా జీతాలువస్తే అప్పుకి తడుముకోవలసిన జీవితాలు

ఈ అద్దెళ్ళ భాగోతం చూస్తున్నప్పుడు తండ్రి యిల్లు అమ్మడానికి ఎంత మానసికంగా వత్తిడిఅయి ప్రాణం పోగొట్టుకున్నాడో తల్చుకునేసరికి అతని కళ్ళు చెమర్చేవి.

ఏదిఏమైనా మరో రెండేళ్ళకి అప్పు తీసుకొని అతి కష్టంమీద యిల్లు కట్టాడు.

అటు మగపిల్లాడి చదువు..... యిటు యింటికి తెచ్చిన అప్పునిమిత్తం వడ్డీ కట్టేసరికి యింట్లో ఖర్చులకి గిజగిజలాడేవాడు.

అబ్బాయి యింజనీరిగ్ చదువుతానని పట్టుబట్టాడు. కష్టాలు ఎప్పుడూ కలకాలం వుండేవే. మన కారణంగా పిల్లల భవిష్యత్తు పాడుచేయకూడదు' అంటూ అరుంధతి నిరాహారదీక్షవహించి కొడుకుని అప్పుచేయించి యింజనీరింగ్‌లో జాయిన్‌చేయించింది

సగం జీతంకూడా రాక యింట్లో యిబ్బందిపడుతుంటే మాధవ రెండుగదులలో తాము సర్దుకొని, రెండుగదులు అద్దెకిచ్చాడు

ఆ యింట్లో అద్దెకొచ్చిన యువజంట ప్రసాద్ – సిందూర. భార్యా భర్తలిద్దరూ కొత్తజంట కావడంవల్ల సింధూర అరుంధతితో పెద్దగా మాట్లాడేదికాదు

నెలయ్యేసరికి నాలుగొందలు చేతిలో పడినా పిల్లల చదువుల ధాటికి గిజగిజలాడేవాడు మాధవ

మాధవ ఆర్థిక సమస్యలతో సతమతమవడమేకాక భార్య మానసిక ప్రవృత్తికి దెబ్బతింది మాధవ మనసు

సిందూర మితభాషిణి. అరుంధతి మాటల ధాటికి తట్టుకొలేక ఒకోసారి తలుపు తీసేదికాదు దానితో అరుంధతి రెచ్చిపోయేది

తూము కడగడంలేదనో ... బట్టలు ఎక్కువవుతున్నాని నీళ్ళు ఎక్కువ వాడుతున్నారనో తను అడిగిన సామాను యివ్వకపోతే అద్దె పెంచుతానని బెదిరించడమో చేసేది

చాలాసార్లు మాధవరావు కోప్పడేవాడు

కాని అతనిమాట లెఖ్ఖచేసేదికాదు పైగా రేపోమాపో రిటేర్ అవ్వబోతున్నారు మీకెందుకని దెప్పిపొడిచి మాటాడేది

మాట్లాడకుండా మౌనంగా వూరుకుంటే మీకూ, ఆ పిల్లకు సంబంధం ఏమిటని నిలదీసేది.

ఇంట్లోకి సంబంధించిన చిన్నచిన్న వాడుకొనే సరుకులు తీసుకొచ్చి, జబర్‌దస్తీగా తెచ్చిన సరుకులు యివ్వకుండా మరోమారు ఎరువుకి వెళ్ళే అరుంధతి చేష్టలు చూసేసరికి తలకొట్టేసినట్టు వుండేది మాధవరావుకి

సినిమాలకి, షికార్లకి సిందూరని బలవంతంపెట్టి తీసుకెళ్ళడం ఖర్చులు ఆమెచేతే పెట్టించడం. మాధవరావు గమనించినా, ఆమెతో ఘర్షణపడి పదిమందిలో పడటం యిష్టంలేక మౌనంగా వుండేవాడు

కాలం పంచకళ్యాణిలా పరిగెడుతూనేవుంది చూస్తుండగానే మాధవకి ముసలితనం వచ్చేసింది

మాధవరావు రిటైరయ్యాడు. కాని రెండో ఆడపిల్ల పెళ్ళి చెయ్యలేకపోయాడు

పెద్దకూతురు పెళ్ళి అతి కష్టంమీద చేశాడు కొడుకు చదువు పూర్తయి, ఉద్యోగం వచ్చాక వాడితోవ వాడు వెదుక్కున్నాడు.

ఓ అమ్మడిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. కనీసం మాధవరావుని తండ్రిగాకూడా ఆహ్వానించలేదు






సరికదా చదువుకోసం చేసిన అప్పుకి తనకి సంబంధం లేదన్నాడు. కొడుకుని నమ్ముకొన్న మాధవరావు రెక్కలు తెగిన పక్షిలా విలవిలలాడాడు

రెక్కలున్నప్పుడు నాలుగురాళ్ళు సంపాదించిన మాధవరావుని అప్పులవాళ్ళు చుట్టుముట్టారు

ఇల్లు అమ్మి అప్పు తీర్చి పిల్ల పెళ్ళిచేద్దామన్న మాధవరావు ఆశలు యిప్పుడుకూడా తలకిందులయ్యాయి

చెప్పాచెయ్యకుండా ఓ అర్ధరాత్రి చిన్నకూతురు పక్కింటి దర్జీవాడితో లేచిపోయింది.

అప్పులవాళ్ళు యిల్లు వేలంవేస్తామని ప్రకటించడంతో యిల్లు అమ్మకంపెట్టక తప్పలేదు అరుంధతికి యింటిగలావిడ హోదా పోవడంతో ఆమె నోటికి తాళంపడింది

బయట ఎక్కడనుంచో రెండు పిచ్చుకలు 'కిచకిచ' మంటూ గడ్డి రెమ్మలు తీసుకొని గూడుకడుతున్నాయి చిన్నపిచ్చుకలు తల్లి రెక్కల్లో వొదిగిపోవడానికి రెక్కలు టపటపలాడిస్తున్నాయి

* * * * * * *

"ఏవండీ" అన్న భార్య పిలుపుకి గతం అంచుల నుండి జారుకున్న మాధవరావు వులిక్కిపడ్డాడు

'టైమ్ ఎంతయింది?"

"తొమ్మిది కావస్తోంది. వున్న సామాన్లు రెండు సంచుల్లో సర్దాను. మిగిలినవి డొక్కు, డోలు గోనెసంచుల్లో సర్దాను ఇక సర్దవలసినవి ఏమీలేదు "

దీనంగా అన్న అరుంధతివంక జాలిగా చూశాడు మాధవరావు.

నిన్న మొన్నటివరకు సొంతయిల్లు వున్నధన దర్పంతో, అద్దెకొచ్చిన సిందూరని నానా మాటలతో బాధపెట్టిన అరుంధతికి, పాతికేళ్ళక్రితం అద్దెకిచ్చిన సుభద్రమ్మకు తేడా ఏమీ కనిపించలేదు

మార్పల్లా సుభద్రమ్మ యింటిని తాము కొనలేదు తమ యింటిని ప్రసాదే కొన్నాడు

"ఏవండీ! మాట్లాడరేమిటండీ! కోపమైతే నన్ను కొట్టండికాని నన్ను అసహ్యించుకోవద్దండి "

అంటూ భోరున విలపిస్తున్న భార్యని ఆస్థితిలో చూసేసరికి అంతబాధలో కూడా నవ్వువచ్చింది.

"నవ్వుతారేమిటండీ! ఎంతో ముచ్చటపడి పిచ్చుక గూడులాంటి యిల్లు కట్టుకున్నాం మన రాత బావుండలేదండీ! నేను కట్టుకున్న గూటిలో యింకొకళ్ళు కాపురంచేయడం నేను భరించలేనండీ! నేను భరించలేను."

చిన్నపిల్లలా మాధవరావు ఎదమీదపడి గుండె లవిసేలా విలపిస్తోంది అరుంధతి.

మాధవరావు భార్యని ఆప్యాయతతో తల నిమిరి ఆమెను ఓదార్చుతున్నాడు కాని అతని మనసుకూడా నడిసముద్రంలో పడ్డట్టేవుంది.

అంతవరకు బయటేవుండి వాళ్ళ మానసికవేదన చవిచూస్తున్న ప్రసాద్ గుండెకరగి నీరయింది

ప్రసాద్ రావడంతో అరుంధతి భర్తకు దూరంగా జరిగింది

"చూడండమ్మా! మీ యిల్లు నేను కొన్నంత మాత్రాన మీమీద అధికారం చూపించే కుసంస్కారం మాకులేదు మీ బాధ నాకు తెలుసు కాని మా బాధ మీకు తెలియదు సిందూరం. నేను ఒకరికొకరం తప్పించి మాకు నా అన్నవాళ్ళు ఎవరూ లేరు సంఘంలో ఏ తల్లి పాపానికో కని పారేసిన అనాధులం. అనాధశరణాలయంలో పెరిగిన మేము అక్కడ పెద్దవాళ్ళ కాళ్ళుపట్టుకొని, వాళ్ళకు ఊడిగంచేసి పైకొచ్చినవాడ్ని నేను నాతోపాటే నా కష్టాల్ని.. . సుఖాల్ని పంచుకొని నాయిల్లాలయింది సిందూరం మాకు తల్లి తండ్రి ఎవరో తెలియక ప్రేమకు కరువయ్యాం కాని మీకు బిడ్డలుండి ప్రేమకు దూరమయ్యారు ఇన్నాళ్ళు ఈ విషయం మీకు చెబుదామనుకుంటూనే చెప్పలేక పోయాను. ఎందువల్లనంటే అనాథలుగా పెరిగిన మాకు సంఘం యిచ్చే విలువ మా అనుభవాల పట్టికలో వడబోసివున్నాం. కష్టాలెప్పుడు కలకాలం వుండవు. మీ అబ్బాయిలో మార్పువచ్చినప్పుడు మీ యిల్లు యిదేరేటుకి సొంతం చేసుకుంటానన్నా – యివ్వడానికి నాకు ఎప్పుడూ అంగీకారమే అంతవరకు మీ సొంతయిల్లులా భావించి సంకోచంలేకుండా వుండండి నాకు తల్లి తండ్రి వుంటే నా యింట్లో వాళ్ళు వుండరా? అలాగే మీరూనూ కన్నంతమాత్రాన ప్రతీ తల్లి, తల్లి అవుతుందనుకోవడం పొరపాటు. కమ్మని మనసున్న ప్రతీ తల్లీ తల్లే" ప్రసాద్ మాటలకి ఆ దంపతులిద్దరి మనసులు ఆనందంతో నాట్యంచేశాయి

తను సిందూరని అసందర్భమైన మాటలతో . చేష్టలతో విసిగించినతీరుకి 'యిల్లు ఖాళీ చేస్తారా? లేకపోతే సామాన్లన్నీ బయటకు విసరమంటారా?" అని చెడామడా దులుపుతాడను కొన్న ప్రసాద్ ఔన్నత్యం ముందు తలవంచిన అరుంధతి కళ్ళలో నుండి రెండు కన్నీటిబొట్లు రాలిపడ్డాయి. □



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఎ.ఎల్ఎల్.బి.

## ఆత్మహత్య నేరంకాదు

మారుతి శ్రీపతి దుబాల్ బొంబాయిలో పోలీస్ కానిస్టేబుల్‌గా పని చేస్తున్నాడు. అతనికి 19 సంవత్సరాల సర్వీసు ఉన్నది. 1981లో అతనికి రోడ్ యాక్సిడెంట్ అయ్యి తలకు బలమైన గాయాలు తగిలాయి. అతడు మతిస్థిమితం లేనివాడు అయ్యాడు. 1985 ఏప్రిల్ 27వ తేదీన ఉదయం 10 గంటలకు మున్సిపల్ కమిషనర్ ఆఫీసు ముందు బట్టలపై కిరసనాయిల్ పోసుకొని నిప్పు అంటించుకుని ఆత్మహత్యకు ప్రయత్నించాడు. అతని భార్య కూరగాయలు అమ్ముకోవడానికి లైసెన్స్ కోసం దరఖాస్తు పెట్టుకున్నది. కానీ ఇంకా లైసెన్స్ ఇవ్వలేదు. కమిషనర్‌ను చూడబోతే గెంటివేసారు. ప్రాణం తెగించి ఆత్మహత్యకు పూనుకున్నాడు. భారత శిక్షాస్మృతి, సెక్షన్ 309 క్రింద పోలీసులు మేజిస్ట్రేట్ కోర్టులో కేసు పెట్టారు. దానిపై దుబాల్ హైకోర్టుకు రిట్ పిటిషన్ పెట్టుకున్నాడు. హైకోర్టు వారు తీర్పులో ఆత్మహత్య గురించి భారత శిక్షాస్మృతిలో ఎక్కడా వివరణ లేదని పేర్కొన్నారు. ఆత్మహత్యకు, మెర్సీ కిల్లింగ్‌కు భేదం ఉన్నది. ఆత్మహత్య తనంతట తాను ప్రాణ త్యాగం చేసుకోవడం. కానీ మెర్సీ కిల్లింగ్‌లో మరొక వ్యక్తిచే హత్య జరుపబడుతుంది. ఆత్మహత్య వలన మరొక ప్రాణానికి గాని ఆస్తికిగాని నష్టంలేదు. మానసిక వ్యాధుల వలన ఆత్మహత్యకు పూనుకుంటారు. కనుక ఆత్మహత్య నేరం కాదని బొంబాయి హైకోర్టు వారు తీర్పు చెప్పారు. సెక్షన్ 309 ప్రకారం ఎవరైనా ఆత్మహత్యకు ప్రయత్నం చేసినప్పుడు ఆ వ్యక్తికి ఒక సంవత్సరం కారాగార శిక్ష లేదా జరిమానా లేదా రెండు శిక్షలు విధించవచ్చును. కానీ ఆత్మహత్య అంటే ఏమిటో శిక్షాస్మృతిలో వివరణ లేదు. అందుచేత 309 సెక్షన్ భారత రాజ్యాంగంలోని 14వ ఆర్టికల్‌నకు విరుద్ధంగా ఉన్నది. 14వ ఆర్టికల్ విచక్షణకు సంబంధించినది. 300 సెక్షన్‌లో ఆత్మహత్య గురించి వివరణ ఉన్నది. కానీ 309 సెక్షన్‌లో ఆత్మహత్యకు వివరణ లేదు. ఆర్టికల్ 21 ప్రకారం జీవించడానికి హక్కు ఉన్నది. అదే విధంగా జీవితం అంతం చేసుకోవడానికి కూడా 21 ఆర్టికల్‌లో హక్కు ఉన్నది. 309 సెక్షన్ భారత రాజ్యాంగంలో 14, 21 ఆర్టికల్‌లకు విరుద్ధం కనుక 309 సెక్షన్ కొట్టి వేయడమయినది అని బొంబాయి హైకోర్టు వారు 1986 సెప్టెంబరులో తీర్పు చెప్పారు. మహారాష్ట్ర లోని అన్ని కేసులు కొట్టివేశారు. కానీ మిగతా రాష్ట్రాలకు ఈ తీర్పు వర్తించదు. సుప్రీమ్ కోర్టు వారు ఏ విధంగా తీర్పు చెపుతారో వేచి చూడాలి. □

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

నేటి బాలలే రేపటి పౌరులు అనే నానుడి ఎంతవరకు నిజమోకానీ ఇప్పటి బాలలంతా రేపు ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దబడటానికి ఎన్ని అడ్డంకులు ఎదుర్కోవాలో ఆలోచిస్తే ఆందోళన కలగకమానదు.

**మరిన్ని చట్టాలు తేవాలి**

బాలల్ని మూడు తరగతులుగ విభజించవచ్చు 1. గొప్పింట్లో పెరిగే పిల్లలు 2 మధ్యతరగతి పిల్లలు 3 పేదింటి పిల్లలు

గొప్పింటి పిల్లలకు ఏ సమస్యలు వుండవనుకోవచ్చును. అంటే వాళ్లకి ఆర్థిక స్వాతంత్రంతో పాటు తల్లిదండ్రుల అనురాగం, ఆప్యాయత వుంటాయి. ఏ ఒడుదుడుకులు లేకుండా వాళ్ల బాల్యం సాఫీగానే సాగుతుంది.

ఇక మధ్యతరగతి పిల్లల విషయాని కొస్తే వాళ్ళు కూడా కొద్దిగా, ఆర్థిక సమస్యల నెదుర్కొంటున్నప్పటికీ తల్లిదండ్రుల ఆదరణకు లోటుండదు వాళ్ల తిండి, బట్టకు కరవుండదు. తల్లిదండ్రులు ఆర్థిక స్తోమత వున్నా లేకున్నా – తమ పిల్లల్ని ఏదో విధంగా చదివించి వాళ్ల భవిష్యత్తుకు బాటలు వేస్తారు.

ఇక పేదింటి పిల్లల విషయం చూస్తే లోకంలో ఎక్కడ లేని సమస్యలు వాళ్లకే వుంటాయని పిస్తాయి. వాళ్లు తిండి, బట్టకు నోచుకోరు. తల్లిదండ్రుల ఆప్యాయతలసలే వుండవు మరి వాళ్ల చదువు సంగతి అసలు పట్టించుకోరెవరూ. పిల్లల్ని స్కూలుకు పంపటమనేది అసాధ్యంగా తోస్తుంది ఆ పిల్లల తండ్రికి ఆ పిల్లలు కూడా కూలో నాలో చేసి, అర్థో, రూపాయో సంపాదిస్తే చాలనుకుంటారు. పాపం అప్పటి నుంచే వాళ్ల కష్టాలు. ఆరంభమవుతాయి

లేత మొగ్గల్లాంటి పిల్లలు, తెలిసీ తెలియని వయసులో పెద్దలతో సమానంగా కష్టపడవల్సి రావటం శోచనీయం వాళ్లు తల్లిదండ్రుల ప్రేమకే కాకుండా, తాము పని చేసే యజమానుల ఆదరణకు కూడా నోచుకోరు అక్కడ వాళ్ల పని గంటలు పెద్దలతో సమానంగా వున్నప్పటికీ, వారికిచ్చే జీతం పెద్దలకిచ్చే జీతంలో నాలుగో వంతు వుంటుంది ఇంత చిన్న వయసులోనే పిల్లలు, శారీరకంగా మానసికంగా కృంగి పోతారు. ఇలా కష్టాలు అలవడ లేని పిల్లలు చిన్న చిన్న దొంగతనాలు చేస్తూ, లేదా పోకిరీగా తిరుగుతూ దొంగలుగా, హంతకులుగా మారుతూ, సమాజానికి తలనెప్పి కలిగిస్తున్నారు.



రేపు దేశ భవిష్యత్‌ను తీర్చి దిద్దవల్సిన పిల్లలిలా నరకంలోకి నెట్టబడటం అందరూ ఖండించ వల్సిన విషయం.

ఇక తల్లీ దండ్రీ ఎవరో కూడా తెలీని పసి పిల్లల దీనగాథలు చెప్పతరం కాదు. ఏ ఎంగిలాకులో తింటూ, పేవ్ మెంట్ల మీదో, ప్లాట్ ఫారం మీదో నిద్రపోతూ గడుపుతున్న చిన్నారి బాలలెందరో.

పిల్లల విషయంలో ప్రభుత్వ చట్టాలు వాళ్లకేమాత్రం ఉపకరించటం లేదు. పిల్లల వెట్టి చాకిరి నిర్మూలనకి ఎన్ని చట్టాలు వచ్చినా, ఇప్పటికీ మనకు వెట్టిచాకిరి చేస్తున్న పిల్లలెందరో కనిపిస్తారు.




ఈ పిల్లల విషయంలో ప్రభుత్వం చేయాల్సింది ఇంకా ఎంతయినా వుంది. వెట్టి చాకిరీ చేయిస్తున్న వారికి కఠిన శిక్షలు విధించాలి అలాగే చిన్న చిన్న హొటళ్లు, దుకాణాల్లో, కర్మాగారాల్లో పని చేస్తున్న వారికి రక్షణ కల్పించాలి, పనిగంటలు నిర్ణయించి, వారి జీతం వారికష్టానికి తగినంతగా వుండేలా చర్యలు తీసుకోవాలి

అనాథ బాలలకు తగిన వసతి కల్పించి, వారి చదువు విషయంలో శ్రద్ధ చూపాలి. అనాడే ఈ బాలల దీన గాథలకు తెరపడుతుంది.

–ఎం. సత్యకళ,
విశాఖపట్నం □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**చిన్నారి బాలల దీన గాథలు**

రచన పంపిన వారి పేరు ..............................

పూర్తి చిరునామా ..............................

..............................

..............................

పిన్ కోడ్

# ఈ కుటుంబానికి ఇంకా ఆశ వుంది. యునైటెడ్ ఇండియా సహాయం వలన.

పాము కాటు, త్రాగిన కొట్లాట...ఒక దారుణ ప్రమాదం కుటుంబంలోని సంపాదిస్తున్న వ్యక్తిని పొట్టన పెట్టుకున్నప్పుడు భవిష్యత్తు గురించి భయపడకుండా యునైటెడ్ ఇండియా వారికి సహాయం చేయగలదు అటువంటి కుటుంబాల గురించి మీకు తెలిస్తే, ఈ పథకం గురించి వారికి తెలియచేయండి

## భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖవారి వ్యక్తిగత ప్రమాద సాంఘిక భద్రతా పథకం

- సంవత్సర ఆదాయం రూ. 5000 కన్నా తక్కువ వున్న కుటుంబంలోని సంపాదిస్తున్న వ్యక్తి (18–55 సంవత్సరాల మధ్య వయసు) ప్రమాద వశాత్తు మరణిస్తే రూ. 3000 పరిహారంగా చెల్లించబడుతుంది.
- ప్రమాద మరణాల క్రింద పాముకాటు, మునిగి పోవడం, మెరుపు, విషపూరిత ఆహారం, ఆత్మహత్య ఉద్దేశపూర్వకంగా చేసుకున్న గాయం, యుద్ధం మొదలైన వాటినుంచి సంభవించే మరణాలు వుంటాయి. (రోడ్డు/మోటారు ప్రమాదాలు తప్ప)
- పరిహారం జీవించి వున్న భార్య/భర్త లేక ఆధారపడివున్న పిల్లలు లేక ఆధారపడివున్న తల్లి దండ్రులకి చెల్లించబడుతుంది
- ప్రస్తుతం అనంతపూర్, చిత్తూరు, తూర్పు గోదావరి, గుంటూరు, కరీం నగర్, మహబూబ్ నగర్, విశాఖపట్నం, కడప, కర్నూలు, నల్గొండ, ప్రకాశం, శ్రీకాకుళం, వరంగల్ మరియు పశ్చిమ గోదావరి జిల్లాలలో మాత్రమే అమలులో వుంది.

ఇంకా వివరాలకు సమీపంలో వున్న యునైటెడ్ ఇండియా కార్యాలయం, విచారణ మరియు పరిష్కరణాధికారి లేక మండల వికాశాధికారిని సంప్రదించండి.




**యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ కంపెని లిమిటెడ్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియావారి అనుబంధ సంస్థ)
24, వైట్స్ రోడ్,
మద్రాసు 600 014

# ప్రమాద మరణానికి రూ: 3000 పరిహారం

HTA 7061

## సీరియల్

# డి.ఎస్.పి. విజయ్

## ఆమోరి సావిత్రి



(గత సంచిక తరువాయి)

మంచం మీద చెక్కిట చెయ్యి చేర్చుకుని మౌనంగా కూర్చుంది వైజయంతి.

"జయా.. నన్ను క్షమించి... మాట్లాడవూ!? నువ్వునన్ను ఆత్మీయంగా దగ్గరకు చేర్చుకుంటే... నేను నిన్ను పాములా కాటేసి విషంకక్కాను.

ప్రపంచంలో గల సృష్టి మొత్తంలో కృతఘ్నుడెవరంటే... 'మగవాడే' అనుకొనేలా ప్రవర్తించాను. మన్నించు జయా.

మనం పెళ్ళి చేసుకుందాం.మగవాడి దౌర్జన్యం గురించి అనేకానేక కథలు, చరిత్రలు విని ఉన్న నువ్వు నన్ను నమ్మలేక పోవటంలో ఆశ్చర్యం లేదు. అది సహజం కూడా. అయినా అర్థిస్తున్నాను. నన్ను నమ్ము.

నేను దీన్నంతా మానేజ్ చేస్తాను. ఎవరు ఒప్పుకున్నా... ఒప్పుకోక పోయినా మన పెళ్ళి ఆగదు

మా మమ్మీకి ఈ విషయం చెప్పటం అనవసరం. ముందుగా చెప్పటం వల్ల... ఆమె ఒప్పుకోదు సరికదా... మన పెళ్ళి జరక్కుండా అడ్డుపడి సాధిస్తుంది. ఆ మాత్రం బలం... బలగం ఆమెకున్నాయి.

అందుకని ఈ విషయం రహస్యంగా ఉంచి, మనం రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాక ఆమెకి చెపుదాం.

అప్పుడు బహుశా... ఆస్తిలో వాటా ఇవ్వకపోవటం... ఇంట్లో నుంచి బయటకు గెంటెయ్యటం లాంటివి జరుగుతాయి. వాటిల్లో మాత్రమే ఆమె నెగ్గగలదు.

ఇవి నావైపు నుంచి వచ్చే ప్రమాదాలు.

పోతే... నా పేర కొంత బ్యాంక్ ఎకౌంటుంది. దానిమీద నెలకు పదిహేను వందలు వడ్డీ వస్తుంది. దాంతో నాచదువు, మన సంసారపు ఖర్చులు సరిపెట్టుకోవాలి.

పోతే... మీ వాళ్ళకు ముందుగా చెప్పటమా మానటమా అనే విషయం మీద ఛాయిస్ నీది.

జయా... మాట్లాడు జయా నీ మౌనం నన్ను కోసేస్తోంది. నా మీద కోపంగా... అసహ్యంగా ఉంది కదూ? నన్ను తిట్టు... నీ ఇష్టమొచ్చినట్లు హింసించు. కానీ... నాతో మాట్లాడ్డం మానెయ్యకు... జయా..." చూపుడు వేలుతో ఆమె గడ్డాన్ని పైకెత్తుతూ అన్నాడు విజయ్.

"నాకేం కోపంలేదు. జరిగిందాంట్లో నా బాధ్యతేం లేదని నేను అనుకోవటం లేదు విజయ్. అనుకోకుండా ఇలా జరిగేసరికి దిమ్మెర పోయినట్లయింది. భయంగా... దిగులుగా ఉంది. మీరు మోసం చేస్తారనే భయంకాదిది. మీలాంటి వాళ్ళకది చేత కాదు. మీరు చెప్పినట్లే చేద్దాం...

పదిహేను వందలు మనకి ఎక్కి తొక్కి. దాని గురించేం వర్రీ అవకండి. నేను ఎంత పొదుపరినో తెలుసా? మీరే చూద్దురుగాని. మా వాళ్ళకి ముందుగానే చెపుదాం" అన్నది వైజయంతి.

"థాంక్యూ. నీవేపు నుంచి ప్రయత్నాలు ప్రారంభించు. అవి ఫెయిలయినా కూడా నువ్వేం బాధపడకు. ఏం జరిగినా ఈపెళ్ళి ఆగదు. నువ్వునాకు అపురూపంగా లభించిన వరానివి. నిన్ను పోగొట్టుకునేంత పిరికివాడిని కాను నేను". అన్నాడతను...

ఇద్దరి మనసుల్లోనూ పేరుకున్న దిగులు.. భయం... సిగ్గు తొలగిపోయి ప్రశాంతంగా అయ్యాయి...

* * * * *

అక్కడ నుండి ఇంటికొచ్చేశాక కూడా విజయ్‌లో ఆ కొత్తదనం తాలూకు మధురిమ ఛాయలు తొలగిపోలేదు. ఆ మత్తు... తీపి అలాగే ఉన్నాయి.

ఆమె పట్ల ఒక బాధ్యత... అనురాగం అతని మనసులో ప్రవేసించి, పెద్దరికాన్ని కలిగిస్తున్నాయి.

ఇపుడతనికి ఒంటరితనం లేదు.

ఆమె గురించిన ఆలోచనలు... అనుభూతులూ అనుక్షణం తోడుగా ఉంటున్నాయి...

ఒకానొక జడత్వం నుంచి చైతన్యవంతుడైనట్లు ఫీలౌతున్నాడు... ప్రతి స్పందనా... ప్రతి భావనా ఆమెకే అనువదించుకుంటున్నాడు. ఇదివరకు ఏ భావాన్ని కలిగించని ప్రతి సంఘటనా ఇప్పుడు తియ్యని అనుభూతిగా మారుతోంది.

రేడియోలో "మదన మనోహర సుందర నారీ... మధుర దరస్మిత నయన చకోరీ..." ఘంటసాల కంఠంలో నుంచి గంభీరంగా, తియ్యగా సాగుతున్న పాట జయను కళ్ళ ముందుంచుతోంది...,

ఆమె నడిగి తెచ్చుకున్న... వాడిన సంపంగి పువ్వులో... తన పర్సు కంటిన తిలకం... కాటుక మరకల్లో...

బుజాన్ని ఇంకా వదలని మల్లెల సౌరభంలో ఆమెతో కూడిన స్పందనల తాలూకు మధురిమలే...

వైజయంతిని పెళ్ళి చేసుకోవటంలో ఎదురయ్యే చిక్కుల గురించి అతనాలోచించటం లేదు...

అతని మీద అతనికున్న ఆత్మవిశ్వాసం... మనస్థైర్యం సామాన్యమైనది కాదు.

* * * * * * *

వైజయంతి పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా ఏంలేదు. కానీ... ఈ విషయమ్ము తల్లిదండ్రులకెలా చెప్పాలో తోచటంలేదా అమ్మాయికి. తల్లితో చెపుదామన్నా ఎక్కడో ఏదో అడ్డుపడుతున్నట్లుంది. ఆమెతో ఇంత డెలికేట్‌గా ఉండే సన్నివేశాన్ని తనెప్పుడూ ఎదుర్కొనలేదు.

జరిగిన కథ -20 : విజయ్ చిన్నతనంలో అనుభవించిన ఒంటరితనాన్ని, తల్లిదండ్రుల నిరాదరణను, వైజయంతి పరిచయాన్ని గుర్తు తెచ్చుకుంటాడు. వైజయంతితో పరిచయం, వాళ్ళ ఇంట్లో ఆదరణ క్రమక్రమంగా విజయ్, వైజయంతిల మధ్య అనురాగానికి దారి తీస్తాయి. అనుకోని పరిస్థితిలో వాళ్ళిద్దరూ ఏకమవుతారు.

ఎలా?

ఆమెకు మాత్రం చెప్పి తీరాల్సిందే.

తన తరఫున రాయబారం నడపటానికి తనకో అక్కయినా లేదు!

తను అప్పుడే పెళ్ళి కోసం తహ తహలాడి పోతున్నా... ఇలా బయట పడాలంటే ఇబ్బందిగా ఉంది.

కానీ... రోజులు గడిచేకొద్దీ ఏదైనా అనివార్య సంఘటన జరిగితే... అది మరీ బాధ.

వాళ్ళు ఒప్పుకుంటారా అనే విషయంకన్నా ఎలా చెప్పాలీ అనే బాధే ఆమెనెక్కువ వేధిస్తోంది.

తల్లి దగ్గర తనకు చనువుంది కానీ... ఇలాంటివి చర్చించగలగినంత లేదు.

అసలిలాంటివి ఏ ఆడపిల్లయినా తనంతట తను చెప్పుకోగలదా?...

"పోనీ...నేను చెప్పనా?" అన్నాడు విజయ్.

అతను చెపితే బాగోదు. సమయం చూసి చెప్పాలి. ఆ సమయా సమయాలతనికెలా తెలుస్తాయి?

ఏ రోజు చెప్పాలనుకున్నా... భయంగా... టెన్షన్‌గా అనిపిస్తోంది వైజయంతికి.

"రేపు చెబితే సరి". అనుకుంటే రిలీఫ్‌గా ఉందా రోజుకి. ఈ రెంటికీ మధ్య నలిగిపోతోందామె.

"చెప్పెయ్యి జయా. ఎప్పటికయినా ఇలాంటి సన్నివేశాన్ని ఎదుర్కోక తప్పదు గదా?" అంటాడు విజయ్.

అతసలా అన్నప్పుడు "ఈ రోజు తప్పక చెప్పాలి" అనుకుంటుంది. ఇంటికొచ్చి తల్లి ముఖం చూడగానే ఆ నిశ్చయం తన పట్టును కోల్పోతోంది...



## నను నచ్చిన సన్నివేశం

"ఒక రాజకీయనాయకుడు ఎంత దుష్టుడయినా, ఎలాంటి గూండాయిజం చెలాయించినా ఎంత నీచంగా ప్రవర్తించినా ప్రజలు అతన్నే మళ్ళీ మళ్ళీ గెలిపిస్తూనే ఉంటారు" అని డి యస్ పి విజయ్ తనలో తను అనుకొనే ఈ సన్నివేశం ఎంతో సహజంగా ఈ నాటి ప్రజల యొక్క బలహీనతని, నిర్లక్ష్యాన్ని తెలుపు తున్నది ప్రజల అమాయకత్వానికి అద్దం పట్టినట్టుగా ఉన్న ఈ సన్నివేశం నా కెంతో నచ్చింది ఇటువంటి సన్నివేశాల ద్వారా ప్రజలలో ఉన్నటువంటి అజ్ఞానాన్ని పోగొట్టి ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసి సమాజ శ్రేయస్సు కోసం పనికి వచ్చే వారెవరో వారికే ఓటు వేసి తమ ఓటు విలువని, సమాజాన్ని కాపాడు కొనే లాంటి భావము కలిగించే ఉత్తమ మైన రచన చేసినటు వంటి ఈ రచయిత్రికి నా ధన్యవాదాలు

– కె. పద్మావతి, పాలకొల్లు

★ ★ ★

శ్రీధర్ మనస్తత్వం చదివి మనిషిలో మనిషి ఇంత భయంకరంగా వుంటాడా అన్పించింది పైకి అందంగా, సభ్యతా సంస్కారాలకు ప్రతి రూపంగా కన్పిస్తూ, హోదా అయిన వుద్యోగాలు చేస్తూ కన్పించే మనుషుల్లో క్రూర మృగాలు, విష పురుగులు కూడా వుంటాయి అని నిరూపించింది శ్రీధర్ పాత్ర తెలీక అతని వ్యామోహంలో పడిన సౌందర్య చివరికి శ్రీధర్ ఎటువంటి వాడో తెల్సుకొని ఆత్మహత్య చేసుకోక ధైర్యంగా విజయ్ అండతో అతనితో రాజీ



పడినట్లు నటించి విజయ్‌కు పట్టించడం, విజయ్ అతన్ని సాక్ష్యాధారాలతో పట్టు కోవడం చాలా బాగుంది. అందమైన మగవాడి మాటల మోహపు మంటల్లో పడి శలభాల్లా మాడి పోకుండా యువతులను హెచ్చరించేదిలా వుందీ సన్నివేశం.

– ఎ. మల్లిక, కళ్యాణదుర్గం, (అనంతపురం)

"మమ్మీ నేనేమడిగినా చేస్తుంది. కానీ తన దగ్గరే నన్ను ఉంచుకోమంటే మాత్రం ఒప్పుకునేది కాదు నేను ఏడిస్తే మమ్మీ కూడ ఏడిచేది అందుకే నేను అస్సలు ఏడవను మమ్మీ నా దగ్గర్నించి వెళ్ళిపోయే టప్పుడు ఏడుపొచ్చినా ఆపుకుంటాను తనెళ్ళి, పోయాక ఏడుస్తాను తను నా కోసం ఏడుస్తూనే వుండి ఉంటుంది మమ్మీకి నేనంటే ఎంత ఇష్టమో' నానీ తన తల్లి కోసం పడే తపన, ఆవేదన ప్రతి అక్షరములోనూ నిండి వుంది నానీ ఆవేదనను ఇంత వివరముగా



## డి. ఎస్. పి. విజయ్

ఆ రోజు తెగించి చెప్పేయ్యాలనుకుంది వైజయంతి. పిల్లలు, తండ్రి స్కూల్‌కెళ్ళి పోయాక తల్లికి ఆ పనీ ఈ పనీ చేస పెడుతూ తను ఇంట్లోనే ఉండిపోయింది

"ఈ రోజు కాలేజీ లేదా?" అన్నది అరుంధతి.

"ఉంది కానీ... ఒంట్లో బాగో లేదమ్మా" అన్నది వైజయంతి.

"ఏం ఏమయింది? ఒళ్ళు వెచ్చబడిందా?"

"లేదు"

దిష్టో పాడో తగిలుంటుంది కాస్త ఉప్పు దిగదుడిచి పోసా [illegible]




పడుకో. ఈ పనులు నేను చూసుకుంటాలే". అన్నది అరుంధతి.

ఆమెకు పిల్లలంటే చాలా ప్రేమ. పొరపాటునయినా వాళ్ళని విసుక్కోదు.

తల్లి 'ఉప్పు దిగదుడుస్తుంటే నవ్వొచ్చినా వారించలేదు వైజయంతి

ప్రస్తుతం తల్లికి వ్యతిరేకంగా ఏమీ చెయ్యదలుచుకోలేదు. అరుంధతి అన్నం తిని వచ్చి తీరుబడిగా పడుకుని ఉంటే, తనూ తేచెళ్ళి ఆమె పక్కన పడుకుంది వైజయంతి.

తల్లితో ఎంత చనువుగా మసులుతున్నా, ఏదో భయం . వెరుపు ఆమెను వెనక్కి లాగుతున్నాయి

"అమ్మా... నేనోటి అడుగుతాను. కోప్పడవు గదా?" అన్నది వైజయంతి.

"ఏమిటే అది?" అన్నది అరుంధతి

"నువ్వు తిట్టనంటే "

'నిన్ను నేను ఎన్నిసార్లు తిట్టానేమిటి?"

'ఇప్పుడు మాత్రం తిడతావు".

"ఏమిటంత తిట్టించుకునే విషయం?"

తనకు బంధం వెయ్యటానికి కూతురు చేస్తున్న ప్రయత్నం దేనికో అరుంధతి కర్థం కావటంలేదు

"తిట్టనని వాగ్దానం చెయ్యి ముందు" అన్నది వైజయంతి.

'తిట్టను " సిన్సియర్‌గా అన్నది అరుంధతి

"నేను నేను. "

"ఇంకా భయమేనా?"

"నేను నేను విజయ్ ."

అరుంధతి కర్థమయింది

విపులీకరించడం రచయిత గారి రచనా శైలికి ఒక మచ్చు తునక. తల్లి మనస్సును అర్థం చేసుకొని తను ఏడిస్తే తల్లి ఎక్కడ ఆవేదన చెందుతుందో అని నానీ అలా ఏడవక పెద్ద తరహాగా నటించడం– నాకు ఆ సన్నివేశం చాలా బాగా నచ్చింది.

– యు. అరుణ, కర్నూలు

★ ★ ★

ఒక వ్యక్తి తన మంచితనంతో సంఘంలో ఒక గౌరవ స్థానాన్ని పొందితే చూసి ఓర్వ లేనివారు ఎంతో మంది. ఆ వ్యక్తే ఒక బాధ్యత గల పోలీసాఫీసరై, రాజకీయ నాయకుల చేతిలో కీలు బొమ్మకాక, వారి పనుల కడ్డొస్తూ, ప్రజలకు దగ్గరవుతుంటే అతన్ని మట్టుపెట్ట డానికి ఆఖరి ఆయుధంగా విద్యార్థులను ఉపయోగించు కుందా మంటూ ఎమ్. ఎల్. ఏ. ధర్మారావు. "వాడు స్థానికంగా అంత బలపడటం మంచిది కాదు. నాకు చాలా దెబ్బది. పోనీ . ఇందుకు స్టూడెంట్స్‌ని ఉపయోగించుకుంటే? వాళ్ళయితే తేలికగా మన ట్రాప్‌లో పడి, అక్షరాలా మనం చెప్పినట్లు చేస్తారు. ఏదో ఒక



ప్లాన్ వేసి వాళ్ళను బాగా రెచ్చగొడితే.... ఆ ఆవేశాన్ని, అవివేకాన్ని మనం వాడుకో వచ్చు."

ఈ సన్నివేశంలో, రాజకీయ నాయకుల దృష్టిలో, విద్యార్థుల స్థానం ఏ పాటిదో, అసలు విద్యార్థులంటే ఆవేశం తప్ప ఆలోచనలేని వారన్న అభిప్రాయాన్ని, కొద్ది మాటలతో చక్కగా వివరించారు రచయిత్రి. ప్రతి విద్యార్థి చదవాల్సిన సన్నివేశమది

– బి. సావిత్రి, తిరుపతి

★ ★ ★

"ఈ ప్రపంచం ముఖం చూడ్డాని కేమయింది మీకు? కుళ్ళు .. క్రూరత్వం... దగా .. వంచనలతో నిండి వున్న ఈ సమాజం మీలాంటి అమాయకు రాళ్లని చూసి తనే సిగ్గుతో తల వంచుకోవాలి. జరిగిందాంట్లో మీ తప్పేముంది?.. "

విజయ్ మాటలు చదువుతూంటే "జీవితంలో తనకు మనుగడే శూన్యమని భావించే నిరాశా నిస్పృహలతో నిండిన వారికిదో మంచి బోధన" అని నాకు అనిపించింది. అందుకే ఈ సన్నివేశం నాకెంతగానో నచ్చింది రచయిత్రికి



అభినందనలు.

సూరిశెట్టి చిన అప్పారావు,
గవరపాలెం, అనకాపల్లి



"ఇప్పటికి నా పగ చల్లారింది. బయటకొచ్చాక కూడా నీ బ్రతుకు కుక్క బ్రతుకే జీవితాంతం కుళ్ళి కుళ్ళి చావు. నీలాంటి వెధవలందరికి ఇలాంటి కఠిన శిక్షలు పడ్డ నాడు, ఇహ జన్మలో ఎప్పుడూ ఏ మగాడు ఆడదాన్నిలా పైశాచికంగా తన స్వార్థాని కాహుతి చెయ్యటానికి సాహసించడు..."

శ్రీధర్ లాంటి వెధవలను తగిన బుద్ధి తెచ్చుకోమంటూ, ఆవేశంతో సౌందర్య అంటున్న ఈ సన్నివేశం నా కెంతగానో నచ్చింది .

పోల చినసత్యనారాయణ,
విజయనగరం □

---

వెన్ను జలదరించినట్లయింది...

"అతని గురించి అలాంటి ఆలోచనలు పెట్టుకోకు. వాళ్ళమ్మ విన్నదంటే మనని ఈ చుట్టుపట్ల కూడా ఉండనివ్వదు!" మందలింపుగా అన్నది అరుంధతి.

"వాళ్ళమ్మ సంగతెందుకు? అతను నేనంటే ఇష్టపడుతున్నాడు" అన్నది వైజయంతి.

"నువ్వూ అతన్నిష్ట పడుతున్నావుగా?"

"అతను... నన్ను పెళ్ళి చేసుకుంటానంటున్నాడు".

"ఆ వయసులో ఆలోచనలలాగే ఎదిగీ ఎదగకుండా కేవలం ఉద్రేకం ప్రాధాన్యతగా ఉంటాయి.

మన స్థోమతుకు తగినంతలో నీకు మంచి సంబంధమే, తెచ్చి పెళ్ళి చేస్తాం.

ఈలోగా తొందరపడి... అందని వాటి కోసం అర్రులు చాచి జీవితాన్ని దుఃఖమయం చేసుకోకు."

అప్పుడిహ జరిగిన సంగతి చెప్పక తప్పలేదు వైజయంతికి. సిగ్గుపడుతూనే చెప్పింది.

అంతా విని నిర్ఘాంతపోయింది అరుంధతి. ఆ పిల్ల తొందరపాటుకు కాస్త కోపం కూడా వచ్చింది.

విజయ్ గురించి ఆమె అంచనాలింత నేలబారుగా లేవు.

"ఇంకో నాల్రోజులు పోయాక అతనెళ్ళి హఠాత్తుగా అమ్మ చాటున దాక్కుంటాడు. ఈమాత్రం ఆలోచన రాలేదా నీకు? నిన్ను నమ్మి నీకు స్వాతంత్ర్యం ఇస్తే... దాన్నిలా దుర్వినియోగం చేస్తావన్న మాట." నిష్ఠూరంగా అన్నది అరుంధతి.

"విజయ్ అలాంటి వాడు కాదు. రిజిస్ట్రారాఫీస్‌కి అప్లికేషన్ కూడా పెట్టాడు.

అంటూ అతను చెప్పినవన్నీ ఏకరువు పెట్టింది వైజయంతి.

ఇప్పుడా అమ్మాయిలో ఇందాకటి భయం పోయి, ఎలాగైనా తల్లిని ఒప్పించాలనే తహతహ చోటు చేసుకుంది...

పూర్వపు చనువు వచ్చేసింది.

"అమ్మా... అమ్మా! నువ్వే ఎలాగో నాన్నగార్కి నచ్చచెప్పమ్మా. విజయ్ అందరిలాంటి వాడు కాదు. నీకు మాత్రం తెలీదా? అమ్మా..." అంటూ తల్లిని బ్రతిమాలటం ప్రారంభించింది.

"ఇప్పుడు శమంతకమణి ఏమంటుందో తెలుసా?" అన్నది అరుంధతి.



## డి. ఎస్. పి. విజయ్

"ఏమంటుంది?"

"ఆస్తి కోసం ట్రిక్కులన్నీ ప్రయోగించి కొడుకును వల్లో వేసుకున్నారంటుంది".

"ఆస్తి ఒదులుకుని అతను బయటకొచ్చేస్తున్నాడుగా?"

"అయినాసరే! కట్నం లేకుండా బంగారం లాంటి కుర్రాణ్ణి కొట్టేశారు అంటారు. ఎన్నెన్నో అడుగుతారు".

"ఒకళ్ళు ఏదో అనుకుంటారనే సంకోచం పెట్టుకుంటే మనం ఏదీ చెయ్యలేం...

దేనికో దానికి ఎవరో ఒకరు ఏదో ఒకటి ఎప్పుడూ అనుకుంటూనే ఉంటారు..."

"సరే మీ నాన్నగారికి చెపుతాను".

"చెప్పటం కాదమ్మా. ఒప్పించాలి."

"చూద్దాం".

"చూద్దాం కాదు... చేద్దాం అను".

"సరే చేద్దాం". అన్నది అరుంధతి.

ఆమెకు విజయ్ అంటే అయిష్టమేం లేదు. శమంతకమణి గురించి భయపడుతోందంతే.

విజయ్ తన వాగ్దానం మీద ఎంత వరకూ నిలబడగలడు అనే విషయాన్ని అంచనా వేసుకోలేక పోతోందామె.

అసలీ పెళ్ళి జరుగుతుందా

ఏదైనా రసాభాస అవుతే ఏం చెయ్యాలి?

దాన్నీ పిల్ల ఎలా తీసుకుంటుంది? అప్పుడు దీని భవిష్యత్తేమిటి?

అతని మాటల్ని నమ్మి తమ మద్దతు ప్రకటించటం ఎంత వరకూ సబబు?

ఈ విషయాలు తేల్చుకోలేక పోతోంది అరుంధతి.

ఒకర్నొకరు అంతగా ఇష్టపడుతున్న ఆ జంటను విడదియ్యాలని ఆమె అనుకోవటంలేదు. ఎదిగిన పిల్లల ఆలోచనలకు తగినంత విలువ ఇవ్వాలనే సంస్కారం ఆవిడకుంది.

కానీ... ఇలాంటి సంస్కారం ఒక్కటే పెళ్ళిళ్ళు జరగటానికి తోడ్పడదని ఆమెకు తెలుసు.

అందుకే ఈ భయం.

దానికే ఈ ఆలోచన...

తల్లినా టెన్షన్‌లోకి తోసేసి తను రిలాక్సవుతోంది వైజయంతి...

★ ★ ★ ★ ★ ★ ★




భార్య చెప్పిన దాన్ని సావకాశంగా విన్నాడు మాధవరావు. రాత్రి భోజనాలయ్యాక... చిన్న పిల్లలు నిద్రపోయాక తీరికగా ఈ విషయం కదిపింది అరుంధతి.

కాస్త టైం తీసుకునే విషయమైతే అప్పుడు మొదలుపెడుతుందామె.

ఏ విధమైన డిస్టర్బెన్స్ లేకుండా... వాద ప్రతివాదనలకు కావలసినంత సమయం తీసుకుని ఏ సమస్యనయినా పరిష్కరించుకోటానికి అనువైన సమయం అదే.

"శమంతకమణి గారికి తెలీకుండా వాళ్ళు పెళ్ళి చేసుకోవాలనుకోటం... దాన్ని మనం ప్రోత్సహించటం నాకు నచ్చలేదు. అలాంటి పన్లు చెయ్యకుండా వాళ్ళని మందలించటం పోయి సపోర్ట్ చెయ్యటం విజ్ఞత అనిపించుకోదు. మనకి జయ ఎంతో వాళ్ళకి విజయ్ కూడా అంతే. ఆవిడకి తెలియకుండా అతనికి మన పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యటం సభ్యత కాదు. నేను దీన్ని అంగీకరించను" అన్నాడు మాధవరావు.

"చెపితే... ఆవిడ ఒప్పుకోదు..." అన్నది అరుంధతి.

"ఒప్పుకున్నా ఒప్పుకోక పోయినా... చెప్పటం మన బాధ్యత".

"......"

"తప్పు చేసిన వాళ్ళకన్నా... ఆ తప్పును ప్రోత్సహించిన వాళ్ళు ఎక్కువ నేరస్థులు నా దృష్టిలో".

ఇదంతా వింటూనే ఉంది వైజయంతి.

కొంపతీసి... తండ్రి గనక ఆవిడతో చెప్పేశాడంటే... ఇహ తనూ విజయ్ ఒకటవటం కల్ల. ఎలాగైనా సరే ఈ పెళ్ళి ఆపేసి, విజయ్‌ని తననుంచి వేరు చెయ్యగల కెపాసిటీ ఆవిడకు పుష్కలంగా ఉంది.

పెళ్ళి గనక జరిగిపోతే తమకు చట్టబద్ధంగా రక్షణ ఉండటమే కాకుండా... అప్పుడంత హోప్స్ ఉండదామెకు.

'నిజాయితీ... సత్య సంధత' అంటూ తన తండ్రే తాము విడి పోవటానికి కారకుడవడుగదా?

అసలిదంతా వీళ్ళకి చెప్పి తను పొరపాటు చేసిందా? తన భయాలూ అనుమానాలూ ఆయనముందుంచి "నాన్నా మీ రిలాచెయ్యొద్దు." అనాలన్నంత ఉద్రేకాన్ని బలవంతాన అణుచుకుంటోంది వైజయంతి.

తల్లి ఎంత చెప్పినా తండ్రి తన పట్టు విడవలేదు....

"నేనొచ్చి మాట్లాడతానుండు." అన్నాడు విజయ్.

"పోనీ... మీ అమ్మగారి క్కూడా ఇలానే చెప్పేస్తే?" అన్నది వైజయంతి.

"చెప్పేస్తే.... ఆవిడ మీ వాళ్ళ లాగా ఇంత శాంతంగా... తీరికగా చర్చలు జరుపుతూ కూర్చోదు.

తన స్థాయి కన్నా దిగువనున్న అమ్మాయి నామె కోడలుగా అంగీకరించదు. మానసికంగా మనని చిత్ర హింసలు పెడుతుంది. ఈ పెళ్ళి జరగకుండా నాలుగు పక్కల నుంచీ బంధిస్తుంది."

"ఏం చేద్దామయితే?" దిగులుగా అన్నది వైజయంతి.

"నీకెందుకు నువ్వూరుకో. నే చెపుతాను". అంటూ తనే మాధవరావు దగ్గర కెళ్ళాడు విజయ్....

తన సమస్యను అన్ని కోణాల్లో నుంచీ ఎనలైజ్ చేసి చూపాడాయనకు...

విజయ్ మాటల్లో ఎక్కడా తడబాటు.... తొందరపాటు లేక పోవటం..... హేతు బద్ధమైన అతని వాదన.... ముందుగానే జాగ్రత్తగా అన్నీ ప్లాన్ చెయ్యటం.... ఇవన్నీ మాధవరావు మీద కొంత వత్తిడి తెచ్చాయి. అరుంధతితో వాదించినట్లు విజయ్‌తో వాదించలేక పోయాడాయన.

ఒకదశలో "మీరిహ వాదించకండి. నాకు నచ్చచెప్పే ఓపిక కూడా పోతోంది." అని విజయ్ అనే సరికి అయిష్టంగానే విజయ్ ప్రపోజల్‌నంగీకరించాడాయన.

పెళ్ళికి ముందుగానే విజయ్ ప్రోద్బలం మీద వాళ్ళు ఔట్ హౌస్ – ఖాళీ చేసి వెళ్ళి పోయారు.

# మూడు మంచి గుణాలు




మూడు గుణాలు అనేసరికి అందరికీ వెంటనే జ్ఞప్తికి వచ్చేవి సత్వ రజస్తమో గుణాలు. ఇవి ముఖ్యంగా ఆధ్యాత్మిక విషయానికి సంబంధించినవి! ఇవి కాక ఇంకా మరెన్నో గుణాలు కానవస్తాయి. వాటిలో ముఖ్యమైనవి మూడు. అవి ఉత్తములకు ఉండే గుణాలు! ఇతరులలో అవి గోచరించవు.

తమ సంగతి ఎలాగున ఉన్నా, ఇతరులను గురించిన విషయాలను తెలుసుకోవాలనే కుతూహలం మనలో చాలామందికి ఉంటుంది. వారిని గురించి తెలుసుకుని మంచిని ప్రచారం చేసినా, చెయ్యకపోయినా చెడ్డను మాత్రం ప్రచారంలోకి తీసుకుని వస్తారు. "ఇతరుల సంగతి మనకెందుకు?" అని అనుకోరు. ఉత్తములు మాత్రం అలా ప్రయత్నం చేయరు. ఇతరులను గురించి తమకు తెలిసినా మౌనం వహిస్తారే గాని చాటరు. వారు నిండు కుండ వంటివారు. నిండు కుండ తొణకనట్లు, వారు నోరు విప్పరు. చాటేవారు ఖాళీ డబ్బాల వంటివారు. ఖాళీ డబ్బాలు డబ డబా ధ్వని చేసినట్లు, వారు నోరు మూసుకొని ఉండక వాగుతూ ఇతరులను విమర్శిస్తూ ఉంటారు. ఇది ఉత్తమ లక్షణం కాదు. నీతి శాస్త్రం "నాల్పోప తాపి వచనం మౌనం వ్రతవరిష్ణుతా" అని ఇతరులకు బాధ కలిగించే స్వల్పమైన మాటనైనా పలుకక మౌనం వహించడం మేలు" అని అంటున్నది. ఇలా మౌనం వహించడం ఉత్తముల మంచి గుణాల్లో ఒకటి. ఇక రెండవది– బలవంతులు, శక్తి సామర్థ్యాలు ఉన్నవారు తమకు స్వల్పంగా అపకారం చేసినా ఎదుటి వారిని చంపడానికి కూడా వెనుక తియ్యరు. వారి ఉద్రేకం అటువంటిది. శాంత గుణం వారిలో పూర్తిగా నశిస్తుంది. కాని ఉత్తములు తమకెట్టి శక్తి సామర్థ్యాలు ఉన్నా తొందరపాటున తమకు అపకారం చేసిన వారిపయి బలప్రయోగం చెయ్యరు. శాంతాన్నే వహించి ఉంటారు. అలా శాంతం వహించడం వల్ల ఎదుటి వారికి పశ్చాత్తాపం కలిగి క్షమాపణ వేడుకొనడం జరగవచ్చును. "శక్తానాం భూషణం క్షమా" అని చాణక్య నీతి. ఈ నీతిని పాటించే వారే ఉత్తములు.

మూడవ గుణం దానానికి సంబంధించినది. కొందరు, తమ్ము అందరు మెచ్చుకోవాలనే అభిప్రాయంతో నే దానం చేస్తారు. "ఇట్టి దానం చేశాను. ఇలా త్యాగం చేశాను" అని నలుగురితోనూ చెప్పుకోవడం కూడా అట్టి వారికి స్వభావమే! ఉత్తములు పేరు కోసం దానం చెయ్యరు. వారు గొప్పగా దానం చేసినా, చేసినట్లు చాటుకోరు. వారు చాలా వరకు గుప్త దానాలే చేస్తారు. అంటే ఇచ్చిన వారి పేర్లు తెలియని దానాలన్న మాట! "నదత్వా పరికీర్తయేత్" అని మను స్మృతిలో చెప్పబడినది! దానం ఇచ్చి, ఇచ్చినట్లు చాటుకోకూడదని దీని అర్థం. ఉత్తములీ ధర్మాన్ని పాటిస్తారు. ఈ మూడు గుణాలూ అత్యుత్తమాలని అందరూ అంగీకరిస్తారు.

– బులుసు వేంకటరమణయ్య

మాధవరావు కిదంతా గిల్టీగా ఉంది. ఇలాంటి ఇరకాటంలోకి తనను తోసిన వైజయంతి మీద అసంతృప్తిగా అంది.

"వైజయంతి మీకు చెప్పి, మీ అనుమతి కోరిందంటే.... మీ ఇంటి వాతావరణం... ఒకరంటే ఒకరికి గల అభిమానం... చనువు.... గౌరవం కారణాలు.

ఇలాంటి అనుబంధాలు అప్యాయతలు మా మధ్య లేవు.

బిడ్డ తల్లిని అమ్మా అనిపిలవటం..... తల్లి బిడ్డని ఒడిలోకి తీసుకుని లాలించటం.... పిల్లలు అలగటం.... తల్లులు బ్రతిమాలటం... ఆ చనువు... దగ్గరతనం మాకులేవు. మా సొసైటీలో ఇవన్నీ చాలా హేయమైన విషయాలు.... ప్రతిదానికీ డిసిప్లిన్..... డిగ్నిటీ! ఇవేమాకు తెలిసిన బంధాలు....

అనురాగం లేని చోట బాధ్యతలు కూడా ఉండవు.

మమ్మీ అంటే నా కున్నది కేవలం భయం. వయసుతో పాటు అదీ తగ్గుతూ ఒచ్చింది.....

ఎలాగైనా ఆమెను ఒప్పించి, ఆవిడ చేతుల మీదుగా నా పెళ్ళి జరిపించుకోవాలనే తహతహ నాకు లేదు.

బహుశా.... ఆవిడకూ ఉండదు.

కేవలం ... మా అంతస్థుకి తగని అమ్మాయి ఆ ఇంట్లో అడుగు పెట్టటం సహించ లేకనే ఆవిడ నా పెళ్ళి విషయం ఇంతగా పట్టించుకుంటుంది.....

తన హోదాకు తగ్గ అమ్మాయి... మా సర్కిల్‌లో మా అలవాట్లు, భేషజాలు జీర్ణించుకు పోయిన అమ్మాయిని తెచ్చి నాకు పెళ్ళి చేస్తుంది.

మళ్ళీ మొదలు....

భార్యా భర్తల మధ్య .... తల్లీ బిడ్డలమధ్య .... తండ్రీ కొడుకుల మధ్య డిసిప్లిన్..... స్తబ్ధత .... మెకానికల్ లైఫ్..... ఈ చక్రబంధం నాకొద్దు.

నా విషయంలో .... తిరిగి ఈ చరిత్రను పునరావృతం కానివ్వను.

నాకు రవ్వంత అప్యాయత కావాలి....

దాన్ని నా భార్య నా కివ్వగలగాలి.

నేను, నా భార్యా బిడ్డలు అప్యాయతానురాగాలతో... ఆర్ద్రత నిండిన మనసులతో చనువుగా మసలగల దగ్గరతనాన్ని కలిగి ఉండాలి.

మీ ఇంటి వాతావరణం తిరిగి నా ఇంట్లో ప్రతిఫలించాలి.

వైజయంతి నాకు నచ్చింది. అలా నచ్చటానికి కారణం ఆమె అంద చందాలుకాదు. అదేమిటో నేను మీకింకా వివరించి చెప్పాల్సిన అవసరం లేదు."

స్థిరత్వం కూడిన విజయ్ మాటలు.... అతని వ్యక్తిత్వం మాధవరావుని నోరెత్తనివ్వటం లేదు.

(ఇంకా ఉంది)



# వారఫలం

## 11-12-1987 శుక్రవారం మొదలు 17-12-1987 గురువారం వరకు

★ **మేషం :** వ్యాపారం చేసేవారు మీరయితే, తెల్లని వస్తు విక్రయానికి అనుకూలం. ప్రతిభా సంపత్తికి ఆస్కారం. రచయితలయినా, పత్రికా వ్యవస్థయందున్నా అనుకూలమే. స్త్రీలకు: సుఖానందం, సంతానం వలన ఏదో మేలు చేకూరుతుంది.

★ **వృషభం :** విపరీత యోగ సమయం ప్రసిద్ధులయిన వ్యక్తుల సహకారమున్నది. 'అవును, కాదు' అనుకొన్న వ్యవహారం ఏదో రకంగా అనుకూలం మీరు ఉద్యోగం చేస్తారా 'ప్రమోషన్' రాలేదా నిశ్చయంగా ఈ వారం అనుకూలం స్త్రీలకు విడిగా జరుగదగిన పనులు అనుకూలం

★ **మిథునం :** ఆదాయమున్నది శుభ కార్యాలోచనకు అవకాశం చేసే ఉద్యోగంలో అనుకూలం, శుభ కార్యం జరుగుటకు యత్నాలు చేయగలుగుతారు. చలన చిత్ర రంగాన యత్నం చేసినా, ఉద్యోగ యత్నం చేసినా అనుకూలం. స్త్రీలకు: వృత్తి రీత్యా వికాసం, ఆరోగ్యమందు అనుకూలం

★ **కర్కాటకం :** వారంలో ఎంత యత్నించినా ఆశించిన మేలు చేకూరుటకు ఆస్కారం లేదు చిత్ర రంగానుకూలత చెప్పదగిన అంశంగాదు. శుభ కార్యానుకూలతకు కూడా ఆస్కారం లేదు ముఖ్య బంధు సమాగమం, గ్రహించాలి స్త్రీలకు వృత్తి యందు అనుకూలమే గాని ఆశించినట్లు జరుగదు

★ **సింహం :** చాల మందికి ప్రయాణావకాశాలుంటాయి, అలా జరగటం మేలే 'రోడ్డు' ప్రమాదాలు రాకుండా కూడా యత్నించటం న్యాయం అధికారుల వలన జరుగవలసిన పనులు సానుకూలమవుతాయి స్త్రీలకు వృత్తి యందు ఉద్యోగ మందు ఆశించిన మేలు చేకూరుట నిశ్చయం.

★ **కన్య :** కాని వర్గమున్నదని, ఏదో యిబ్బంది చేకూరగలదని, ఎవరి వలననో అనానుకూలత చేకూరగలవని, లాభదాయక విషయాలందు జోక్యం ఉంటుందని గ్రహింపగలుగుతారు. స్త్రీలకు : ఎంతో కాలంగా ఆశించి అనుకూలంగా ఉద్యోగ యత్నం, వృత్తి యందు అనుకూలం చేకూరుట నిశ్చయం.

★ **తుల :** ఈ రాశి జాతకులకు వారాంతం మాత్రమే శ్రేష్ఠం. ఒకటి రెండు గ్రహాలు 'రాహు, గురువులు' ఏదో అనుకూలత, ద్రవ్య విషయంగాగాని, అధిక వ్యయం గాని కనిపించవచ్చు. స్త్రీలకు : వృత్తి యందు, ఉద్యోగ రీత్యా మేలున్నది, గ్రహించాలి

★ **వృశ్చికం :** ఇప్పుడిప్పుడే రాశికి పెంపు చేకూరుతుంది వార గ్రహఫలం అనుకూలం. శుభానుకూలం రాజకీయంగా అనుకూలం. 'ఉద్యోగంలో ఏదో యిబ్బంది ఏర్పడవచ్చు. మరి జాగరూకత వహించటం మేలుగదా' స్త్రీలకు : వాహన సేకరణకు, ప్రసిద్ధుల వలన మేలు చేకూరుటకు అనుకూలం

★ **ధనుస్సు :** వారాంతం మేలైన సమయం వృత్తి యందు వికాసమేర్పడుతుంది. అన్ని విధాలా అనుకూలమున్నది సాహితీరంగానుకూలత గల వారం, గ్రహించండి. స్త్రీలకు : రాజకీయాలందు ఎలాంటి జోక్యం తగదు "క్షణ" అనుకూలుడుగాడు అధికంగా వ్యయం చేయవలసిన అవకాశం ఉండవచ్చు, గ్రహిస్తారుగా!

★ **మకరం :** ఉత్తముల స్నేహం లభ్యమవుతుంది మీరు రచయితలయిన అనుకూలం మీరు చలన చిత్ర రంగానుభవం గల వారైన అనుకూలం శుభ వ్యవహారాలందు అనుకూలం ధనాదాయమున్నది స్త్రీలకు : వృత్తి యందు వికాసం, ధనలబ్ధి

★ **కుంభం :** ధన విషయంలో ఎలాంటి లోపం లేదు. ఈ వారమంతా రాదు. 'శతభిష' నక్షత్ర జాతకులకు చక్కని అవకాశాలుంటాయి ప్రసిద్ధ రంగాలైన విద్యా, ఆరోగ్య రంగాలలో మేలైన వారం. మీరు శుభ కార్యం సాగించాలంటే మేలే. స్త్రీలకు : సర్వ విధాలా అనుకూలం, మరి ఆరోగ్య రీత్యా జాగ్రత్త కావాలిగా!

★ **మీనం :** విపరీతి యోగం పది మందిలో ప్రసిద్ధి ఏర్పడుతుంది. ధన యోగానికి ఆస్కారం లేదు. అధికారమందు అభివృద్ధి. సాహితీరంగాన అంటే నవలా రచయితలకు, కవులకు, గాయకవర్గానికి చక్కని అవకాశాలుంటాయి, గ్రహిస్తారుగా. స్త్రీలకు : సుఖానందం, [illegible] యింతో ఆదాయానికి ఆస్కారం.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



శ్రీ బి నాగిరెడ్డిగారి మనుమరాలు శ్రీ బి వేణుగోపాలరెడ్డిగారి (ప్రసాద్ ప్రాసెస్) కుమార్తె చి సౌ లక్ష్మీనిరుపమకు ప్రముఖ వాణిజ్య వేత్త సిహెచ్ రామపరెడ్డిగారి కుమారుడు చి సురేష్‌తో నవంబర్ 26న విజయశేషమహల్‌లో వైభవోపేతంగా వివాహం జరిగింది తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎమ్ జి రామచంద్రన్ తదితర మంత్రివర్యులు చిత్ర పరిశ్రమలోని పలువురు ప్రముఖులు విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు

## సినిమా

## "భామాకలాపం"లో ఆత్రేయోపాఖ్యానం

డాక్టర్ వైద్యం ఆంజనేయులు (వేలు) క్లినిక్‌కు ఆత్రేయ వచ్చారు నర్సు (శ్రీవాణి) ఆనందంతో వైద్యం వద్దకు పరుగుతీసింది మన హాస్పిటల్‌కి ఆత్రేయగారు వచ్చారు సార్! అవున్సార్! సినిమాల్లో ఆత్రేయ గారి పాటలన్నా, మాటలన్నా నేను చెవి కోసుకుంటాను అంటూ చిటపట చినుకులు పడుతూ ఉంటె ఆలపించింది

డాక్టర్ వైద్యం వెంటనే ఆత్రేయ దగ్గరకెళ్ళి, "నమస్తే సార్! ఆహా! ఓహో! నా హాస్పిటల్‌కి ఎంత అదృష్టం పట్టింది! సాక్షాత్తు ఆత్రేయగారు రావడం అంటూ తడబడ్డాడు

ప్రియురాలి దగ్గరికి ప్రియుడు, డాక్టరు దగ్గరికి రోగి రాకతప్పదు అన్నారు ఆత్రేయ

సార్! ఎన్నాళ్ళ నుంచో మిమ్మల్ని ఓ ప్రశ్న అడగాలని ఉంది మనిషి- మనసు- మమత ఈ మూడు పదాల్ని మీరు ఎందుకు వదలిపెట్టరు సార్?

"మీరు థర్మామీటరూ, స్టెతస్కోపూ, సిరంజీ ఎందుకు వదలిపెట్టరు? మీరు మనిషికి వైద్యం చేస్తారు నేను మనసుకి వైద్యం చేస్తాను

ఐతే ఇప్పుడు మీకు నేను వైద్యం చేస్తాను చెప్పండి- ప్రాబ్లమ్ ఏమిటి?

ఓ సినిమా పాట రాయడం కోసం వచ్చాను రాసేవాడ్నే కాని, కాలు బెణికింది

వైద్యంఒక ఇంజక్షన్ ఇస్తూ, అవున్సార్- కాలు బెణికిందని పాట రాయలేనన్నారు కాల్తో కాదు కద్సార్ రాసేది? అన్నాడు

చేతికి ఇంజక్షన్ చేస్తున్నావెందుకు? బెణికింది కాలు కదా? అన్నారు ఆత్రేయ వెంటనే

క్షమించండి సార్! నన్ను క్షమించారనడానికి గుర్తుగా నా సిరంజి మీద ఓ పాట రాయండి సార్

సిరంజి మీద ఎలా రాయమంటావ్? నాకు కాగితాల మీద రాయడమే అలవాటు." అంటూ



ఆత్రేయ సిరంజి డాక్టర్ ఇంజెక్షన్- వీటిని ప్రేమ పాదనాల్ళుగా పోలుస్తూ ఓ పల్లవి రాసిచ్చారు

వైద్యం పరమానందభరితుడై సార్! మీరంటే- నాకు భక్తి గౌరవం కాని ఫీజు విషయంలో నేను చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను వంద రూపాయలు ఫీజు ఇవ్వండి మీకేమండీ- అక్షరం లక్షల విలువ చేస్తుంది అన్నాడు

అవును కదా- ఇప్పుడు మీకు చెప్పిన పల్లవిలో 26 అక్షరాలున్నాయి అంటే- మీరే నాకు 25 లక్షల 99 వేల 9 వందలు ఇవ్వాలి అన్నారు ఆత్రేయ బయలుదేరుతూ

వైద్యం నిర్ఘాంతపోయాడు

దటీజ్ ఆత్రేయ అంది నర్సు

రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించిన రాగ వాసుజా ఫిలిమ్స్ భామా కలాపం చిత్రానికి గందం జగన్‌మోహన్ నిర్మాత.

"భామా కలాపం"లో శ్రీవాణి, ఆత్రేయ. వేలు



## "దొంగపెళ్ళి"లో తమ్ముడి బాధ

అర్ధరాత్రి భర్త కోసం నిరీక్షిస్తూ సావిత్రమ్మ (అన్నపూర్ణ) స్తంభానికి ఆనుకుని కూర్చొని ఉంది బాలు (శోభన్‌బాబు) మంచి నీళ్ళు తాగడానికి గది లోంచి బయట కొచ్చిన వాడల్లా అక్కను చూశాడు సమీపిస్తూ ఏమిటక్కా' నువ్వింకా పడుకో లేదా' అన్నాడు

లేదు బాబూ' నిద్ర రావటం లేదు అంది సావిత్రమ్మ హీన స్వరంతో

నువ్వు మెలకువగా కూర్చున్నది నిద్రరాక పోవటం వల్ల కాదక్క బావ రాక పోవడం వల్ల నిజానికి పొరపాటు నీది కాదక్కా ఇల్లరికం ఉంటాడని నిన్ను బాగా ఏలుకుంటాడని ఆయనకు నిన్ను కట్ట బెట్టి కన్ను మూసిన నాన్న గారిది ఉన్న యాభై ఎకరాలూ నీకూ నాకూ సమానంగా పంచి ఇచ్చారు భర్తే దైవమని నమ్మే అమాయకరాలివి నువ్వు ఆ పాతిక ఎకరాలూ బావ పేరున పెట్టావ్ ఆయన గారు చాలా మటుకు అది అమ్మేసి ఆ సొమ్మును పనికిరాని వాళ్ళకు పెడుతున్నాడు ఉన్నదంతా పోయిన తర్వాత అసలు నీకు తిండి కూడా తను పెట్టగలడో - లేదో !

బాబూ' నువ్వెళ్ళి పడుకో'

నువ్వు చెప్పినా వినిపించుకోని మనిషి ఆయన నేను చెప్పినా వినిపించుకోని మనిషి నువ్వు ఒక్కటి మాత్రం నిజం అక్కా భర్త గురించి సొంత తమ్ముడు మాటంటే కూడా సహించలేని నలాటి దాన్ని బాధ పెట్టే ఆ మనిషి బాగు పడడం కష్టం అంటూ బాలు అక్కడ్నుంచి వెళ్ళి పోయాడు సావిత్రమ్మ మాత్రం ఇంకా భర్త కోసమే ఎదురు చూస్తూ నిలుచుండి పోయింది

ఆనం గోపాలకృష్ణా రెడ్డి నిర్మించే శ్రీ వెంకట కృష్ణా ఫిలిమ్స్ దొంగపెళ్ళి చిత్రానికి రవిరాజా పినిశెట్టి దర్శకుడు

## బాలకృష్ణ, కోదండరామిరెడ్డిలతో తేజస్వీ వారి తొలి చిత్రం

బాలకృష్ణ పోలీసు అధికారిగా నటిస్తున్నారు సెంటిమెంట్ కామెడీ పొలిటికల్ సెటైర్‌తో రూపొందించబడుతున్న చిత్రం అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో నందమూరి హరికృష్ణ నిర్మిస్తున్న తేజస్వీ వారి తొలి చిత్రంలో భానుప్రియ జగ్గయ్య రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్ గిరిబాబు రాజేష్ చలపతిరావు రమణారెడ్డి పి ఎల్ నారాయణ జీవిత రాగిణి నిర్మల అనిత ఇతర పాత్రధారులు పరుచూరి సోదరుల రచన చక్రవర్తి సంగీతం నందమూరి మోహనకృష్ణ చాయ శ్రీనివాసరాజు శిల్పం చలసాని రామారావు - జి కనకేశ్వరరావు సంయుక్త దర్శకత్వం సూపర్ సుబ్బరాయన్ సాహసాలు రవి కూర్పు నిర్వహిస్తున్నారు


"కలియుగ కర్ణుడు"లో మీనా

# సినీ చిత్రనటి సుమలత సమాధానాలు



**ఎం. మహ్మద్ ఆలీ, ఖాన్స్‌వాడ**

ప్రః సుమలతా బెహన్! కొందరు వాళ్ళు బోధించేదేదో వాళ్ళే ఎందుకు ఆచరించరు?

జః అవి రెండూ వేర్వేరు వృత్తులు. రెండిటికీ ఇద్దరు వ్యక్తులు అవసరం.

**వి. దశరథరామశర్మ, కాకరపర్రు**

ప్రః దేవుడనేవాడున్నాడా? ఎందున్నాడు?

జః అసలు దేవుని గురించే మీకు తెలియనప్పుడు అతని ఉనికి గురించి చెప్పినా బోధపడదు.

**చింతా అవధాన్లు, ద్రాక్షారామం**

ప్రః ఇంతకీ, మీకు ఎటువంటి ప్రశ్నలకు జవాబులివ్వడమంటే ఇష్టం?

జః నా కలానికి కాక నా బుర్రకు పని కల్పించే ప్రశ్నలంటేనే-

**వెల్లంకి బాలామణి, చోడవరం**

ప్రః మన జాతీయ సైన్యములో ఎక్కువమందికి అవకాశాలు కల్పిస్తే, మన నిరుద్యోగ సమస్య కొంత వరకు పరిష్కారం కాగలదంటాను. మీరేమంటారు?

జః మన సైన్యానికి యోధులు కావాలి గాని, పొట్టపోసుకునేవారు కాదు.

**వడ్లపూటి రమణ, యానాం**

ప్ర : మానవుడు తన జీవితములోని ఒక ఆశ నెరవేర్చుటకు నిరంతరము కృషి చేయుట మంచిదా, లేక- ఆ అదృష్ట సమయం కోసము ఎదురు చూడటము మంచిదా?

జ : నిరంతరం కృషి చేస్తూంటే ఫలితమే అదృష్ట రూపంలో సమకూరుతుంది.

**దావులూరి రమేష్‌బాబు, కోలంక**

ప్ర . సుమాజీ! పురుషుని ముంచెత్తడానికే స్త్రీ కళ్ళల్లో భగవంతుడు కన్నీళ్ళు నింపాడని నా అభిప్రాయమే ...బు, మరికొ...వరి అభిప్రాయమూ ... . ఐతే, మీరేమంటా... ?

జ : కన్నీరు మాత్రమే కాదు, అందులో కనికరం, కరుణ, క్షమ ఇత్యాదులను కూడా నింపాడు.

**వి. చంద్రమౌళి, షోలాపురము**

ప్ర : ఒక సందేహము... సినిమాలలో నటించే హీరోయిన్‌ల కంటే వారి పక్కన నటించే దాసీలే చక్కగా ఉంటారని నాయొక్క అభిప్రాయము. తమరేమందురు?

జ : లోకోభిన్న రుచిః

**బచ్చు యోగానందం, కొత్తగూడెం**

ప్ర . ఏదైనా శుభకార్యం ప్రారంభించే ముందు మీన మేషాలు ఎందుకు చూడడం.

జ : వృశ్చికాలూ, మకరాలూ ఉంటాయన్న భయం చేతేమో!

**వి. ఎస్. లాల్, జనగామ**

ప్ర : సుమలతగారూ! అమృతంలా కనిపించే విషం ఏది?

జః తెచ్చిపెట్టుకున్న పొడినవ్వు.

**అబ్దుల్ కరీమ్, పొన్నూరు**

ప్ర : సంసారాన్ని సాగరమని ఎవరంటారు!

జ : ఈదటం తెలియనివారు.

**గుణుపూరు ఉమామహేశ్వరి, బొబ్బిలి**

ప్ర : అభిమాన సంఘాలను మీరు ప్రోత్సహించుట వలన విద్యార్థుల కాలము వృథా అవుతుంది. దీని గురించి ఆలోచిస్తారా?

జ : ఓ- కే.

**కె. ఆర్. సన్యాసయ్య, విజయవాడ**

ప్ర : ఒక యువతి తనంత తా వలచి వచ్చి నన్ను వివాహమాడమని కోరితే..?

జ : ఇష్టం లేకపోతే నిరాకరించండి. మీపేరు గలవారు చేయవలసిన పని అదే.

**వి. బాపనయ్య, నాగార్జునకొండ**

ప్ర : తల్లిదండ్రులు ఎంత చెప్పినా సిగరెట్ వదలని మా మిత్రుడొకడు పెళ్ళయిన వెంటనే భార్య చెప్పాక సిగరెట్ మానేసాడు. ఇదేం చోద్యం?

జ : అంతవరకు బాగానే ఉంది గాని, అతని తల్లిదండ్రులను కూడా వదిలేయమని ఆ భార్య మీ మిత్రునితో చెప్పకుండా చూసుకోండి! □

గమనిక ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు -సం

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న..........................................................................

..................................................................................

..................................................................................

పంపినవారి పేరు..........................................................

పూర్తి చిరునామా..........................................................

## నిత్య నూతన సీరియల్




(గతసంచిక తరువాయి)

జోస్యులు మఱల మంగమ్మతో కాపురము చేయు చుండెను. లోకు లందఱు అతనిని ఛీఛీ అనిరి. రామేశ్వర మతనిని బెదరించెను. "నీ వల్లరి చేసితివా, నీ ఉద్యోగము తీసి వేసెదను. డి. ఇ. వో.తో చెప్పి నీవు బ్రతికి ఉండగా మఱల నీ కుద్యోగము కుదరనట్లు చేసెదను. నెలకు నీకు పాఠశాలలో ఇచ్చుచున్న జీతముకాక యేబది రూక లిచ్చెదను" అని కబురంపెను. జోస్యులు విచారించెను. "బ్రతికినంత వరకు క్షున్నివారణార్థము భోజనము చేయవలయును కదా! దేశము మీద లేచిపోవుద మనిన బిచ్చ మెత్తుకొనుటయే. కాని చనిపోవుద మనిన ఆత్మహత్య చేసికొనుటకు మనసొప్పుట లేదు. అయినను శత్రువు బ్రతికి యుండగా చచ్చి ఎవనిని సాధింతును? నా శత్రువు నా కన్న ప్రబలుడు.

అతనిని నే నెట్లును సాధించలేను. అయినను ప్రయత్నము చేయుదును" అని రామేశ్వరము పంపించిన రాయబారమున కంగీకరించెను. పూర్వమున్న యింటిలోననే మంగమ్మయు, జోస్యులును కాపుర ముండిరి. అతడు సిగ్గన్నది వదలిపెట్టి

నట్లుండెను. అందరు తన్ను చూచి నవ్వుచుండిరని అతనికి తెలియును. అతనికి లెక్క లేదు. అత డెప్పుడును వీధి అరుగు మీదనే పండు కొనును. ప్రొద్దుననే లేచి స్నానము చేసి, కొంత జపము చేసికొని అన్నము తానే వండుకొని తినును.

పాఠశాలకు పోవును. ఏమియు పని చేయడు. అడుగు వారెవ్వరును లేరు. సాయంకాల మింటికి వచ్చును. రాత్రులందు భోజనము చేయడు. మఱల అరుగు మీద పండు కొనును. తెల్లవారులు ఊహలో చిత్ర విచిత్రములైన ఉపాయముల చేత రామేశ్వరమును శిక్షించును. మంగమ్మను కత్తికొక కండగా కోసి కాకులకు వేయును. ఒకప్పుడు రామేశ్వరమును తాను ఉరి దీయును. ఒకప్పుడు దుర్యోధనుని శిరస్సు భీముడువోలె తాను రామేశ్వరము తలదన్నును. ఒకప్పుడు పాపారాయుడు విజయరాముని వలె రామేశ్వరము ఒడల నింద కత్తులతో పొడుచును. మఱి ఒకప్పుడు విరాగియై హిమాలయ ప్రాంతములకు పోయి తపస్సు చేసికొనును. మఱి ఒకప్పుడు పిచ్చివాని వలె తిరుగు చుండును పిల్లలతని మీద ఱాలు రువ్వు చుండిరి. తెల్లవాఱ వచ్చును. నిదుర పట్టదు. ప్రొద్దుననే లేచి స్నానము చేయును. ప్రాణము నిస్సార మనిపించును. ఒక్కొక్కప్పుడు తోటి ఉపాధ్యాయులలో ఎవరి ఇంటికైన పోయి భోజనము చేయును. ఎవ్వరితోను మాటాడడు. పాఠశాలలో కుర్చీలో పండుకొని నిదుర పోవును. ఒకసారి రామేశ్వరము తనిఖీకి వచ్చినాడు. జోస్యులు నిదురపోవు చుండెను. ఎవరో జోస్యులను నిదుర లేపిరి జోస్యులు కన్ను తెఱచి చూచెను. రామేశ్వర మెదురుగా నిలుచుండెను. జోస్యులు కన్ను మూసి మఱల నిదురపోనారంభించెను. రామేశ్వర మింటికి పోయి, "నీవు సరిగా పాఠములు చెప్పుట లేదు. నేను వచ్చినప్పుడు కుర్చీలో నుండి లేవనైనా లేవక నిదుర పోవుచుంటివి. దీని కేమి సమాధానము చెప్పెద"వని కాగితము పంపించెను. రామేశ్వర మిట్లు చేసెడివాడు కాడు, ఈ కథ తక్కిన ఉపాధ్యాయు లందరి ఎదుట జరిగెను ఊరకుండినచో బాగుండ దని రామేశ్వర మట్లు చేసెను. జోస్యులు తా నెట్లు చెప్పిన నట్లు నడచునని, తన ప్రవర్తనకు అత డంగీకరించెనని రామేశ్వరము తలంచెను. ఇట్లు కాగితము వ్రాయుట జోస్యులను శిక్షించుటకు కాదు. తాను మంగమ్మకు ప్రియు డగుటలో కల శృంగార చేష్టలలో ఇదియు ఒకటి. దీనికి జోస్యులు మౌనము వహించ వలయునని రామేశ్వరము గారి ఊహ. ఇందువలన జోస్యులకు శిక్ష ఏమియు కలుగదు. కాని ఆ ఉత్తరము చూచినంతనే జోస్యులు మండి పోయెను. అతడు మఱల తిరుగు సమాధానము వ్రాసెను. "ప్రియమైన రామేశ్వరము గారు! మీ కాగితము వచ్చినది. నేను పాఠశాల తెఱచిన రెండు నెలల నుండి పని చేయుటయే లేదు. నిద్దురయే పోవు చుంటిని. నేను సరిగా నా ధర్మము చేసినచో నేను పెండ్లి ఆడిన స్త్రీ తమ కేల

ఉంపుడు గత్తె కావలెను? ఇది మీ ఆజ్ఞ ప్రకారమే చేయుచుంటిని గదా! నేను పెండ్లి ఆడిన స్త్రీతో మీరు సుఖపడునట్లు, నాకు జీతము పేర నెలకు పాతిక రూపాయలును, ఆమెతో కలసి ఒకే యింట ఉన్నందుల కేబది రూపాయలు ఇచ్చునట్లు- ఇది మన మధ్య ఖరారు. మీరు నాకు కాగితములు గీగితములు పంపించవలదు- ఇట్లు మీ సపత్నీకుడు జోస్యులు" అని వ్రాసి, జోస్యులా ఉత్తరమును బంట్రోతునకిచ్చి తక్కిన ఉపాధ్యాయులందరికిని చూపించి తీసికొని పొమ్మని చెప్పెను. కొందఱుపాధ్యాయులా ఉత్తరమును చూచి జోస్యులు వట్టి నపుంసకుడనిరి, అవివేకి

అనిరి. కొందరు "చూచితిరా, పాపమా జీవుడెంత దుఃఖించుచున్నాడో!" అనిరి మరి కొందరు "కొలది దినములలో రామేశ్వరముగారో, జోస్యులో యిద్దరిలో ఎవరో ఒకరు చనిపోవుటకే వచ్చిన"దనిరి. రామేశ్వర మీ ఉత్తరమును చూచుకొనెను. ఈ ఉత్తరమును తక్కిన ఉపాధ్యాయులు కూడ చూచిరని తెలిసికొనెను. క్రోధఘూర్ణితతామ్రాక్షుడయ్యెను. జోస్యులునకు తన మీద ఇంత కసి ఉన్నదని అతనికి తెలియలేదు. ఈ వ్యర్థుడైన బ్రహ్మగా డేమిచేయునని ఊరకుండెను. చిన్న పామునైనను పెద్ద కఱ్ఱతో

**జరిగిన కథ – 35** : రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు. ధర్మారావు హరప్పనాయనికి చదువు చెబుతూ ఉంటాడు. గవర్నరు గారు సుబ్బన్నపేటలో పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తాడు. సుబ్బన్నపేటకు పూర్తిగా బస్తీ కళలు వస్తాయి. జోస్యుల భార్య మంగమ్మను రామేశ్వరము లొంగదీసుకుంటాడు. శివరావు తాను కృష్ణావతారమని అదో క ధోరణితో ఉంటాడు. దేవదాసి గిరిక ప్రతిరోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. జోస్యులు రామేశ్వరమును ఏమీ చేయలేక చచ్చిపోదామని అనుకుంటాడు. రామేశ్వరము మంగమ్మల వ్యవహారం ఊరంతా తెలుస్తుంది. హరప్ప తాను చేయవలసిన పనులను గురించి ఆలోచిస్తూ ఉంటాడు. శివరావు అవతారం గురించి చెబుతూ ఉంటాడు. కిరీటికి అతని మామ పిల్లను ఇవ్వనని అంటాడు.

కొట్టవలయును, ఊరకుండరాదని మఱల విచారించెను. రెండు మూన్నాళ్ళయిన తరువాత ఒకనాటి రాత్రి అరుగు మీద పండుకొన్న వాడేదో ఊహించి ఊహించి జోస్యులు హఠాత్తుగా లేచి యింటి లోనికి పోయెను. ఈ రెండు నెలలు వారున్న భాగమున వీథి తలుపు మూయబడి ఉండలేదు. అతడు లోనికి పోయి చూచెను. మంగమ్మ నిద్ర పోవుచుండెను. అతడామెను నిద్ర నుండి లేపెను. ఆమె లేచి ఆశ్చర్యపడి చూచుచుండెను.

జో: అవునుగాని, నేను వారము పది రోజులలో చచ్చిపోవుచున్నాను. నీవు దుఃఖపడుదవని నీతో చెప్పుటలేదు. నీవు చెడిపోయినదానవెట్లును చెడిపోతివి. నేను చనిపోయిన తరువాత బ్రాహ్మణ విధవవై యిట్లు బ్రతుకుట ఎందులకు? నీకొక ఉపాయము చెప్పెదను, చేయుము. రామేశ్వరమునకు స్థిరాస్థి వారి ఊరిలోగాని యిచ్చుట లేదు. వారన్నదమ్ములు విభాగము కాలేదు. ఆయన నీకు వ్రాసి యిచ్చినను చెల్లదు. ఈ సంవత్సరముతో ఆయన ప్రెసిడెంటుతనము పోవును, తరువాత నీకిచ్చెడిదేమిటి చచ్చెడిదేమిటి? నేనరుగు మీద పండుకొని ఉందును. ఇంత తెలిసినదానికి పగలు మాత్రమే ఏమి రాత్రి గూడ రమ్మనుము. రెండు సినిమాలకు కలసి వచ్చిన డబ్బే నాటి దానాడు నీ చేతిలో పెట్టవలయును. అతని వద్ద ఎప్పుడే బాపతు దమ్మిడీ వచ్చినను అది యీ తక్కిన ఎనిమిది నెలలును తీసికొనుము. అతడు నిన్నే మిక్కిలిగా మఱుగునట్లు కొన్ని ఉపాయములు నేర్పించెదను. పురుషులను వశము చేసికొనుట ఎట్లో అది విద్యగా చదివిన ఒక దాసీది కలదు. కాసా పేటలో దానితో మాట్లాడి వచ్చితిని. అది తెపటి నుండి యిచ్చటికి వచ్చి నీకన్నియు బోధించును. నీవు రామేశ్వరమును బుక్కా పకీరును చేయవలయును. ఇది నీ మేలు కోసమే చెప్పుచున్నాను! నా పగ తీరుటకు గాదు, నా పగ యిట్లు తీఱదు.

"నేను వదలిపోయెదను. అతడును వదలిపోవును. అప్పుడు నీ వెట్లు బ్రతికెదవో ఆలోచించుము: నీకు పదునేడేండ్ల కన్న ఎక్కువ లేదు. నేను చనిపోయినంతనే మీ వాండ్రు కాని, మా వాండ్రుగాని వచ్చి కర్మలకు నిన్ను రమ్మందురు; నిన్ను బ్రాహ్మణ విధవను చేయుటకు, దాని



కొప్పుకొని బ్రాహ్మణ్యము పాడు చేయకుము. దానికి తగినంత మంది వేఱే ఉన్నారు. నిన్ను తీసికొనిపోయి రామేశ్వరము నెచ్చటనైన దాచుమనుము. ఈ ఎనిమిది నెలలు నేను చెప్పినట్లు చేసితివా, పది పంౘ్రెండు వేలు నీయొద్ద చేరును. ఈ నిర్లజ్జమైన లోకమున అప్పుడు నీవాడినది ఆట పాగినది పాట! ధనవంతుడగుట చేతనే కదా రామేశ్వర మింత పని చేసినది. వానిని గౌఱగించి నీవు ధనవంతురాలవగుము. సృష్టిలో వీడే పురుషుడు కాడు గదా! నీవు ధనవంతురాలవైన తరువాత ఎంత ఎంత చేసెదవో నీకే తెలియగలదు. రామేశ్వరమువలె, ప్రెసిడెంటువే కావచ్చును నేను చెప్పిన ప్రతి మాటయు మననము చేసికొనుము. పొరపాటు పడకుము. అనాథుడు, చేతగానివాడేదో చెప్పెనని కొనకుము. ఒక వేళ నేను చెప్పిన యీ సంగతులన్నియు రామేశ్వరముతో చెప్పి నాకంకేను పరాభవము సమకూర్చవలయునని తలంతువేని నీ మాట లతనితో పది రోజులు దాటిన తరువాత చెప్పుము. అంత వరకును చెప్పకుము. అతనితో చెప్పను, చెప్పినను పది రోజులయిన తరువాత చెప్పెదనని నా చేతిలో చేయి వేయుము" మంగమ్మ పది నిమేషములు విచారించి అతని చేతిలో చేయి వైచెను. ఈ తదపవిత్ర స్పర్శ చేత జోస్యుల శరీరమంతయు విషద్రవములో ముంచి సూదులు పెట్టి పొడిచినట్లయ్యెను అతండింతసేపు పిచ్చివాని వలె మాటాడెను. తిరిగి బయటికి పోయెను. అరుగు మీద పరుండెను. పరుండుటకు బుద్ధి పుట్ట లేదు. "మంగమ్మ తాను చెప్పినట్లు చేయునా? చేయును, చేయకపోవును. దాని వలన తనకేమి లాభము?" అనాడమావాస్య. జోస్యులు గ్రామము వెంట తిరుగుటకు బయలుదేరెను అటు దేవాలయమువైపు పోవుటయా, ఇటు సినిమా వైపు పోవుటయా? చివర కటు నిటుగాక పశ్చిమ దిక్కుగా నడచెను కోట రోడ్డు మీదికి వచ్చి వెనుదిరిగి కొంత దూరము నడచి కోట దక్షిణ కుడ్యము వెంటనే పోవుచుండెను. కుడి వైపున సుమారు మైలు పొడుగున కోటగోడ వ్యాపించి ఉండెను. ఏదో పెద్ద దయ్యము తాడియెత్తున నిలుచుండి తన వెంటనే వచ్చుచున్నట్లుండెను ఎడమ వైపున భోగము పేట, కాసాపేట అని కూడ అందురు. తెల్ల వారు జామున రెండు గంటలు కావచ్చెను. నిజముగా అది నడురాత్రి. ఒకటి రెండు కుక్కలతనిని చూచి మొఱిగెను. మఱి కొంత దూరము పోయిన తరువాత అతడు దేని మీదనో కాలు వేసెను. రెండడుగులు వేసి భయపడెను అది పామేమో? మఱల రెండడుగులు వేసి తనకు భయమెందుకో తెలిసినది కాదనుకొనెను. రామేశ్వరము ప్రెసిడెంటైన తరువాత కాసా పేటలో చివర మేడ వేసెను. పురపాలక సంఘపు ఎన్నికలలో కబీరు నోడించి కాసాపేట తరపున 'తాను గెలువవలయునని అతనికి పెద్ద ఆశ. అప్పుడు తన జీవితములో అతడు గొప్పకార్యము చేసినవాడగును. జోస్యులు వాని యింటి ముందునకు పోయి నిలుచుండెను. అతని ఎదదలో లక్షలు, కోట్లు, అద్భుదములు, ప్రయోజనము మాలిన ఊహలు షేక్సుపియరు వ్రాసిన డెన్మార్కు యువరాజన్న నాటకములోని కథానాయకుని బుఱ్ఱలో వలె చెలరేగెను. నిరర్థకములైన ఆ ఊహలన్నియు ఇనుమును త్రుప్పు తిన్నట్లతని హృదయమును తినుచుండెను. కోటలో నాలుగు గంటలు కొట్టిరి అతడటు పది రైలు స్టేషనుకు పోయెను అచ్చటికి వచ్చునవిగాని, పోవునవిగాని బండ్లు రాత్రి పూట లేవు. ఒంటి స్తంభపు మేడవలెనున్న ఆ స్టేషను పెద్ద బంగరు బయలులో దిక్కు లేని వాని వలె ఒంటరిగా నిలుచుండెను. జోస్యులు స్టేషనులోనికి పోయెను. తలుపులు వేసి ఉన్నవి. ఎవ్వరును లేరు ఆత్మ బంధువునానుకొన్నట్లాతడా స్టేషను గోడ నానుకొని కొంతసేపు నిలుచుండెను. ధ్వని కీచుఱాలనిస్వనము వెలుగు మినుకు మినుకు మనుచున్న తారలది. గాలి తన నిశ్వాసమునది. తక్కిన ప్రపంచమంతయు నిశ్చైత్య మైనట్లుండెను. ఇంతలో తూర్పున ఉషోరాగము తోచెను. జోస్యులకు వెలుగనిన గిట్టలేదు. దివాంధము వలె పోయి ఏ అడవిలోననో దాగుకొందమనుకొనిన అతని మనుష్యావయవము లతని కాటంకము కలిగించెను ప్రాణములున్న వున్నట్లేల పోరాదో! ఒక వ్యాధి ఏల రావలె? ఒక ఉరి ఏల తీయబడవలె? ఒక రైలు క్రింద ఏల పడవలె? ఒక కత్తి దెబ్బయో తుపాకి దెబ్బయో ఏల తగులవలె? జోస్యులు శరీరము చేత నుండి లేనట్లుండలేకపోయినను, మనసు చేత మాత్రము లేనట్లే అయ్యెను ఆ జీవి ఉన్మత్తుని వలె ఆచీకటిలో పరుగులెత్తెను

తరువాత నాలుగు రోజుల వఱకును జోస్యులు కన్పించలేదు. ఐదవనాడు సాయంకాలము రామేశ్వరము సినిమాకు పోవుచుండెను ప్రొద్దు సరిగా కుంకలేదు చేతిలో ఏదియో పుచ్చుకొని ఎదురుగా జోస్యులు వచ్చుచుండెను. జోస్యులు పిచ్చి వానివలె మలినవసనములు, చింపిరి జుట్టుతో ఉండెను రెండు నెలల నుండి ఒక్క పూటయు, నాల్గు రోజుల నుండి అసలు తిండియు లేక అతడు గాలివలె ఊగిపోవుచుండెను రామేశ్వరము వెంట ముగ్గురు తాలూకా బోర్డు మెంబరులు వచ్చుచుండిరి సినిమా హాలులోని రౌడీలు ముగ్గురు వచ్చుచుండిరి. రామేశ్వరము దగ్గరకు వచ్చిన తరువాత జోస్యులు బట్టచాటున ఉన్న కత్తినెత్తి రామేశ్వరమును పొడువబోయెను ఓపిక లేక తూలిపోయెను ముగ్గురు రౌడీలు అతని మీద పడిరి. పెద్ద మనష్యులు వారినీ విడదీసిరి రౌడిలు వావమోదుట చేత అసలే ఓపిక లేని జోస్యులకు ప్రాణము కడబట్టెను, రామేశ్వరము భయపడెను. వారును వీరును నీరు తెచ్చి చల్లిరి గంటసేపటికతడు లేచి నెమ్మదిగా నడచి పోవుచుండెను వానిని చూచి కొందరు బెదరించిరి. కొందరు నవ్విరి. కొందఱు ఱాళ్ళు విసరిరి. ఒక బలాధికుడు తూలిపోవుచు పోవుచున్న అతనికి కాలడ్డము పెట్టెను జోస్యులు బొక్కబోర్లగా పడెను జోస్యులు ముక్కు పగిలి నెత్తురు కారుచుండెను. మొగమంతయు చెక్కలూడెను. చీకటిలో ఎవరికిని కనిపించలేదు. జోస్యులు లేచి పోవుచుండెను. రాతిరి రెండు జాముల వఱకు అతని మనస్సు పాతాళలోక మందును, శరీరము భూలోక మందును తిరుగుచుండెను. రాతిరి రెండు జాములప్పుడు గుండేటి వంతెన దాటి చీకటిలో పోవుచున్న అతని నడి నెత్తిన ఒక దండ ఘాతము తగిలెను. అతని ప్రాణములది వఱకే పోయెను.

14




# రామేశ్వర శాస్త్రి వివాహం

మా తాతగారు విశ్వనాథ శోభనాద్రిగారు కూడా కవే! ఆయన రెండు హరికథలు కూడా వ్రాశాడట. ఐతే అవి ఏనాడూ అచ్చు కాలేదు. ఏమై పోయాయో కూడా మాకు తెలీదు.

"జనాన్ని వెంటబడి పిలిచి కూర్చోబెట్టి కవిత్వం వినిపించటమేమిటిరా, మీయమ్మ కడుపుకాల!ఆత్మతృప్తికి నీ ధోరిన నువ్వు కవిత్వం అల్లుకుంటూ ఉంటే విని రసించిన సహృదయుల వలన దాని అదృష్టం బాగుండి లోక ప్రచారం రావాలి గాని!" అని ఆ రోజుల్లో తిడుతూ ఉండేవాడట ఆయన!

మా నాన్నగారు చిన్నగా కవిత్వాలు, కథలు నవలలు వ్రాస్తూ ఉండటం చూసి "వ్రాయ గలిగితే రామకథ వ్రాయి! లేదా నోరు మూసుకో! అంతేగాని ఈ పిచ్చి కథలు, కాకరకాయ కవిత్వాలు ఇహమా, పరమా?!" అని కేక లేసే వాడట కూడా!– ఆ తండ్రి ఆజ్ఞ– తన జీవుడి వేదన రెండూ ఒకటై రామాయణ కల్పవృక్షం వ్రాశానన్నాడు మా నాన్నగారు. అంతేకాక అవధీభూత మహోశ్ర్యంగా సాహిత్య సర్వప్రక్రియలూ చేసి– అటు పరమూ, ఇటు ఇహమూ రెండూ సాధించాడు మా నాయనగారు. అంతటి సిద్ధ సంకల్పుడు మా తాతగారు.

వందఏళ్ల క్రిందటి సంగతి. మా తాతగారు అప్పటికి చాలా కుఱ్ఱవాడు. దారిపక్కగా ఉన్న మా పొలాల్లో (నందమూరు) కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఆ దారినే పోతున్న కాటూరు గ్రామ వాస్తవ్యుడు, ఇంగువ లక్ష్మి నరసయ్యగారు, మా తాతని చూసి, "నాయనా! దాహంగా ఉందోయ్ రెండు దోసకాయలు కోసుకోమంటావా?" అని అడిగాడట. వెంటనే మా తాత లేచి– మంచెదిగివచ్చి ఉత్తరీయం కొంగులో పట్టేటన్ని కాయలు కోసి యిచ్చాడట

ఈయన వినయానికి, ఉదారబుద్ధికి ఆయన సంతోషించాడు. వ్రాస్తున్న కవిత్వం చూశాడు. అక్షరాలు ముత్యాల కోవలల్లే ఉన్నాయి. "ఈ కుఱ్ఱవాడు మహాభక్తుడు, మహాదాత అవుతాడు" అనుకుని - "నాయనా! ఎవరబ్బాయివోయ్" అని అడిగాడట. ఈయన "విశ్వనాథ సుబ్బరాయుడిగారి అబ్బాయినండి" అని చెప్పాడు.

ఆ చుట్టుపట్ల విశ్వనాథవారు, ఆ నాటికే శ్రీమంతులు పండితులు అయిన సుప్రసిద్ధ కుటుంబం.

"అల్లాగా నాయనా?" అని, లక్ష్మీ నరసయ్యగారు బయలుదేరి తిన్నగా మా యింటికి వెళ్లాడట. ఆ సమయానికి మా ముత్తాత సుబ్బారాయుడుగారు ఊళ్లోలేడు. గ్రామాంతరం వెళ్లాడు. ఆయన తమ్ముడు శివయ్యగారున్నాడు.

ఈ ఇంగువ లక్ష్మీనరసయ్యగారు




సామాన్యసంసారి ఈయన్ని చూసి, ఎవరో యాయవారపు బ్రాహ్మడనుకుని – మా శివయ్య తాత ఒక రూపాయి తెచ్చి యియ్యబోయాడట. (ఆ రోజుల్లో బస్తా బియ్యం రెండు రూపాయలు – జాగ్రత్త!!)

వెంటనే లక్ష్మీనరసయ్యగారు "అయ్యా! నేను పుచ్చుకోవడానికి రాలేదు. ఇవ్వడానికి వచ్చాను." అన్నాడట. విశ్వనాథవారికి యివ్వాలంటే, ఆ రోజుల్లో నూజివీడు జమీందార్లు కూడా చాలరేమో ఆ పరిస్థితుల్లో, ఈ సామాన్య సంసారి యివ్వడానికి వచ్చాననడంలో అర్థమేమిటి?

శివయ్యగారికి అర్థమైంది. పిల్ల నిస్తానంటున్నాడని. అంతటి మహాధనవంతులమైన మా గడపలోకి ధైర్యంగా వచ్చి పిల్ల నిస్తానంటున్నాడంటే, ఆ సామాన్య సంసారి యొక్క వర్చేయం శివయ్యగారికి అర్థమైంది. ఆర్షేయం కనుక్కున్నాడు. గోత్రాలు కుదిరాయి. పిల్ల పేరు పార్వతి. ఫాల్గుణికి సిద్ధంగా వుండమని చెప్పి, లక్ష్మీనరసయ్యగారిని పంపించాడు శివయ్యగారు.

సుబ్బారాయుడుగారు ఊళ్ళోకొచ్చేటప్పటికి, తాటాకులు కొట్టించి, పందిరి వెయ్యడానికి సిద్ధంచేసి, హడావిడిచెయ్యసాగాడు సుబ్బారాయుడుగారు వచ్చి "శివా! ఏమిట్రా ఈ హడావుడి?" అంటే "మన శోభనాద్రి పెళ్ళి అన్నయ్యా" అని సమాధానం చెప్పాడు. ఆయన ఏం మాట్లాడలేదు. సంతోషించాడు. ఆ అన్నదమ్ముల మధ్య అనుబంధం అలాంటిది.

మా తాతయ్య శోభనాద్రిగారు, మా నాయనమ్మ పార్వతమ్మగారు – వీరి వివాహం సరిగ్గా ఈవిధంగా జరిగింది.

ఆ రోజుల్లో వాళ్ళకి ఆర్షేయ పౌర్షేయాలేగాని, తుచ్ఛమైన వరకట్న పీకులాటలు, వృధాహంకారాలు, ధన దాహాలులేవు ఈ సంబంధంవారు పాతికవేలిస్తామంటే వీళ్ళతో తాంబూలాలు పుచ్చుకుని, ఇంతలో మరో సంబంధం వాళ్ళొచ్చి పాతికవేల నూటయాభై యిస్తామంటే ఆ పిల్లని చేసుకునేంత తుచ్ఛ లుచ్ఛాలుకారు వాళ్ళు

తన తల్లిదండ్రుల వివాహగాథనే – దరిదాపు యథాతథంగా – రామేశ్వరశాస్త్రి సావిత్రమ్మగార్ల వివాహ కథగా వ్రాశాడు మా నాయనగారు

రామేశ్వరశాస్త్రిగారి తక్కిన ఆపద్ధర్మ వివాహాలు; తన బుద్ధికౌశలంతో మా నాయనగారు కల్పించినవో, వాటికికూడా ఇంకెక్కడైనా ఎవరివైనా ఆధారాలున్నాయో మాకు తెలియదు.

(ఇంకా ఉంది)

–విశ్వనాథ పావనిశాస్త్రి

---

అప్పుడు పోయినది శరీరము కూడను. గాఢాంధత మసములావరించిన ఆ మహాకాళ రాత్రి ఆ దెబ్బకు ప్రతి ధ్వని కలిగించుటకు వెఱచి కాబోలు, టప్పుమని సరిగా ధ్వనించకయే భయద నిశ్శబ్ద రేఖాపరీవృత మయ్యెను.

ఒకనాటి సాయంకాలమున ధర్మారావు కాలేజీకి పోయెను. కిరీటి పరిదీన వదనుడై ఉండెను. అతని మొగము చూచిన తోడనే ధర్మారావునకు గుండె గుభేలుమనెను కిరీటిని తాను దివారాత్రములు పోషించుకొనుచుండెను. అతడు మల్లెపూవు వంటి వాడు. ఏమాత్రము బెడదగాలి వీచినను తునిగి పోవును. ఏమి దుర్వార్త వచ్చెనో! ధర్మారావు సమీపించి కిరీటి వంక చూచెను. అతడు దుఃఖము నిండిన కనులతో జేబులో నుండి ఉత్తరము చూడగా "కిరీటి తల్లికి ప్రాణము మీదికి వచ్చినది. వెంటనే బయలుదేరి రావలయు"నని ఉన్నది. కిరీటి మొగములో నెత్తురు చుక్క లేదు ధర్మారావు "నాయనా! భయము లేదు! ఏదో కొంచె మెక్కువ చేసి ఉందును! నిజముగా ఉత్తరములో నున్నట్లే అయినచో తంతియే యిచ్చెడివారు. భయము లే"దని చెప్పెను. కిరీటి "అన్నా! మాయమ్మకే జబ్బు చేసెనా?" అని ధర్మారావును కౌగలించుకొని ఏడ్చెను. ఆ మాటలో కిరీటి జీవిత మంతయు ధ్వనించెను. ధర్మారావు హృదయములో దుఃఖము సుడులు

తిరిగెను. రైలాఱు గంటలకు. రైలునకు పోవుటకు గంట వేళయున్నది. రైలెక్కు వఱకు "భయము లేదన్న" మాట ధర్మారావు వందసారులనెను. రైలు బయలుదేఱబోవుచుండెను

కిరీటి "అన్నా! ఎన్నిసార్లన్నను భయము లేదనెదవు. అమ్మ బ్రతుకునా? బ్రతుకదా?" ధర్మారావు "నాయనా! భయములేదు, భయము లే"దనెను. ఆ రైలు కదిలిపోయెను. ఏమి కదలుట. సుబ్బన్నపేట వఱకు దానికి సామాన్య జనులు లంకణాలబోటని పేరు పెట్టిరి. రోకలి బండవలె నెమ్మదిగా నడుచుచు, దూరమునకు తోచెను.

ధర్మారావింటికి వచ్చెను. అరుంధతి వెక్కిరింపుగా "ఒక్కరే వచ్చిరి. తమ్ముడేడి?" అనెను. ధర్మారావు: కిరీటి తల్లికి ప్రాణము మీదికి వచ్చినదట! అతడు నెల్లూరు వెళ్ళెను.

అరుం: అయ్యో! అయ్యో! తల్లికా? ఇతని పెండ్లి మాట ఏమి?

ధర్మా: అతడు అదియే అనుకొనుచున్నాడు. కిరీటి తల్లి చనిపోయిన తరువాత అతనిమామ మేనల్లుని మీద దయగలగిన పిల్లనిచ్చును.

అరుం: మఱి పదేడులైన తరువాత నా తల్లిదండ్రులకును, నాకును మఱల ప్రేమ అంకురించును.

ధర్మా: ఇంక పదేడులకా? అరుంధతి తెల్లబోయి చూచెను. అది శరదృతువు. వెన్నెలలు కాయుచుండెను. కాని బయట పండుకొనుటకు చెఱు చలిగా ఉన్నది. అయినను ప్రొద్దు పోవు వరకును జనులు బయటనే పండుకొనుచుండిరి. అరుంధతి ప్రక్క బయట వేయును. రాతిరి పన్నెండు గంటలకు లోనికి పోదురు. ఇంటి ప్రహరీ గోడ చాల భాగముల యందు పడిపోయెను. మఱల కట్టించుటకు ధర్మారావునొద్ద డబ్బు లేదు. అందు చేత మునుపు కోటవలె ఉన్న యిల్లు మఱుగు లేకపోయెను.

అరుంధతి: ప్రహరీ గోడ బాగు చేయించరాదా?

ధర్మా: రాచరికమువారనుజ్ఞ యీయలేదు.

అరుం: మన యింటి మాట?

ధర్మా: నేనొకరి యింటి మాట చెప్పలేదు. ధర్మారావు పుస్తకమేదో చదువుకొనుచుండెను.

అరుంధతి: ఇప్పుడు నేను పలుకరించినచో కోపము వచ్చును కాబోలు! ధర్మారావు మాటాడలేదు.

అరుం: ఏ పుస్తకమైనను అంత బాగుండును కాబోలు. ధర్మారావు నవ్వెను.

అరుంధతి: అనగా ఈ పుస్తకము బాగుండలేదన్న మాట.

ధర్మా: అవి ఏవో ఉపన్యాసములు. ఇవి వ్రాసినాయన ఆంధ్ర డికెన్సట నిజమే కాబోలునని తీసితిని. ఆంగ్లేయులలో "పిక్‌విక్ పేపర్స్" అని ఉన్నవి. అవి చాల రమ్యముగా ఉండును. ఈ ఉపన్యాసములు వాని ననుసరించి వ్రాయబడెనని చెప్పిరి. తీసి చూచితిని గదా, దీనికి వానికి ఏమియు సంబంధము లేదు. చెప్పినదే చెప్పి, చెప్పినదే చెప్పి, ప్రాణములు తీయుచున్నాడు. పలుకుబడిలో నొదుగు, ఒక చిన్నవాక్యమున చెప్పి పెద్ద అర్థమును స్ఫురింపజేయుట మొదలయిన మహారచయిత లక్షణములు లేవు. ఒక శయ్య, లేదు. వాచ్యత ఎక్కువగా ఉన్నది. శబ్ద ప్రయోగమునందు కూడ సొగసు కన్పించుటలేదు.

అరుం: మిమ్ము సంతోష పెట్టుట కష్టము.

ధర్మా: మా మేనమామ కూతునకు కూడనా?

ధర్మారావు మఱునాడు వంతెన వద్దకు వాహ్యాళికి పోయి తిరిగి వచ్చుచుండగా దారిలో శ్యామల కనిపించెను. ఆమె "మా యింటికి దయ చేయరా" అనెను. ఆమె అది వఱకే చాలసారులట్లు పిలుచుటయు, ధర్మారావు పోకుండుటయు జరిగినది. ఆనాడు ధర్మారావు వారి యింటికి పోయెను. అతడువెళ్ళినంతనే పంకజమ్మగారు, శ్యామలయు అతనిని ఎంతయూ గౌరవించి కూర్చుండ పెట్టి ఏదో ప్రసంగమునాగించిరి. ఇంతలో కుమారస్వామి వచ్చెను. అతడు ధర్మారావునకు నమస్కరించి కూర్చుండెను. శ్యామలాకుమార స్వాములిద్దరు ఒక మంచము మీదనే కూర్చుండిరి.

కుమా: మాస్టరుగారు! మీరు తెలుగు బాగుగా వ్రవలయును.

ధర్మా: నీకా?

కుమా: "నాకు గాదు" అని నవ్వి శ్యామల వైపునకు తల ఊపెను.

పంకజమ్మ: అప్పుడే చూడండి! ఎంత శ్రద్ధ పుట్టినదో!

ధర్మా: మన్మథుడు కడుచెడ్డవాడు.

కుమారస్వామిది చక్కని గొంతుకే. అతడు కొంచెము సంగీతము పాడెను. శ్యామల వీణ తెచ్చి రెండు కృతులు వాయించెను.

కుమార: నాకన్న ఎక్కువ సంగీతము తనకు వచ్చునని చూపించుటకు, నేనేమి చెప్పుకొంటినా?- శ్యామల సిగ్గుతో "అందుకు కాదండి" అనెను. ధర్మారావు తిరిగి యింటికి పోయెను. అతడు తనలో ఇదియు బాగుగనే ఉన్నది. స్త్రీ పురుష దృష్టితో చూచిన తప్పేమియు లేదు. పైగా సర్వమును సుమనోహరముగా ఉండుననుకొనెను.

అరుంధతి వడ్డించుచుండెను. ధర్మారావు "నేను నిన్నేరి చేసికొంటినా? నా చిన్నతనములో నా బుద్ధి నాకు తెలియనప్పుడు నాతండ్రి నిన్ను నాకంట గట్టెను. నేనే కోరికొని చేసికొన్నచో నీకన్న అందకత్తెను, విద్యావతిని చేసికొని ఉందును."

అరుం: ఆ మాట మీదనే నిలువబడుడు! అట్లయినచో, కొందరు పురుషులకు పెండ్లియే కాదు.

ధర్మా: కాకపోయిననేమి?

అరుం: మొన్న మీరే కదా చెప్పితిరి. జర్మనీలో నా? జన సంఖ్య వృద్ధి యగుటకు ప్రతివారును పెండ్లి చేసికొనవలసినదని శాసించినారని!

ధర్మా: జన సంఖ్య వృద్ధి యేమి? అరుంధతి మాటాడలేదు. ధర్మారావు కూర కొంచెము వడ్డించుమనెను.

అరుం: చెట్టున నాలుగు కాయలున్నవి. కోసి వండితిని. అందులో ఒకటి పుచ్చిపోయినది. తక్కిన మూడు మీ పంటి కిందికి రాలేదు. ధర్మారావొక విలాసపు చూపు చూచెను! అరుంధతి ఒక విచిత్రపు సిగ్గు పడెను.

ధర్మా: కూర కొంచెమైనను మిక్కిలి రుచిగా !!న్నది.

అరుంధతి: పరధ్యానముగా వున్నారు కాబోలు!

ధర్మా: నేనెప్పుడు అనుకూలుడనే.

అరుం: స్వామి గాలియైన తగిలి ఉందదా!

ధర్మా: మా స్వామి హైమవతీ ప్రణయైక జీవి.

అరుం: పచ్చడి వేయుదునా?

ధర్మా: వేయుదునా! చేయుదునా?

అరుం: నేడు మంచి గాలివీచుట లేదు.

ధర్మా: ఎట్టి వానికిని ఉద్రేకము కలిగించు సంగతులుద్రేకమే కలిగించును. నేడు నా ప్రకృతి కొంచెముద్రిక్తమైనది.

అరుం: అభిలాష వృద్ధి పొందవలయునిన విషయ విమర్శ చేయరాదు.

ధర్మా: అట్లు చెప్పుము. నీ కంఠప్రియమేని, విమర్శ చేయను.

నాటి రాత్రి పండు వెన్నెలలు బొండు మల్లెలు విరిసినట్లు, తెల్లని మడతలు విప్పినట్లు, ప్రణయ జీవితము వికసించినట్లు, నాల్గు దిక్కులకు జాళ్ళు కట్టి ప్రవహించెను. ఆ వెన్నెల మన్మథ ధనుర్జ్యా వినిర్గత సితకల్హార రోచి వలె మృదు ధ్వనియు, సుపరిమళమును గల వెలుగులు తెచ్చెను. జ్యోత్స్నాదేవి వాయునిహిత పరిమళముచే గర్భవతి అయ్యెను.

కిరీటి తిరిగి పదునేను దినములకు వచ్చెను. మనిసి కృశించిపోయెను. మొగమున తేజస్సు లేదు. ఆనాడు సాయంకాలమున ఇరువురును కలసి మరల వంతెన దాటిపోయి, పూర్వము కూర్చున్న చోటనే కూర్చుండిరి.

ధర్మా: కిరీటి! చాల చిక్కిపోయినావు. ఏమిటి కథ?

కిరీటి: అన్నా! మా అమ్మగారు నేను పోవునప్పటికి మరణావస్థలో ఉన్నది. కడచిన రెండు మూన్నాళ్ళ నుండి ఆమె "కిరీటి కిరీటి" అనుచున్నదట. మా మామకు కూడ ఉత్తరము వ్రాయించిరట; ఆయనే రాలేదు. మా అమ్మకు నేను వెళ్ళునప్పటికి స్మృతి లేదు. నాకామెను చూచినంతనే దుఃఖము పొంగి పొర వచ్చినది. నేను దగ్గఱ కూర్చుండి అమ్మా అని

పిలిచితిని ఆమె అంత స్మృతి లేకపోవుటలోనను, నా గొంతుక వినిపించినంతనే కన్ను తెఱచి మాటాడుటకు శక్తి లేక కన్నుల నీరు పెట్టుకొని చేయి నా మీద వైచెను చిన్నప్పటి నుండియు నేను మా అన్నదమ్ములలో కనిష్ఠుడనగుట చేత మా తల్లి నన్ను మిక్కిలి ప్రేమించుచుండెడిది అప్పుడు నేను నిత్య వ్యాధుల చేత మిక్కిలి బలహీనుడనుగా ఉండెడివాడను. మా నాయన నన్ను బడికిపొమ్మని వేధించెడవాడు. నా కోపిక లేదు. ఆయన నన్ను కొట్టును. మా తల్లి నన్నాదరించును నాకు పదునాఱేడులు వచ్చు వరకు సరిగా చదువు సాగలేదు. తరువాత మా అమ్మను నేను వదలిపెట్టి ఉండుట చాల కష్టముగా ఉండెను. నేను నెల్లూరులో చదువకుండ బందరులో చదువుటకు కారణము మా నాయనగారు. ఆయన నాయందెప్పుడును కఠినముగా ఉండెడివాడు. బందరులో మాకు చుట్టములున్నారు. వారి యింట తిని చదువుకొమ్మని నన్నచ్చట ఉంచెను. వారి యింట ఉండుట నాకు దుర్భటమైపోయె. నేను పూటకూళ్ళ యింటిలో చేరితిని. దానికి మా తండ్రి నన్ను తిట్టి, కొట్టి నా ప్రాణములు తీసెను. మా అమ్మ సర్వ విధముల నాకు ఆధారమైనది. నాకు పెండ్లి కాలేదని మా నాయనకు దిగులు లేదు. మా అమ్మయే ఆరాటపడెడిది. మిగిలిన ఆస్తి లేదు. చదివిన చదువు లేదు. నాకు వివాహమెట్లగును? అందులో మా తల్లి చనిపోయిన తరువాత మా మామ నాకు పిల్ల నిచ్చుట కంగీకరించనే అంగీకరించడు. మా అమ్మ చనిపోయినదనినను రానివాడు మాతో తానేమి సంబంధము పాటించును? ఆనాడు రాత్రికే శ్లేష్మము క్రమ్మెను. మా అమ్మ చనిపోయినది. గౌరీదేవి కైలాసము నుండి వచ్చినది, తిరిగిపోయినది. దౌర్భాగ్యుడనైన నాకు తల్లి ఎట్లు దక్కును! నేను సర్వదా దరిద్రుడనైతిని. కామధేనువో, కల్ప వృక్షమో అనుకొంటిని. అట్టి మాతృ వియోగము అనుభవించుచు నేను వినష్టుడనైతిని నాకు దిక్కెవ్వరు? ఇంక నాకు నా శశి లభించదు నాకా ఆశలును తెగిపోయినవి నేను బ్రతికి ఎందులకు? ఒకనాడు సాయంకాలము పినాకినీ నది వద్దకు పోతిని. నది కొంత యిసుక వదలిపెట్టి వేణిక దూరముగా పోయి అచట శరత్కాలము వలన తెల్లబడి ఉండెను. జలమే ఒండు విఱిగెనో, శరదాకాశము నదలో ప్రతిఫలించెనో, మాతృ విరహితుడనైన నన్ను చూచి నది విషాదమూర్తియై తెల తెలవోయెనో! నీటి ప్రవాహము మునుపటి అంత వేగముగా లేక కొంచెము మందగించెను. ప్రవాహమునకు ప్రక్కగా ఇసుకలో ఒక గుంట ఉండి ఆ గుంటలో నీరు ఏలిచెను. ఆ నీరు నిశ్చలముగా ఉన్నది శూన్య హృదయుడనైన నేనా జల సమీపమున కూర్చుండి నీటిలో చూచుచుంటిని. ఒక చిఱు కప్ప నీటిపైకి వచ్చి నన్ను చూచుచున్నది నే"నమ్మ యే"దని అడిగితిని. కప్ప నీటిలో మునక వేసెను. నీటిపైని గుండ్రముగా సన్న వలె ఒక జల రేఖ ఏర్పడెను ఆహా! ఏమి సమాధానము చెప్పినది! అచటి నుండి బయలుదేరి ఒడ్డుననున్న దేవాలయములోనికి పోయితిని సాయంకాలమగుట చేత వైష్ణవులు, స్త్రీ పురుషులు దేవాలయములోనికి ప్రవాహముగా వచ్చుచు పోవుచుండిరి. తల్లిపోయిన వాడని నన్నొక్క డాదరించలేదు. సర్వ జీవలోకము నా యెడ నంత నిర్దయమేలయైనదో! అప్పుడే చీకటులు పడుచుండెను. నాకు దుఃఖము తన్నుకొని వచ్చినది. ఇంటికి పోయితిని. మా అన్నలు, మా అప్పగార్లు, మా తండ్రియు ఏవో మాటాడు కొనుచునే ఉండిరి. వారికి మా అమ్మ చచ్చిపోయి నట్లు లేదు కాబోలు! నేనెవరు పిలిచిన మాట్లాడక నిత్యము శుష్కతలో చనుడనై ఉండుట చూచి వారు కొంచెము భయపడిరి. నా కష్టము నయించలేదు. నన్ను సర్వదా రక్షించిన తల్లిని చితి మీద పెట్టి కాల్చి వచ్చితిని. ఆమె వైతరణి సుఖముగా దాట వలయునని గోదానమిచ్చితిమి. ఆ గోవు తోక పట్టుకొని నేను కూడ నరక లోకమునకు పోదామను కొంటిని. కాని అమె పోవుచున్న త్రోవ నాకు విస్పష్టముగా కనిపించలేదు. ఎన్ని విధముల మా తల్లిని కలసికొందమన్నను అన్ని మార్గముల నిరాశయు, నిరుత్సాహమునే గోచరించెను. చివరకు నీవుంటివి కదా అని యిచ్చటికి వచ్చితిని. అన్నా! మా అమ్మ పోయినది" అని కిరీటి మొగమున చేతులుంచుకొని యేడ్వనారంభించెను. ధర్మారావు కిరీటి దుఃఖ మపనయించరానిదని తెలిసికొనెను. దుఃఖావేశ సమయమున నుచితాను చితములు పాటించరాదు. కిరీటిని వేయి కన్నుల కాచిననాని అతడు బ్రతుకునట్లు తోచలేదు. ధర్మారావతని చేరదీసి కౌగిలించుకొని "బాబూ! చనిపోయిన తల్లిని గొని రాలేనుగాని, మీ మామ వద్దకు పోయి యీ సంబంధము నీకు తప్పక అగునట్లు చేయగలను. శివరావున్నాడు. పశుపతి ఉన్నాడు. సూర్యపతి ఉన్నాడు. హరప్పనాయని చేత చెప్పించెదను ఎంత కలెక్టరైనను మీ మామ యుందరి మాట వినకపోవునా? నీకు తప్పకుండ శశిరేఖను సమకూర్చెదము భయములే"దని వీపు తడిమి చెప్పి, ఓదార్చి వెంట వేసికొని గ్రామములోనికి వచ్చెను అతడు భోజనము చేసినంతసేపు హాస్టలులో కూర్చుండి యిద్దరును కలిసి యింటికి పోయిరి కిరీటిలో క్రమ క్రమముగా దుఃఖము నిలువద్రొక్కుకొనెను. అతడు పూర్వము వలె దేనిని గుఱించియు మాటాడడు. నవ్వడు. చుట్టునున్న జనులు హాస్య రసములో మునిగి పోవనీ, అతని పెదవి మీద రేఖా మాత్రముగనైనను హాస్యము గోచరించదు. అతడు సరిగా అన్నము తినడు. ధర్మారావెంత చెప్పినను లాభము లేకపోయెను అతడు దారి వెంట పోవుచుండగా చూచిన ప్రతివారును అతడు మహాదుఃఖాంబు రాశి నిమగ్నుడని వెంటనే తెలిసికొనగలరు. కిరీటి ధర్మారావునట్టుకొని పండుకొనును ఉన్నట్లుండి ఊరకే కన్నుల నీరు పెట్టుకొనును ధర్మారావు కన్నీరు తుడచి దగ్గఱకు లాగుకొని గట్టిగా కౌగిలించుకొనును. చెక్కిలిపై చేయి వైచి సమాదరించును కిరీటి అప్పటికి శాంతించును. అతడు కాలేజీకి పోయినట్లే పోవును వచ్చినట్లే వచ్చును. దివారాత్రములు పుస్తకము అంటడు. అతని మనస్సులో హృదయములో శశిరేఖ ఒక్కతియే ఉన్నది తదితర సృష్టికి సంబంధమే లేదు. ఇట్లు రెండు నెలలు గడచినవి. అంతకంతకు కిరీటి దుఃఖము వర్ధమానమగుచుండెను కాని తగ్గుట లేదు. ధర్మారావునకేమి చేయవలయునో తెలియలేదు. ఒకనాడిర్వురును షికారు పోయిరి. తిరిగి వచ్చునపుడు కిరీటి నడువలేకపోయెను. ధర్మారావు "ఒంటిలో ఓపిక ఎచ్చటి నుండి వచ్చును? సరిగా అన్నమే తినవాయెను. బొమికలన్నియు బయటపడినవి. ఇంత దూరము నడువలేవు" అని యిర్వురును నెమ్మదిగా నడచి వచ్చిరి. హాస్టలులో తక్కిన వారందఱును కిరీటి యీ స్థితికి చాల విచారపడిరి. ధర్మారావు కళాశాలకు పోవును కిరీటి వాకిట నిలుచుండును. ధర్మారావెప్పుడు వచ్చునా అనియే ఎదురు చూచుచుండును. కళాశాల వదలి పెట్టిన తరువాత నిముసమైన ఆగక ధర్మారావు వచ్చును. అతని వంక కిరీటి ఱెప్ప వేయక చూచును. రెండు నెలల నుండి కిరీటి ఱెప్ప వేయుటయే లేదు అదే ఒకటే రీతిగా కన్నులలో ఉన్నాడమే గోచరించునట్లు ప్రతివాని వంకను చూచును. కిరీటి యీ ప్రణయ కథ విన్న ప్రతివారును అతని యెడ స్నిగ్ధులైరి. ఆహా! ఎంత ప్రేమశాలి! ఇట్టి స్థితిలో ఉండుటకెంత గాఢమైన శీలము కలవాడు కావలయును! ఇతని స్థితి చూచిన వారందఱు ఇతని మామను దూషించుచుండురు.

(ఇంకా ఉంది)

మీ వారికి పిచ్చెక్కిందని
ఎలా నిర్ధారణకు
చేసుకున్నారు?
ఈ మధ్య ప్రతి విషయా
నికి నాకెదురు చెప్పు
న్నారు ఇంతకంటే ఏం
కావాలి?
డాక్టర్
— శేఖర

# మన సంస్కారాలు ॐ విశేషాలు

ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

## వివాహం ద్వారా సామాజిక దేశాభ్యుదయాలు

వివాహ సంస్కారం ద్వారా "భార్యా భర్తృత్వ"మనే ధర్మాన్ని (డిగ్రీ) పొందిన దంపతులకే ఉత్తమ సంతానం కలుగుతుందనీ, అట్టి సంతానం బ్రహ్మ వర్చస్సు కలిగి శిష్ట జనులకు ప్రియమైనదౌతుందనీ, ఇక సంస్కారంలేని స్త్రీ పురుషుల సంతానం క్రూరబుద్ధితో అసత్యభాషణం, కూట సాక్ష్యం అన్యాయార్జితం వంటి పాపపు పనులకు పాల్పడి, వేద ధర్మములను, భూదేవతలను, ధార్మిక క్రియలను నిందిస్తూ భూభారంగాను లోక కంటకంగానూ బ్రతుకుతూంటుందనీ, కనుక మన సామాజిక వ్యవస్థయొక్క భవ్యభావి అంతా శాస్త్రీయమైన మన వివాహ వ్యవస్థ మీదనే ఆధారపడిఉందనీ కనుక. సంస్కారాలు చెడినచో మీద చూపిన విధంగా దౌర్జన్య దోష దూషితమైన దుష్ట సంతానం ప్రబలి తద్వారా మానవ సమాజం, తద్వారా దేశం దెబ్బ తింటాయని ఈ స్మృతి వాక్యం ఇలా సాక్ష్యమిస్తుంది.

"బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవాను పూర్వ్యశః

బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్ట సమ్మతాః

ఇతరేష్వే వశిష్టేషు నృశంసా నృత వాదినః

జాయంతే దుర్వివాహేషు బ్రహ్మ కర్మ ద్విషస్సుదాః"

(గత సంచిక తరువాయి)

కనుక మన పవిత్ర సంస్కారాలు చెడినప్పుడె మన సమాజం, దేశం చెడి పతిత మౌతాయనీ, ఈ కారణంచేత మన సామాజిక దేశాభ్యుదయాలు మన పవిత్ర సంస్కారాల నిర్వహణం మీదనే ఆధారపడి ఉన్నాయనీ అభివ్యక్తమయింది.

ఇక ఆదర్శ దంపతుల సత్సంతానం నుండి వచ్చిన జనులు త్యాగశీలం కలిగి సర్వ విధాలా సామాజికోన్నతికి, దేశాభ్యుదయానికి సహకరించే ఉత్తమ పౌరులుగా తయారౌతారు. ఇట్టి ఉత్తమ పౌరులలోంచి శ్రీరామునివంటి ధర్మమూర్తులు, ధర్మ ప్రభువులు, శివాజీవంటి వీర శిఖామణులు, రాధాకృష్ణ పండితునివంటి తత్త్వవేత్తలు, గాంధీ, పటేల్, రాజేంద్రప్రసాద్ వంటి నాయకోత్తములు లాల్‌బహదూర్‌శాస్త్రివంటి త్యాగమయ అమర జీవులు, రుద్రమదేవి, లక్ష్మీబాయివంటి వీర నారీమణులు, సీతా నసూయలవంటి పతివ్రతా మతల్లులు మొదలైనవారు. అట్టి ఆదర్శ దంపతుల ఉత్తమ సంతానంలోంచే తయారౌతారు. అట్టివారు తమ తల్లి దేశమునకు ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి దేశభావిని ఉన్నత శిఖరాలకు చేర్చగలిగి ఉంటారు. అట్టి ఆదర్శ పౌరులు ఆదర్శ దంపతులకే జన్మిస్తారు. ఆదర్శదాంపత్యానికి శాస్త్రీయ వివాహ సంస్కార నిర్వహణమే మూలం. ఈ విధంగా "వివాహ సంస్కారం" సామాజిక దేశీయాభ్యుదయసిద్ధికీ మూలమై ఉన్నట్లు శాస్త్రీయ నిదర్శనాల ద్వారా ఋజువయింది.




## సప్తపది

"వివాహ సంస్కారం" అనే ముత్యాలహారంలో "సప్తపదీ సంస్కారం", "నాయకమణి" వంటిది. ఈ సంస్కారంలో వరుడు వధువు యొక్క చేయి పట్టుకొని అగ్ని సన్నిధిలో ఆరున్నొక్క అడుగులు నడిపిస్తాడు. ఏడవ అడుగు వేసిన వెంటనే వధువు ("స్వగోత్రాద్భ్రశ్యతే నారీ వివాహాత్సప్తమే పదే) తన తండ్రి గోత్రాన్ని విడిచిపెట్టి భర్త గోత్రాన్ని స్వీకరిస్తుంది. "స్వగోత్రభ్రంశం, అన్యగోత్ర స్వీకరణం" అనే అపూర్వమైన యీ అద్భుత పరిణామాన్ని వధువులో ప్రవేశపెట్ట గలిగినది "సప్తపది"లోని ఒక్క "మంత్ర సంస్కారం" మాత్రమే అని అందరు అంగీకరించక తప్పదు. "ఈ సత్యాన్ని ఋజువుపరచే నిదర్శనాలెన్నో ఈ సంస్కారంలో కనిపిస్తాయి. ఉదాహరణకు కొన్ని నిదర్శనాలు చూపుతాను. వరుడు వధువులో గల "అలక్ష్మి" అనే దోషాన్ని తొలగించడానికిగాను దర్భలతో ఆమె పాపిడిగుండా తుడుస్తూ చెప్పే మంత్రంలోని భావం ఇది.

ఓ కళ్యాణీ! నీ భర్తకు హాని కలిగించే "అలక్ష్మి" అనే నీలోని దోషాన్ని ఈ దర్భలతో తుడిచి తొలగిస్తున్నాను" ("ఇదమహం యాత్వయి పతిఘ్నీ అలక్ష్మీస్తాం నిర్దిశామి)

ఇచ్చట మొదట వధువులో ఒక విధమైన దోషం ఉంది. ఇచ్చట పఠించే మంత్రంయొక్క ప్రభావంచేత ఆ దోషం మొదట తొలగింపబడి తద్వారా ఆమె మనస్సు నిర్మలంగా మలచబడుతూంది. దానితో నిర్మలమైన ఆ మనస్సులో పవిత్రభావన యేర్పడి తద్వారా ఏకాగ్రత, నిశ్చలత అనే శక్తులు క్రొత్తగా ఆమె మనస్సులో ఏర్పడుతున్నాయి. ఇట్లు మానవులలో ఉండే దోషాలను ముందు తొలగించి, అంతకుముందు లేని క్రొత్త శక్తులను వారిలో ప్రవేశపెట్టగల వైదిక క్రియలే "సంస్కారములు" అనిపించుకుంటాయి."

"ఆత్మ శరీరాంతర నిష్ఠః విహిత క్రియాజన్యః
అతిశయ విశేషస్సంస్కారః" (వీరమిత్రోదయం)

అని మనం ఈ ప్రకరణం మొదట తెలుసుకున్నాం. ఈ నిర్వచన ప్రకారంగా ప్రస్తుతంలో ఇచ్చట, మంత్రోచ్చారణ పూర్వకంగా దర్భలతో తుడిచెయ్యడం అనే వైదిక క్రియాచరణం ద్వారా తనలోని దోషం పోయి మనో నైర్మల్యం" అనే విశేషం పుట్టింది. ఇట్టివన్నీ "సంస్కారములు" అనే పదమునకు లక్ష్యాలుగా (నిదర్శనాలుగా) ఉంటాయని తేలింది. ఇట్లే బందీ కాడి రంధ్రం గుండా మంగళ సూత్రం నుండి నీటి బిందువులు వధువు శిరస్సు మీద స్రవింప జేయడం అనే

సంస్కారం చేయడం చేత వధువులో ఉండే కొన్ని రకాల రోగాలు పోయి తద్వారా ఆమె శరీరం సూర్య వర్చస్సు కలదిగా తయారౌతుంది.

ఈ సంస్కారం యొక్క ప్రత్యేకతను తెలిపే '**అపాల**' అనే ఆమెకు చెందిన ఒక గాథ ఇది. 'అపాల' అనే స్త్రీ తన శారీరక రోగాన్ని శాంతింప జేయమని ఇంద్రుణ్ణి ప్రార్థిస్తుంది. అతడు తన రథ చక్రం యొక్క ఆకుల మధ్య రంధ్రం గుండా ఆమె శరీరంపై పడునట్లు మూడు సార్లు నీటి ధార విడిచి పెట్టడం అనే సంస్కారం ద్వారా ఆమెను సూర్య వర్చస్సు కలదాన్నిగా మలుస్తాడు.

"...అపాలా మింద్రః త్రిః పూర్వ్యాకరత్ సూర్యవర్చసం"

అనే సంస్కారం చేయబడుతూంది. ఇట్టి ఈ సంస్కార ప్రభావంతో వధువు శరీరం కూడా అపాల శరీరం వలె మలచబడుతుంది. ఇట్టి సంస్కారాలు మానవులలో క్రొత్త శక్తులను ప్రవేశ పెడతాయన్న మాట. ప్రస్తుత విషయమైన సప్తపదీ సంస్కారం శాస్త్రోక్తంగా నిర్వహించడం చేత, అంతకు ముందు వధువులో ఉన్న భిన్న భావన మొదలైన దోషాలు పోయి వాని స్థానే వరుని భావంతో కలిసిన ఐక్య భావన, ఇంకా జన్మాంతరాల ఎంకా సడలని- స్నేహ రూప ప్రేమబంధం మొదలైన శక్తులు ఏర్పడతాయి. అప్పటి ఆ ప్రేమబంధం "ఎన్నెన్నో జన్మల బంధం"గా ఈ "సప్తపది"లోనే వధువులో ఏర్పడి అది వారిద్దరినీ ఏడడుగుల కాలంతో ఏకం చేస్తుంది.

## ఎప్పుడో!

ఎప్పుడో ఒక పుల్ల
పుటిక్కి పడిరాలుతుంది
మాట ఎక్కడో
మండుతూనే వుంటుంది
అగ్ని పర్వతం అట్టడుగున
అట్టుడుకుతూనే వుంటుంది
నిజమైన మార్పు
నివురు కప్పిన నిప్పులా వుంటుంది
అన్నిటికీ లంకె కుదిరి నప్పుడు
అణువిస్ఫోటన జరుగుతుంది
ఆశించిన వెలుగు
హఠాత్తుగా ఆవిర్భవిస్తుంది

—సౌభాగ్య

## సఖ్యం సాప్తపదీనం

- ప్రేమమయమైన అట్టి పవిత్ర స్నేహం, ఉత్తమ భావాలు కల ఇద్దరు వ్యక్తుల మధ్య అపురూపంగా అల్ప వ్యవధిలోనే, అనగా 7 మాటలు మాట్లాడుకొనేటంత అల్ప వ్యవధిలోనే ఏర్పడుతుంది. అట్టి పవిత్ర ప్రవిమల స్నేహాన్ని "సఖ్యం సాప్తపదీనం" అనే సార్థక నామంతో మన వారు వ్యవహరించారు. ఈ వైదిక సంప్రదాయాన్ని కాళిదాస కవీంద్రుడు తన కుమార సంభవ మహా కావ్యంలో ఇలా ప్రకాశింప జేశారు.

"... యతస్సతాం సన్నత గాత్రి సంగతం మనీషి భిస్సాప్తపదీన ముచ్యతే!!"

(కు. సం.)

ఇక్కడ "సతాం" అనే పద ప్రయోగం ద్వారా కాళిదాస కవి "సప్తపది"లోని వైదిక భావనను వ్యక్తం చేశారు. ఎట్లనగా "సంస్కారాలు" అనేది వ్యక్తులలోని దోషాలను తొలగించి వారి మనస్సులను వినిర్మలంగా చేయడం ద్వారా కొన్ని పవిత్ర శక్తులను ప్రవేశ పెట్టి అది వారిని సత్పురుషులుగా తీర్చి దిద్దుతాయి. ప్రస్తుతం కాళిదాస కవి యొక్క "సతాం" ప్రయోగంలో, ఇంతటి వైదిక భావన భాసిస్తుందని నా భావం. ఇట్టి కమనీయ గంభీర భావాలు నా- "కాళిదాస హృదయం"లో 66సం.లో ప్రకాశితాలై ఉన్నాయి ప్రస్తుతంలో వధూవరులు భావాలు కొన్ని సంస్కారాలతో నిర్మలములైన పిమ్మట అట్టి భావాలలో "సాప్తపదీన"మైన సఖ్యం ఏర్పడి అది వధూవరులలో "భార్యా భర్తృత్వం" వంటి అపూర్వ ధర్మాలను నూత్నంగా ప్రవేశపెడుతుందని ఫలితాంశం.

(ఇంకా ఉంది)




## రామాయణ్

ఈ వారం వాలికథ –ఇందులో తార రాజనీతి బాగుంది. కాని శ్రీరామచంద్రుడు వాలి ప్రశ్నలకు చెప్పిన సమాధానం సరిగ్గా అదికాదు ఈ కారణంగా రంగనాయకమ్మ రాముడిని తిట్టినా అసలు విషయం అతని దేశద్రోహం వాలి కుమార్ నారాయణ్ లాగా దేశరహస్యాలని పొలస్త్యునికి చేర వేస్తున్న గూఢచారి వాల్మీకంలో ఆ సూచన ఉంది. నాలుగు సముద్రాల్లో స్నానం చేసి. ఆతరువాత ఏం చేసేవాడో తాటాకులు పోయినయి అందుకే అచ్చులో లేదు. అంత బలవంతుడని పూర్తి చేశారు లేఖకులు. బౌద్ధ జైనులు వానిని చంపిన కారణం అన్యాయం అన్నట్లు ప్రక్షిప్తం చేశారు– రామ స్వామినాయకర్ త్రిపురనేని రామస్వామిగారు వాలి వధ ఆధారంగా రామనింద చేశారు.

కాని అది సరిగాదు. శ్రీరాముని తప్పులని వాలి వధనీ – శంబుక వధనీ – సీత అగ్ని పరీక్షనీ అనంతరం వదిలి పెట్టడాన్నీ ప్రతివాళ్ళూ తిడతారు– వాలి వధ గూఢచారి అని శంబుకుని రాజకీయ కారణం వల్ల. సీతా పరిత్యాగం కూడా రాజకీయ కారణాల వల్లా జరిగింది. మురారి అనర్ఘరాఘవం చదవక పోయినా స్వర్ణ సీత చదవండి. రుమని చెర బట్టటం ఆటవికుల ఆచారం – వాలి పోయిన అనంతరం తార సుగ్రీవుని భార్య అవుతుంది. అప్పుడు రాముడు ఏమీ అనలేదు దీన్నిబట్టి వాలి రాజద్రోహి అన్నది ఋజువవు తుంది. శ్రీరాముని జీవితంలో ఇలాటి మచ్చలులేవు. శ్రీరామ ద్వేషం పరమ వినాశకరం– ప్రతి విమర్శకుడూ రాముడిని విమర్శించటం గొప్ప అనుకుంటున్నారు అది సరికాదు


'అప్నే పరాయే'లో ఒక దృశ్యం

## మనసు గుర్రం లేదు కళ్ళెం

**ఈ నాటికలో ప్రొడ్యూసరుకి గుండె నొప్పిగా ఉన్నప్పుడు కరెంటు వచ్చింది. ఆరు గంటలకు పోయిన కరెంటు ఎనిమిది గంటలకు వచ్చింది – ప్రతిరోజూ** పగలు పన్నెండు గంటలకి పోయిన కరెంటు ఒకటిన్నరకి వస్తున్నది సాయంత్రం ఏడున్నరకి పోయి ఎనిమిదీ పదికి వస్తున్నది. మద్రాసు కర్నాటకల కన్న కరెంటు కోత మనకే ఎక్కువనుకుంటాను.

కరెంటు ఖరీదు విపరీతంగా పెంచారు. నెలకి కట్టేదీ సంవత్సరానికి ఒక్కసారిగా కట్టేదీ కలిపితే యూనిట్ రెండు రూపాయలు పడింది – ఇంత "సొమ్ము ప్రజల నెత్తిన వేస్తున్నారు పిల్లలు చదివే వేళ – ఆడబడుచులు వంట చేసే వేళ బావగార్లు టి. వి పేపర్లు చూసే వేళ ఇదనీ – కరెంటు పోకూడదనీ – ఒక టైములో తీస్తే దొంగలకి వీలనీ పగలు తీస్తే వ్యవసాయం పరిశ్రమలూ పోతాయనీ – రాత్రి తీస్తే సినిమా హాళ్ళూ ప్రజల దైనందిన జీవితమూ దెబ్బ తింటుందనీ సెంట్రల్లీ ఎయిర్ కండిషను భవనంలో ఉన్న అన్నగారికి తెలియ దనుకుంటాను. చేసుకున్నాం – అనుభవిస్తున్నాం కరెంటు పోయేప్పుడు ఆన్ చేసి ఉన్న బలుబులూ ట్యూబులైట్లూ టి వీ లూ ఫ్రిజిడేర్లూ – ఒక్క తడవ కరెంటు ఆన్ అయ్యేసరికి నాశనమవుతున్నాయి – కరెంటు ఖర్చు కాక బాగు చేతల బాధొకటి – కరెంటు పోవటం వలన పత్రికలకి వ్యాపారాలకి సినిమా హాళ్ళకు ప్రజావసరాలకి అన్నిటికీ నష్టం – విజయవాడలో కరెంటు బాధ ఇప్పుడే బయలు దేరింది టి.వి లో కొన్ని ప్రోగ్రాంలు పోతున్నాయి

## నృత్య నాటిక

సింగరేణి కాలనీస్ గర్ల్సు హైస్కూలు విద్యార్థినులు – చేసిన నృత్య నాటిక బాగుంది 7.30 కి కరెంటు పోయింది

కరెంటు వచ్చేసరికి అన్నగారు తన ఐనప చేగోడీల భావతో ప్రసంగిస్తున్నారు ఆర్థికంగా వైజ్ఞానికంగా సాధించవలసినవి ఎన్నో వున్నాయి తను ఎన్నో సంక్షేమ కార్యాలు నిర్వహించినా దరిద్రం అలాగ ఉంది విద్యారంగంలో అభివృద్ధి సాధించినప్పటికీ పయోజన విద్యలో అభివృద్ధి లేదు... వృద్ధరే కృషి ఆత్మానాం అని అన్నారు. వృద్ధరి అంటే అప్పు – అప్పు చేయటంలో ఆత్మశుద్ధిగా కృషి చేయటమా?.

## కిస్సా ఖాట్మండూమే

సత్యజిత్‌రాయ్ రచన. దేవేంద్ర మిత్ర స్మగ్లర్లనీ దొంగ డాక్టరునీ పట్టుకుని స్మగ్లర్లని పోలీసుల కప్ప చెప్పి డాక్టరుని నట్టడవిలో ఒదిలేస్తాడు. కథ అయిపోయింది. మొదటి కథ అర్థరహిత పిచ్చి ప్రక్రియ. ఒక అమాయకుడికి మరో లోకం వాడొచ్చి బైనాక్యులర్సు ఇవ్వటం అందులో తల్లుకున్నవి కనపడ్డం – రెండోది ఒక మిత్రుడు చనిపోతే అతని పరిశోధనని తనదిగా చేసుకుని మరో మిత్రుడిని చంపిన వాడికి మిత్రుడి దయ్యం వచ్చి తన పరిశోధన తీసుకుపోవడం కథ ఇక మూడోది కిస్సా ఖాట్మండూమే డిటెక్టివ్ కథ స్మగ్లర్లూ దొంగలూ ఊరికెనే దొరికిపోయారు శశికపూర్ శరీరానికి ఇవ్వ రాదని కాబోలు పై రెండింటికన్న ఈ మూడోది గుడ్డిలో మెల్ల □






నవంబర్1, ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం, ప్రకాశం అధ్యయన సంస్థ సంయుక్త ఆధ్వర్యంలో భాషా నిలయంలో జరిగిన ఆంధ్ర కేసరి ప్రకాశం సంస్మరణ సభలో ఆంధ్రకేసరి ప్రకాశం జీవిత చరిత్ర రచయిత డా అక్కిరాజు రమాపతిరావును వైద్య ఆరోగ్యశాఖా మంత్రి డా దగ్గుపాటి వెంకటేశ్వరరావు సన్మానిస్తున్న చిత్రం

## శ్రీ అక్కిరాజు రమాపతిరావుకు సత్కారం:-

నవంబర్ 1వ తేదీన జంట నగరాలలో ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ వివిధ కార్యక్రమాలు జరిగాయి. సంగీతోత్సవాలు, సాహిత్య సభలూ ప్రధానాకర్షణలు ఆ రోజున శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం, ప్రకాశం అధ్యయన సంస్థ సంయుక్త నిర్వహణలో శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయంలో రాష్ట్రావతరణ ఆనందోత్సవ సభ జరిగింది. ఈ సందర్భంగా ఆంధ్రకేసరి ప్రకాశం జీవిత చరిత్ర రచయిత డా అక్కిరాజు రమాపతిరావును పై రెండు సంస్థల వారు సత్కరించారు.

ఈ సభకు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రి శ్రీ పి. ఇంద్రారెడ్డి అధ్యక్షత వహించారు ముఖ్య అతిథిగా వైద్య, ఆరోగ్య శాఖామంత్రి డా దగ్గుపాటి వేంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు సభాసదులకు తొలుత ప్రకాశం అధ్యయన సంస్థ కార్యదర్శి డా. టి. సూర్యనారాయణరావు స్వాగతం పలికారు. నవంబర్ 1వ తేదీ ప్రాముఖ్యాన్ని, ఆంధ్ర రాష్ట్ర అవతరణం కోసం కృషి చేసిన ప్రముఖ త్యాగమూర్తులను ప్రశంసిస్తూ, తమ సంస్థ చేపట్టిన ముఖ్య కార్యక్రమాలను వివరించారు డాక్టర్ సూర్యనారాయణరావు. అటు తర్వాత దేశ భక్తి గేయాలు వినిపించారు ప్రకాశం అధ్యయన సంస్థ బృందం వారు. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు మాట్లాడుతూ బూర్గుల రామకృష్ణారావు, టంగుటూరి ప్రకాశం పంతులు, అమర జీవి పొట్టి శ్రీరాముల అకుంఠిత సేవా త్యాగ దీక్షా ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం జరిగిందన్నారు ఈ ముగ్గురు మహా పురుషులను అవశ్యం తలచుకొని వారి త్యాగాన్ని కొనియాడాలని అభిభాషించారు అటు తర్వాత ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు తమ తరం వారిని ప్రకాశం పంతులుగారు ఎంతో ఉత్తేజితులను చేశారని, ఆంధ్రోద్యమం ఆ రోజుల్లో యువకులను చాలా ప్రభావితం చేసిందనీ, ఏ జాతి అయినా తమ మహా పురుషుల నుంచే స్ఫూర్తినీ, చైతన్యాన్నీ పొందుతుందని, తెలుగు మహా పురుషులలో ఈ తరంలో అగ్రగణ్యుడైన ప్రకాశం పంతులుగారి జీవిత చరిత్రను ఉన్నత పాఠశాల విద్యార్థులకు ఉపవాచకంగా నిర్ణయించినందుకు విద్యాశాఖ వారిని అభినందిస్తున్నానని అన్నారు. పిదప మంత్రి. ముఖ్య అతిథి డాక్టర్ దగ్గుపాటి వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ, ప్రజాస్వామ్య వ్యవస్థ మనుగడకు ప్రజల బాధ్యత ఎక్కువగా ఉంటుందనీ, ఎటువంటి అవాంఛనీయ పరిణామాలు కలగకుండా ప్రజాస్వామ్యం సాఫీగా, బలంగా సాదుకోవాలంటే విద్యావంతులు అప్రమత్తులై ఉండాలనీ, రాబోయే తరం వారికి తగిన సామాజిక పరిజ్ఞానం, సాంఘిక బాధ్యతా స్పృహ, విచక్షణా, సంస్కారం కలగటానికి త్యాగ నిరతికి ప్రసిద్ధులైన మహనీయుల జీవిత చరిత్రలు ఎంతగానో ఉపకరిస్తాయనీ, ఆంధ్రోద్యమానికి అన్ని విధాలా చేయూత నిచ్చిన ముఖ్య నాయకుడైన ప్రకాశంగారి జీవిత చరిత్రను పాఠశాల విద్యార్థులకు వాచకంగా వ్రాసిన డా రమాపతిరావును సత్కరించడం తమకెంతో సంతోషంగా ఉందనీ అన్నారు

అనంతరం విద్యా మంత్రి శ్రీ ఎ ఇంద్రా రెడ్డి ప్రసంగిస్తూ స్వాతంత్ర్యం సిద్ధించినా మన విద్యా

### ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుకు, ఆయన కుటుంబ సభ్యులకు ఉన్న మిగులు భూములు - 1984 మే గణాంకాలు

| | మొత్తం భూమి | ఉంచుకోదగిన భూమి (చదరపు మీటర్లలో) | మిగులు |
|---|---|---|---|
| **ఎన్. టి. రామారావు** | 22,078.00 | 1340.00 | 20,738.00 |
| **ఎన్. జయకృష్ణ** | 4533.60 | 1000.00 | 3533.60 |
| **ఎన్. సాయికృష్ణ** | 4533.60 | 1000.00 | 3533.60 |
| **ఎన్. హరికృష్ణ** | 4533.60 | 1000.00 | 3533.60 |
| **ఎన్. మోహనకృష్ణ** | 4533.60 | 1000.00 | 3533.60 |
| **ఎన్. బాలకృష్ణ** | 3533.60 | 1000.00 | 2533.60 |
| **ఎన్. పురందరేశ్వరి** | 3126.20 | 1000.00 | 2126.20 |
| **ఎన్. రామకృష్ణ** | 1972.04 | 1000.00 | 972.04 |
| **ఎన్. ఉమామహేశ్వరి** | 2630.45 | 1000.00 | 1630.45 |
| **ఎన్. లోకేశ్వరి** | 1563.09 | 1000.00 | 563.09 |
| **ఎన్. జయశంకరకృష్ణ** | 1972.04 | 1000.00 | 972.04 |




ఇటీవల హైదరాబాద్‌లోని త్యాగరాయ గాన సభలో చైతన్య ఆర్ట్ థియేటర్స్ (హైదరాబాద్) నిర్వహణలో పాఠశాలల విద్యార్థులకు పోటీలు నిర్వహించి బహుమతులు అందజేసారు వేదికపై ఉన్న శ్రీ కె. కె. రాజా (సేల్స్ మేనేజర్, హైదరాబాద్ బాట్లింగ్ కంపెనీ), శ్రీ బి. యన్ రెడ్డి (ప్రముఖ వాస్తు శిల్పి), డా. మాల కొండారెడ్డి (అధ్యక్షులు చైతన్య ఆర్ట్ థియేటర్స్), శ్రీ జాదురత్న బి. ఏ. పట్టాభిరాంలని చిత్రంలో చూడవచ్చు.

# హైదరాబాద్ నోట్‌బుక్

విధానంలో మౌలికమైన మార్పులేమీ చోటు చేసుకోకపోవడం దురదృష్టకరమనీ, అలనాటి బ్రిటిషు ప్రభుత్వవలస రాజ్య విద్యా విధానమే పెద్ద మార్పులేమీ లేకుండా కొనసాగుతూ ఉందనీ తెలుగు దేశం ప్రభుత్వం పాఠశాల విద్యా విధానాన్ని సామాజిక ప్రయోజనకరంగా తీర్చి దిద్దటానికి కృత నిశ్చయంతో ఉన్నదనీ, అందుకే పాఠ్య ప్రణాళికను తొలి తరగతుల నుంచీ చివరి తరగతుల వరకూ పునర్విమర్శ చేయించి మూల్యాంకనం చేసి రూపొందింప జేస్తున్నామనీ చెప్పారు. అందులోని భాగంగానే జాతిని ఉత్తేజితం చేసిన మహా పురుషుల జీవిత చరిత్రలను ఉపవాచకాలుగా పాఠశాల విద్యార్థులు చదవాలని నిర్ణయించామనీ అన్నారు పిదప ఆంధ్ర కేసరి పకాశం జీవిత చరిత్ర రచయితను శాలువతో, పూలమాలతో మంత్రి డాక్టర్ దగ్గుపాటి వెంకటేశ్వరరావు సన్మానించారు. నగరంలోని రెండు ఉన్నత పాఠశాలలకు చెందిన 9వ తరగతి విద్యార్థులు ప్రకాశం పంతులుగారి జీవిత చరిత్ర చదివిన తరువాత తమకు కలిగిన భావాలను వివరించారు ఈ పుస్తకం తమను బాగా ఆకర్షించిందని చి. ప్రసాద్, కుమారి అన్నపూర్ణ వివరించారు. తదనంతరం ప్రకాశం జీవిత చరిత్ర రచయిత డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ మొత్తం 10 ప్రకరణాలలో ప్రతి ప్రకరణం ఆద్యంతాలలో ప్రకాశం పంతులు త్యాగ సాహస జీవిత గాథకు సంబంధించిన ఉదంతాలను చిన్న చిన్న కథలుగా మలచి సులభ శైలిలో చిన్న చిన్న వాక్యాలలో పిల్లల మనస్సులకు హత్తుకునేట్లుగా ఈ గ్రంథం రచించామని చెప్పారు ఆధునిక స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పాఠ్య గ్రంథంగా ఉండాలన్నారు ఆంధ్రకేసరి ప్రకాశం- గ్రంథాన్ని సమీక్షించిన ఆంధ్రప్రదేశ్ సర్వీస్ కమిషన్ మాజీ సభ్యులు శ్రీ టి వి. నారాయణ మాట్లాడుతూ పెద్దలూ చిన్నలూ, వివిధ వృత్తులలో పైకి రావాలనుకుంటున్న వారూ అందరూ ప్రకాశం పంతులుగారి జీవిత చరిత్రనుంచి నేర్చుకోవలసిన విషయాలు చాల ఉన్నాయన్నారు. ఈ గ్రంథా[illegible] చిన్న చిన్న కథలుగా పురాణ ఐతిహాసిక గాథలనుకూడా అక్కడక్కడ ప్రసక్తం చేస్తూ రచించిన తీరు ఎంతో హృద్యంగా ఉందన్నారు. చివరి ప్రకరణమైన వీరగాథలునుంచి శ్రీ నారాయణ రెండు మూడు ఉదాహరణలు వివరించారు. భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎమ్ ఎల్. నరసింహారావు తెలంగాణ సాహిత్య సాంస్కృతిక సామాజిక భావ వికాసానికి శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం గావించిన కృషిని వివరించి ప్రకాశం పంతులుగారి వంటి త్యాగధనుడి సంస్మరణ సభ జరుపుకోవడం తమకెంతో ఆనందంగా ఉందన్నారు డాక్టర్ రమాపతిరావుకు సన్మానం జరుగుతుండగా ఆయన రమాపతిరావు సాహిత్య కృషిని సభ వారికి పరిచయం చేశారు భాషా నిలయం సంయుక్త కార్యదర్శి శ్రీ జనార్దనరావు వందన సమర్పణ చేయగా, ప్రకాశం అధ్యయన సంస్థ బృందం వారి జనగణమన జాతీయ గీతాలాపంతో సభ సమాప్తమైంది.

**ఉపశ్రుతి:**

ప్రభుత్వ కార్యాలయాలలో నా ప[illegible] ముందుకు సాగడం లేదు. ఏం చేయను?- [illegible] ఒక మిత్రునితో ఒక సందర్భంలో. కాంచన[illegible] మోచనం కదా- అని వ్యంగ్యంగా సూచన[illegible] మిత్రుడు. అంతా డ[illegible] జరుగుతుందనుకొనేవాడు డబ్బు కోస[illegible] గడ్డయినా కరుస్తాడని బెంజమిన్ ఫ్రాంక్లి[illegible] అన్నాడండీ- అని మా సంభాషణ వింటున్న ఒక పెద్ద మనిషి అన్నాడు.

– తిరుమల రామచంద్ర

## ఎ. వి. ఎం. ఆడియో క్యాసెట్లు రికార్డులలో భక్తి గీతాలు

తిరుమల శ్రీవెంకటేశ్వరుణ్ణి వందలాది సంవత్సరాలుగా భారతీయులు ఆరాధిస్తున్నారు

తిరుమల శ్రీ వెంకటేశ్వరుని పూజా విధానంలో ఒక భాగమైన వెంకటేశ్వర సుప్రభాతం గతంలో ఎంతో మంది గానం చేశారు ఇప్పుడు ప్రముఖ సినీ నేపథ్య గాయకుడు శ్రీ ఎస్ పి బాలసుబ్రమణ్యం తమ కమనీయ కంఠంతో శ్రావ్యంగా 'సుప్రభాతం' గానామృతాన్ని వినిపిస్తున్నారు 'ఎ వి ఎం ఆడియో' వారి ఆధ్వర్యంలో క్యాసెట్ (ఎం ఇ ఐ - ఎస్. ఆర్ – 1138/- రు. 25.00)లలోను ఎల్. పి. రికార్డ్ (1000–305/ రు. 53–00) లలోను ఎస్. పి. 'సుప్రభాతం' విడుదలయ్యింది ఒక ప్రక్క సుప్రభాతం మరో ప్రక్క శ్రీనివాస గద్యం, అన్నమయ్య గీతాలు 'పంచెహం జగత్ పల్లభ, 'నంద కథరానంద గోప' రికార్డు చేయబడ్డాయి

అలాగే ప్రముఖ సినీ నేపథ్య గాయనీమణి శ్రీమతి పి సుశీల కమనీయ కంఠంతో స్వర్గీయ పెండ్యాల సంగీతం కూర్చిన లీలా శుక 'శ్రీకృష్ణ కర్ణామృతం' ఎ. వి ఎం. ఆడియో వారు విడుదల చేశారు. కృష్ణతత్వంపై పరిశోధన జరిపిన శ్రీ సాయికృష్ణ యాచేంద్ర ఎంపిక చేసిన శ్లోకాలను శ్రీమతి సుశీల తమ కమనీయ కంఠంతో గానం చేశారు. వివరాలకు ఎ వి ఎం ఆడియో, ఎ వి. ఎం స్టూడియోస్, మద్రాసు – 600006 కు సంప్రదించవచ్చు

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor: M. Madhava Rao, Chief Editor: S. Radhakrishna.
Phones: Business: 61247, 61248, 75569 Editorial: 75667